# 'హాసం'
# నిక్షిప్త చిత్రాలు



కాంతారావు, జగయ్య, ఎన్.టి.ఆర్.తో ఘంటసాల



(కుడినుండి) ఉషా మంగేష్కర్, ఎస్.డి.బర్మన్, లతా మంగేష్కర్, కాసు బ్రహ్మానందరెడ్డి (నిలబడి ప్రసంగిస్తున్న వ్యక్తి) తదితరులతో ఘంటసాల

హాసం
హాస్య-సంగీత పత్రిక

**Also available on net:**
**www.haasam.com**



ముఖచిత్రం
'ఒకరికి ఒకరు' లో
ఆర్తి ఛాబ్రియ

# ఇవీ సంగతులు

49

## హాస్యం





'సెంటర్ స్ప్రెడ్' లో









సినిమా పాటల పుస్తకాలు
కలర్‌లో

## సంగీతం



పాటల
ప్రత్యేకం

71,
72,
73,
74,
పేజీల్లో






ప్రతి పక్షం 'హాసం' కొంటూ చదువుతూ ఆనందిస్తున్న అనేకమంది పాఠకులలో నేనూ ఒకడిని. ఈ ఉత్తరంతో పాటు జత పరచిన రెండు వందల రూ॥ల డ్రాఫ్ట్ (నం. 596493) సం॥ చందాకే అయినా చందా దారుడు మటుకు నేను కాను.

సెప్టెంబరు 16-30 సంచికలో బాపట్ల నుండి మాధవి గారు 'ప్రయోజనవాక్యం' శీర్షికలో "కొనే స్థోమతలేకపోయినా కొని చదువుతున్నాను" అని రాసినది చదివినప్పుడు మనస్సు చివుక్కుమంది. ఆ తెలుగింటి ఆడపడుచుకి దసరా 'కానుక' గా సం॥ చందా కట్టాలనిపించి ఈ విధంగా డబ్బు పంపిస్తున్నాను. మీ ఆఫీసుకి రాసిన ఉత్తరంలో అమె తన చిరునామా రాసే ఉంటారనీ, మీరు నా ఈ చిన్ని అభ్యర్థనను మన్నించి ఆమె పేరిట ఈ చందా మొత్తం జమకట్టి రాబోయే సంచికనుండి మాధవి గారికి హాసం క్రమంగా అందేలాగ చేస్తారనే ఆశతో నమ్మకంతో ఈ ధైర్యం చేస్తున్నాను.

కొసమెరుపు: పుస్తకం హస్త భూషణం అని చమత్కార / వ్యంగ్య ధోరణిలో ఎప్పటినుండో అంటున్నా, మనం వింటున్నా కల్తీలేని మనసులో మాటగా 'హాసం హస్త భూషణం' అని మనం అనుకోవడం సమంజసమేనేమో!

**- పింగళి శ్రీనివాస్, విశాఖపట్నం**

చిరంజీవి సి.వి.యస్. మాధవి రాసిన ఉత్తరంలో తన అడ్రసును పేర్కొనలేదు. మీ ఈ లేఖ చూశాక, ఆమె తన అడ్రసును 'హాసం'కు పంపిస్తుందన్న నమ్మకంతో మీ డ్రాఫ్టుని డిపాజిట్ చెయ్యకుండా మా వద్దనే వుంచుతున్నాము. అడ్రసు దొరికిన వెంటనే కన్ఫర్మ్ చేసుకుని రెగ్యులర్‌గా 'హాసం' ఆమెకు పంపుతాము. మీవంటి సంస్కారవంతుల్ని పాఠకులుగా పొందినందుకు 'హాసం' గర్విస్తోంది.

**- ఎడిటర్**

కాల గమనంలో రెండు వసంతాలు అవలీలగా గడిచిపోయాయి. ప్రతి పున్నమికి, అమావాస్యకు 'హాసం' నిరంతరాయంగా వస్తూనే ఉంది. వ్రాసిన ఆర్టికల్ వ్రాయకుండా, ప్రతి సంచికలోనూ ఏదో నూతనత్వం సంతరించు కుంటూ మాకు అందుబాటులోనే ఉంటోంది.

ఇది వరకు 10 మంది కలిస్తే ముఖ్యంగా పెళ్లిళ్ళు, పేరంటాలు, అంత్యాక్షరి అని పేకాటలని టైమ్ గడిచేది. ఇప్పుడు నలుగురు కలిస్తే చాలు 'హాసం' చదివావా? అని అందరూ తలో ఆర్టికల్ తలచుకోవటం, అన్ని వయసులవాళ్లు ఆ సభలో ఇమిడిపోవటం ఎన్నో చూశాను.

ఎప్పుడో 1980 ప్రాంతంలో "మెరుపంత" అనే మినీ కవితలు వ్రాసిన 'రాజా' కవితలు ఇంకా మదిలో కదుల్తున్నాయ్, ఆ బుక్ బాగా నలిగిపోయింది. చదివి చదివి దాన్ని ఆ స్థితిలో చూడలేకపోతున్నా.

చిన్న రిక్వెస్ట్ - వాటిని రాబోయే సంచికలలో ప్రచురించండి. మిస్ అయిన ఎందరో అభిమానులు సంతసిస్తారు.

హాస్య సంగీత రంగాలను ఆమూలాగ్రంగా ప్రస్తావించే మీ పత్రిక మరింత ప్రవర్ధమానమై ఈ రంగంలో విజయోత్సవాలు జరుపుకోవాలని ఆ విరాణ్మాత కటాక్షం మీకు సదా కలగాలని ఆశిస్తూ హాసమాభిమాని

**- వై శివరామప్రసాద్, సంగీత విభాగం, ఉషాకిరణ్ మూవీస్, రామోజీ ఫిలింసిటీ, హైదరాబాద్.**

ఇంటిల్లిపాది చదువుకునే కుటుంబ పత్రిక 'హాసం'. ప్రతి శీర్షిక హైలైట్‌గా సాగుతున్నాయి. పక్షం పక్షం ఎప్పుడు వస్తుందా అని 'హాసం' కోసం ఎదురు చూసే విధంగా పుస్తకాన్ని రూపొందిస్తున్న సంపాదక వర్గానికి మా అభినందనలు. మిస్టర్ పెళ్లాం లాంటి ఫోటో సీరియల్ మాకెంతో నచ్చింది. గతంలో ఇద్దరు మిత్రులు బైండింగ్ చేసుకున్నాం.

**-ఉమామోహన్, పుంగనూర్.**

1.9.2003 హాసంలో 'వామ్మోవాపు' కథ చదివాను. చాలా సీరియస్‌గా నడిచి, చివరలో ముగింపు చూశాక ఎంత ఆలోచింప జేసిందో, అంతా నవ్వించింది. కథలో అంతర్లీనంగా నేటి యువతకు సంబంధించిన సమస్యలు సినిమాపిచ్చి, ప్రజాసమస్యలకంటే సినిమా హీరో ఆరోగ్యం గొప్పంటూ ప్రజలు, కాని అవి నిజ జీవితంలో ఎలా వుంటాయో చక్కగా చెప్పారు. ఒక సందేశాన్ని అందించారు. నటన, నటనలాగే ఉండాలి. అది జనాన్ని మెప్పించాలి. అది నిజం అనిపించేలా ఉండాలి. అలా మెప్పించేదే నటన, వారే నటులు. మిగిలినవారు తారలు. ముగింపులో 'శివశంకరీ శివానంద లహరి' మొదలగు పాటలవల్ల వాపు తగ్గినట్లు, కొన్ని రాగాలతో జబ్బులు తగ్గుతాయనే విషయం నిత్యసత్యమేకదా!

హాస్యంతో చక్కని సందేశాన్ని యువతకు, ప్రజలకు మంచి ఆలోచనను రేకెత్తిస్తూ రాసిన వారణాసి రామకృష్ణగారికి అభినందనలు.

**-దాసరి సత్యనారాయణ, ఉప్పాడ**

16-30 సెప్టెంబరు 'హాసం' సంచికలో హేమంత్‌కుమార్ వర్ధంతి వ్యాసం తన ప్రతిభకు అద్దం పట్టేదిగా వుంది. వేటూరి కలం ద్వారా జాలువారిన రమ్య సంగీత రసఝరి రమేష్‌నాయుడు గారి స్మృతులు, నా మనస్సును ఆకట్టు కున్నాయి. పి.బి.శ్రీనివాస్ తన అభిమాన గాయని లతా మంగేష్కర్ సీరియల్ వ్యాసం ద్వారా, మరుగుపడిన ఎన్నో వాస్తవాలను, పాఠకుల దృష్టికి తేవడం అభినందనీయం. అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం శీర్షికన, 'జంగ్లీ' చిత్రంలోని హస్రత్ జైపురి 'ఎహసాన్ తెరాహోగా ముజ్‌పర్' పాటలోని సాహిత్యం చాలా అద్భుతమైన చెరగని క్లాసిక్ అందించినందుకు హాట్సాఫ్.

**- ఎన్.సారంగపాణి, గుంతకల్లు**

16-30 సెప్టెంబరు 2003 'హాసం' ఈ వంక 'సంపాదకీయం' ఆ వంక (చివరి అట్టలో లోన) - ఏ 'వంకా'లేక అత్యుత్తమ శైలిలో ఉన్నాయి. ప్రత్యేకించి చివరి అట్ట లోపలి భాగం 'అట్టహాసం'గా ఉండి 'హాసం' అట్ట స్థాయిని నిలబెట్టింది. బాపుగారి 'అందాలరాముడి' అందాలు కనువిందు చేసాయంటే నమ్మండి. వేసిన (బొమ్మ) బాపుగారికి- రాసిన రమణగారికీ మరి మీకూ - పుట్టినరోజు నాటి నెలబాలుడు అందాలరాముడు శ్రీ ఏయన్నార్ గారికీ - మా తీపి తీపి జేజేలు.

**- ఓలేటి వెంకట సుబ్బారావు, సీతాదేవి, విజయవాడ.**

16-30 సెప్టెంబరు పక్ష పత్రిక చాలా బాగుంది. అంతేరా బామ్మర్ది, జోక్స్, మిస్టర్ పెళ్లాం సిన నవల మాకెంతో నవ్వు తెప్పించాయి. అలాగే నాకెంతో ఇష్టమైన ఎస్.పి.బాలుగారి మధుర గుళికల్లోని 'తాళికట్టు శుభవేళ' మాతృక గూర్చి ఆత్రేయ గారి కలం నుంచి జారివడిన ఆణిముత్యం గూర్చి గోపాలకృష్ణగారు తెలిపినందుకు వారికి నా నమస్సుమాంజులు. సాంస్కృతిక, సంగీత విలువలు తరుగుతున్న ఈ రోజుల్లో ఆనాటి మధుర జ్ఞాపకంలా పాఠకుల వెన్నుతట్టి, ఎలాంటి భేషజం లేకుండా ఎంత ఎదిగినా ఒదిగే వృక్షంలా, తన తోటి సంగీత కళాకారుల, రచయితల జీవిత సత్యాలను అందిస్తున్న వేటూరి గారికి నా హృదయపూర్వక పాదాభివందనం అర్పిస్తున్నాను. ఆచార్య తిరుమల గారు తెలుగు మర్చిపోతున్న ప్రజలను చేరువగా చేర్చడానికి ప్రయత్నిస్తూ అందిస్తున్న ప్రతి శీర్షిక హర్షనీయం, అభినందనం. ఇందులో దొరుకుతున్న అమృత బాండారాన్ని ప్రతి తెలుగువారు కొని చదివి, నేను తెలుగు వాడిని నేను 'హాసం' అభిమానిని అని గర్వంగా చెప్పుకోవాలని ఆశిస్తున్నాను.

**జె.నాగేష్, ఫిలింనగర్, హైదరాబాద్.**

'హాసం' పత్రిక మా ఇంట్లో అందరం అభిమానించే పత్రిక. మా నాన్నగారు పోలీసు ఆఫీసరు అయినా వారికీ 'హాసం' అంటే ఎంతో ఇష్టం. ముఖ్యంగా మా అందరికీ పాత తెలుగు చిత్రాల పాటలు చాలా చాలా ఇష్టం. 'హాసం-జయనగర్ క్లబ్' ఆరంభించాలని ఆలోచన!

**-వై.ప్రజ్వలిక, బెంగుళూరు.**

సంపుటి: 3 సంచిక: 1

**1-15 అక్టోబరు 2003**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
**డా॥ కె.వి.రావు**
**జె.మధుసూదన శర్మ**



**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com



Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

49

రెండవ వార్షికోత్సవం సందర్భంగా పాఠకుల మనోభావాలను గ్రహించడానికి 'హాసం' నిర్వహించిన సర్వేలో సినిమా పాటల పుస్తకాల గురించి కొన్ని అభిప్రాయాలు తెలియవచ్చాయి:

"మీరు కొత్త సినిమా పాటలు పుస్తకాలు మాత్రమే వేస్తున్నారేం? పాత సినిమా పాటల పుస్తకాల మాటేమిటి?"

"పాత సినిమా పాటలు వేయడం ఈ మధ్య తగ్గించారు. అయినా అనేక హిట్‌సాంగ్స్ ఉన్న సినిమాలో మచ్చుకొక పాట వేసి ఊరుకుంటే ఎలా?"

"చిన్నప్పుడు సరదాపడి కొనుక్కున్న పాటల పుస్తకాలు మా అమ్మా నాన్నా పారేశారు. వాళ్ల కంటపడకుండా దాచుకున్నవి కాస్తా ఇళ్లు మారడాలలో పోయాయి. ఆనాటి పాటల పుస్తకం మళ్లీ వేస్తే భద్రంగా దాచుకుంటాను"

"అప్పుడు నోటికి వచ్చిన పాటలే ఇప్పుడు లిరిక్ మరుపునపడి కాసెట్‌లో వినబోతే మాటలు స్పష్టంగా తెలియటం లేదు. ఒరిజినల్‌వి కావేమో, చాలా కాసెట్స్‌లో స్పష్టత లోపిస్తోంది. అప్పట్లో కొన్ని మాటల కర్థాలు తెలియక కొట్టుమిట్టులాడేవాళ్లం. ఇప్పుడు నిఘంటువు దగ్గర పెట్టుకుని చూడబోతే ఆ మాట సరిగ్గా వినబడటమే లేదు."

ఇవన్నీ మధ్యవయస్కుల అభిప్రాయాలయితే పిన్న వయస్కులు ఇలా అంటున్నారు:

"మా అన్నయ్య టైములో పాటల పుస్తకాలు ఉండేవిట. నేను స్కూలుకెళ్లిన '80 - 90' లలో పాటల పుస్తకాలే లేవు. విశ్వనాథ్‌గారి సినిమాలైనా సరే! వేటూరి సాహిత్యమైనా సరే! ఏదీ గ్రంథస్థం కాలేదు. అందువల్ల కరక్టని తోచినదేదో పాడుకోవడమే కానీ ఖచ్చితంగా ఇదీ అని చెప్పలేం. ఆ రోజుల పాటల పుస్తకాలు ఎందుకు వేయకూడదు?"

"పోటీల్లో పాత పాటలు పాడితే చప్పట్లు పడతాయి కానీ ఎంత బాగాపాడినా సాహిత్యంలో చిన్న పొరబాటు దొర్లితే చాలు, బహుమతి రాదు. తప్పుల్లేకుండా ఆనాటి లిరిక్స్ ఇస్తే మాకు ఉపయోగంగా ఉంటుంది."

"పాటతో బాటు సందర్భం తెలిస్తే భావయుక్తంగా పాడవచ్చు. టీవీలో ఆ సినిమాలు వేసే టైమింగ్స్ మాకు కుదరవు. ఒక్కోప్పుడు పాట కట్ చేసేస్తారు కూడా. ఎవరైనా సినిమా కథ చెబితే బాగుండును."

ఇంతమంది ముచ్చట పడుతూంటే కాదని ఎవరనగలరు - పైగా ఇవన్నీ వాస్తవాలే అయినప్పుడు!? ఈ సంచికలోనే కనబడే 'వేటూరి సాహితీ సమితి' యాడ్ చూసినప్పుడు తెలుస్తుంది లిరిక్స్ పట్ల మన జాతి ఇంతకాలమూ ఎంత అశ్రద్ధగా ఉందో! 'హాసం' వెలసిన తర్వాతనైనా పరిస్థితి మెరుగుపడాలిగా! 'హాసం' వద్ద స్వయంగా సేకరించినవి, పాఠకులు ఉదారంగా ఇచ్చినవి అనేక పాటల పుస్తకాలున్నాయి. పాటల పుస్తకాలు వెలువడని 80ల, 90ల నాటి సినిమాల తాలూకు వివరాలున్నాయి. మూడవ సంవత్సరంలో అడుగిడుతున్న శుభ సందర్భాన ఇప్పటినుండి ప్రతీ సంచికతో బాటు సమగ్రమైన పాటల పుస్తకాన్ని ఒకదాన్ని అందించడానికి సంకల్పించాం. కథ కనుగుణంగా రాసిన పాటలు కాబట్టి కథా సంగ్రహం చేర్చడం సముచితమనిపించింది.

ఏ సినిమా పాటల పుస్తకాల నందించాలన్న విషయంలో కూడా మేము స్పష్టమైన అవగాహనతో ఉన్నాము. తేదీల క్రమంతో గాని, బ్యానర్‌తో గాని సంబంధం లేకుండా అన్ని పాటలూ బహుళ ప్రజాదరణ పొంది ఉండడం, నేటికీ ఆడియో లభ్యం కావడం అనే రెండు అంశాలను దృష్టిలో పెట్టుకోవడం జరుగుతోంది. అరుదైన పాటలకు వేదికకాదిది. వయోభేదం లేకుండా అందరినీ అలరించేందుకు ఉద్దేశించిన శీర్షిక ఇది.

తొలి కానుకగా 'మూగమనసులు' పాటల పుస్తకాన్ని అందిస్తున్నాం. ఈ ప్రయత్నంలో కూడా మీ అభిమానాన్ని చూడగలమనే ఆశతో పురోగమిస్తున్నాం.



# నీకు నేను నాకు నువ్వు



**- ఎ.వి.ఎస్.శ్రీనివాస్**

**తె**ల్లవారుఝామున 3గం॥ల సమయాన బాత్‌రూమ్‌కెళ్దామని లేచిన సుబ్బు ఉరఫ్ సుబ్బారావు... అదేనండి మన హీరో... అలవాటుగా దిండు ప్రక్కన తడిమాడు. డిమ్ లైటు పరుచుకున్న నీలి వెలుగులో కళ్ళు పొడుచుకుని మరీ వెతికాడు. లైటు వేస్తే నిద్రలోనున్న వారికి నిద్రాభంగం అవుతుందేమోనని ఆగాడు. మనసంతా ఆందోళనకు గురైంది. మత్తు చిత్తైంది. కంగారుతో మంచం క్రింద, దిండు క్రింద, అంతా జాగ్రత్తగా చూసాడు. దొరకలేదు.

మామూలుగా నిద్ర లేవగానే అలా దిండు ప్రక్కన **తన ఆభరణాలు** చేతికి తగలటం అలవాటు. అదృష్టం బాగుండి ఈ రోజు ముందుగా లేచాడు. లేకుంటే ఏమయ్యేది, తన పరువు పొయ్యేది. అసలింతకీ **తన ఆభరణం** ఏమైనట్టు? తలగడ ప్రక్కనున్నది చెయ్యి తగిలి క్రింద పడి ఏ ఎలుకలో, పిల్లులో ఈడ్చుకు పోయాయా? ఏమో? పోయినా పోవచ్చు.

ఆభరణం అంటే మెళ్ళో వేసుకునేదో, తల్లో పెట్టుకునేదో, కాళ్లకూ చేతులకూ ధరించేవి కానఖ్ఖరలేదండీ. గొలుసులు, నగలు మొ॥వి సైజు, డిజైను చెప్పి చేయించుకున్నట్లే, వీటికి కూడా సైజు చెప్పాలి కనుక (సైజును బట్టి తయారు చేస్తారు కాబట్టి), దీనిని కూడా పొద్దుటే ధరించి రాత్రికి తీసి దాస్తారు కాబట్టి, ఆభరణ మందాం. ఈ ఆభరణానికి మన కథలో ప్రాధాన్య తెట్టిదనిన...

సుబ్బు వాళ్ళిల్లు వరుసగా నాలుగ్గదులు. 2వ గదిలో అమ్మ, నాన్న పడుకుంటారు. 3వ గది సుబ్బు వాడుకుంటాడు. అతగాడు అభిమాన ధనుడు.

ఆ రోజు రాత్రి 12 గంటల సమయంలో తిరపతి నుండి వాళ్ళవూరెళ్తూ, మార్గ మధ్యంలో సుబ్బు వాళ్ళింటికి చెప్పా పెట్టకుండా దిగారు సుబ్బు వాళ్ళ మేనత్త, మేనత్త భర్త, మరదలు అలేఖ్య... అదేనండి మన కథకి నాయిక.

చుట్టూ కలియజూసిన సుబ్బుకి, మేనత్త, మావయ్య, అలేఖ్య కనిపించారు. ఇంకేముంది, ఇన్నాళ్ళూ కాపాడుకుంటూ వస్తున్న తన గుట్టు రట్టుకాబోతోంది. దుప్పట్లో దూరాడు. మనసంతా కకావికలమై పోయింది. దుప్పటితో ఈ ప్రపంచాన్ని కొంత దూరం చేసినా మనసుకు దూరం కాలేకపోతున్నాడు.

ఫ్లాష్‌బ్యాక్‌లోకెళ్ళి పోయాడు.

అందమైన తన పళ్ళు...

ముత్యాల్లాంటి తన పళ్ళు...

నవ్వితే తళుక్కుమనే తన పళ్ళు...

దానిమ్మ గింజల్లాంటి తన పళ్ళు...

క్లోజప్ పేస్టు ప్రకటనలో మోడల్ పళ్ళలా మెరిసే తన పళ్ళు...

తెల్లగా నిగనిగలాడుతూ తనకొక ప్రత్యేకత నిచ్చే తన పళ్ళు...

“నువ్వు నవ్వితే నువ్వు హీరో రాజశేఖర్‌లా ఉంటావు” అని చుట్టాలు మెచ్చుకునే అవకాశాన్నిచ్చిన తన పళ్ళు...

“ఒరేయ్! నువ్వు నవ్వకురా మా జి.యఫ్.లు (గాళ్‌ఫ్రెండ్స్) కూడా నిన్నే చూస్తున్నార్రా” అంటూ స్నేహితులు ఈర్ష్యపడే తన పళ్ళు...

“నాబాబు నా తండ్రి బంగారు కొండలా ఉంటాడు. వాడి నవ్వే వాడికాభరణమని” అని తల్లి నుండి, చుట్టుపక్కల వారి నుండి పొగడ్తలు తెచ్చిన తన పళ్ళు...

“నీకు డిగ్రీ అయ్యాక మాలా నువ్వు జాబ్స్ కోసం వెతకనఖ్ఖరలేదురా సుబ్బు. ఏ టూత్ పేస్ట్ కంపెనీకో మోడల్‌గా ట్రై చెయ్యి. సెలక్టయ్‌పోతావ్” అని మెప్పుదల తెచ్చిన తన పళ్ళు....

ఉన్నట్టుండి ఛళ్ళుమని ఊడిపోయాయి.

ఎలా అంటే... పిప్పిపళ్ళు సలపరిస్తుంటే డెంటిస్టును సంప్రదిస్తే ఆయన అవి కాస్త పీకిపారేస్తే తగ్గిపోయిందో, లేక వంశపారం పర్యంగా తన తాత పోలికే వచ్చిందో గాని... పళ్ళు మొత్తం ఊడిపోయాయి. ఆయనకూ అంతేట. చిన్నప్పుడే రాలిపోయాయిట. ఆయనకు ‘తాత’ అని నిక్‌నేమ్ ఉండేదిట. ఇవన్నీ తల్చుకుంటూ సుబ్బు క్రుంగిపోతూ ఉండేవాడు దిగులుతో. తనకూ తన ఫ్రెండ్స్ అలా పేర్లు పెట్టేస్తారేమోనని.

అంతెందుకు అలేఖ్య “బావా నువ్వు నవ్వితే ఎంతందంగా ఉంటావో తెల్సా, వెన్నెల కురుస్తున్నట్లుంటుంది. వేసవిలో మల్లెల సువాసన లాంటి ఏదో తెలియని అనుభూతినందిస్తావు. నీ నవ్వులో నయాగరా జలపాతాల హోరుంటుంది. కుర్రతనపు జోరుంటుంది” అంటుండేది. ఇక తనకీ జీవితంలో “చక్కటి పళ్ళు” అనే అవకాశమే లేదా అని దిగాలు పడి, వారం పది రోజులు అస్సలు బయటికే వెళ్ళకుండా గడిపాడు.

ఒక రోజు తన తల్లి “చిన్న చిన్న విషయాల క్కూడా అలా దిగులు పడకూడదునాన్నా... ఈ రోజుల్లో ఇలాంటి విషయాలకు అంతగా ఆలోచించాల్సిన అవసరం లేదు. కృత్రిమంగా లభించనివంటూ లేవు. తలకు రంగులేస్తున్నారు.

బట్టతల మీద జుట్టు మొలిపిస్తున్నారు. వంకర వళ్ళను సరిజేస్తున్నారు. వళ్ళదేముంది కట్టించుకోవచ్చులే. దీనికే క్రుంగిపోతే ఎలా?" అని ధైర్యం చెప్పింది.

"అది కాదే ఇలా బోసినోటితో బయటకెలా వెళ్ళను. డాక్టరుకెలా చూపించుకోను?" అన్నాడు తను ముద్దముద్దగా.

"ఈ ఊర్లో కాకుంటే ప్రక్క ఊర్లో చూపించుకొని రా" అందావిడ.

"దీనికంతగా తలబద్దలు కొట్టుకోవాలా, చలికాలమే కదా మంకీ క్యాప్ పెట్టుకో, బస్సెక్కి, డాక్టరుని కల్సి, సెట్టు వట్టుకురా బయల్దేరు. వివరాలన్నీ ఫోన్ చేసి చెప్పు, లేటు చెయ్యకు. నీ ఫ్రెండ్స్‌కి చెప్పలేక ఛస్తున్నాను" అన్నారు నాన్నారు అసహనంతో.

ప్రతి వాళ్ళకి తన సమస్య అసలు సమస్యే కాదు. నాన్న మాట్లాడిన ప్రతి మాటా తూటాలా తగిలిందప్పట్లో, విలవిల్లాడిపోయాడు తను. డాక్టర్లు రెండు నెలలు ఆగమన్నారు- చిగుళ్ళు గట్టి పడటానికి. ఇంకా అభివృద్ది చెందని వైద్య విధానం మీద కోపం వచ్చింది సుబ్బుకి. అసలే తన కష్టాలు కాస్త ఎక్కువాయె.

అలా పొరుగూరులో పళ్ళు కట్టించుకోవడానికి బస్సెక్కిన సుబ్బు టిక్కెటడిగితే - చూడ్డానికి కుర్రాడిలా ఉన్నాడు మాట మాత్రం నంగినంగిలా, ముద్దగా వస్తున్నదేమిటని అనుమానంగా మంకీ క్యాప్ వంక చూసాడు కండక్టర్.

పక్క వూర్లో డెంటిస్ట్‌ని కల్సి, తన పళ్ళ నమూనా చూపించి ఆ సైజు పళ్లే చేయించుకుని, వాటిని "నోటి ఆభరణం"గా ధరించి, పది రోజుల వరకూ అక్కడే గడిపి, అలవాటయ్యే వరకూ ప్రాక్టీస్ చేసి, వచ్చి, అప్పుడు కన్పించాడు స్నేహితులకి. ఇన్నాళ్ళూ ఎక్కడున్నావంటే "మా బంధువులాయనకు బాగాలేకపోతే చూడ్డానికెళ్ళానని" రకరకాలబద్ధాలాడి తప్పించుకున్నాడు. పళ్ళ సెట్టును చూసిన తల్లిదండ్రులు "ఫరవాలేదు బాగానే ఉన్నావ్, మాట్లాడేటప్పుడు జాగ్రత్త ఊడి పడతాయేమో" అన్నారు.



అమ్మతో ఒక రోజు "పళ్ళ సెట్టు, పళ్ళసెట్టు అనకమ్మా 'మౌత్-ఆర్గాన్' అని గానీ 'ఎం.ఎ.' అని గానీ అనమ్మా" అని కోడ్ బాషను కూడా చెప్పాడు.

* * *

వెయ్యి అబద్ధాలాడి ఒక పెళ్ళి చెయ్యమన్నారు. కానీ తన పెళ్ళి కోసం దాచిన ఈ ఒక్క రహస్యం ఇలా బట్టబయలు కాబోతోందన్న మాట.

"రేయ్ సుబ్బూ! లేచి వెళ్ళి పాల ప్యాకెట్ తీసుకొనిరా, రాత్రి మీ మావయ్యా వాళ్ళొచ్చారు. ఇంటికి చుట్టాలొచ్చినప్పుడన్నా అమ్మకి కొంచెం సాయం చెయ్యొచ్చుగా" అమ్మ గొంతు ఆడ విలన్ గొంతులా విన్పించింది సుబ్బుకి.

తనని తను తిట్టుకుంటూ పళ్ళ సెట్టు జాగ్రత్తగా పెట్టనందుకు బాగా జరిగిందనుకుంటూ. ఎవరికైతే ఈ విషయం తెలియగూడదని అనుకున్నాడో వాళ్ళ ఎదుటే తన గుట్టు బట్టబయలు కాబోతోందని బాధపడి, ఆక్రోశించి, చిన్నగా దుప్పటి తొలగించి, అందరూ నిద్రలో ఉన్నారని నిర్ధారించుకుని, పెరట్లో ఉన్న అమ్మకి దగ్గరగా వెళ్ళాడు. ఆమె వింతగా చూస్తున్నది. ఆమె చెవిలో మెల్లగా "ఎం.ఎ. కనిపించటంలేదే, నీకెక్కడైనా కన్పించాయా" గుసగుసగా అడిగాడు.

"ఏమో నాకేం తెల్సురా, మీ తాతగార్నడుగు, అయినా ఆయనకేం పని, ఆయన ఎం.ఎ. ఆయనకుందిగా" అంది చిన్నగానే వస్తున్న నవ్వును దాచుకుంటూ.

"ఆ దిండుక్రింద, మంచం దగ్గరా సరిగ్గా చూడు"

సుబ్బు ముఖం విషాదంగా అయిపోయింది.

"ఈ రోజంతా నన్ను లేపకు, నాకు జ్వరం వచ్చిందని చెప్పు. వాళ్ళెప్పుడెళ్తారో, అప్పుడే విముక్తి" అని మళ్ళీ దుప్పట్లో దూరాడు. ఈ విషయం అలేఖ్యకు తెలియకూడదు.

అలేఖ్య తన ప్రాణం. ఇద్దరూ ప్రేమించుకున్నారు. మనసు పంచుకున్నారు. ఇంట్లో వాళ్ళ సమ్మతి కూడా ఉంది. తను బ్యాంకు టెస్టులు వ్రాస్తున్నాడు. ఒకసారి ఇంటర్వ్యూ వరకూ వెళ్ళొచ్చాడు. ఈసారి ఖచ్చితంగా జ్యాబ్ వస్తుందన్న నమ్మకం ఉంది. దానికి తగ్గ కృషి చేస్తున్నాడు. అలేఖ్య అల్లరి చేష్టలు, చిలిపితనం అంటే ఎంతో ఇష్టం. తన గురించి "అందమైన బావా, ఆవుపాల కోవా" అని పాడుతుండేది.

ఒకవేళ ఆమే తీసి దాచిందేమో అనే ఆలోచన రాగానే అతని బాధ వేదనగా మారింది.

"అమ్మో అలా జరగటానికి వీల్లేదు. భగవంతుడా అలా జరక్కుండా చూడు. నాకీ సాయం చెయ్యి" అని ప్రార్ధించాడు.

సుబ్బుకి మనసు గుబులుగా ఉంది. "బావేంటి ఇంకా నిద్రలేవలేదు" అన్న అలేఖ్య గొంతు వినబడ్డంతోటే, ఆదుర్దా మరింత పెరిగ్గింది. అలాగే ముసుగు తన్ని పడుకుని, ఏం జరుగుతుందోనని ఎదురుచూస్తూ క్షణమొక యుగంలా గడుపుతున్నాడు. అత్తయ్యా, మావయ్య, నాన్న, తాతయ్య, అలేఖ్య అందరూ లేచినట్లున్నారు. తాతయ్య తెచ్చారేమో పాలు... కాఫీలవీ త్రాగుతున్నారు.

ఇంతలో అలేఖ్య "బావా లే ఇంకెంతసేపు పడుకుంటావ్?" అంటూ ఒక్కసారిగా దుప్పటి లాగేసింది. ఇంకేముంది తను వాళ్ళ కంటబడ్డాడు. మొహం దిండులోకి దాచుకున్నాడు. "నాకు చలిగా ఉంది దుప్పటి కప్పు. జ్వరం వచ్చింది" అన్నాడు ముద్దముద్దగా.

"మాటేంటి బావా అలా ఉంది. నీ ముఖం కూడా తమాషాగా ఉందేంటి?" అంటూ కవ్వించసాగింది అలేఖ్య .

ఇదంతా చూసి విషయం అర్థమైన అత్తయ్య, మావయ్య నవ్వసాగారు. విపరీతంగా నవ్వింది అలేఖ్య. ఆమె నవ్వే కొద్దీ అతను ముడుచుకు పోసాగాడు. అతను ముడుచుకుపోయే కొద్దీ ఆమె తలచుకొని మరీ నవ్వుతోంది.

అలేఖ్య తన బ్యాగ్ తెచ్చి అందులోంచి పళ్ళసెట్టు తీసి "ఇదిగో బావా" అంది. అప్పుడు చూసాడు పళ్ళసెట్టుని దిండులోంచి తల ఎత్తి. వాటిని అందుకుని అటు తిరిగి ఒక్క సెకనులో నోటిలో అమర్చుకుని, ఇటు తిరిగి "రాక్షసీ ఎంత ఏడ్పించావే" అనేసి ముఖం కడుక్కోడానికి వెళ్ళాడు బాత్‌రూమ్‌లోకి. ఒక్కసారిగా తేలిక పడిందతని మనసు. మేనత్త, మావయ్యలను ఏమీ జరగనట్లుగా పలకరించాడు. ఎవరికి తెలియగూడదనుకున్నాడో వారికే తెలిసినా ఆ వ్యక్తే




తన 'పళ్ళ సెట్టు'ని ఆమోదించడంతో తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

* * *

సాయంత్రం అలేఖ్యని తీసుకొని అలా షికారుకి వెళ్తూ "ఒక పెద్ద సమస్య తీరిపోయింది. నీకు తెలిస్తే ఎక్కడ నాకు దూరమౌతావోనని చెప్పదలుచుకోలేదు. నువ్వు నన్ను అర్థం చేసుకుంటావనుకోలేదు" అన్నాడు సుబ్బు.

"అందరూ నీలా ఉంటారేంటి? నాకు చెప్పకుండా దాచినందుకు నీతో మాట్లాడ్డం మానేయాలనలు" అంటూ బుంగమూతి పెట్టింది అలేఖ్య.

తనదాకా వస్తే గానీ తెలీవు విషయాలు.

"అలకలు చాలుగానీ, ఇంతకీ నావి కట్టుడు పళ్ళని ఎలా కనుక్కున్నావ్?"

"చెప్తాలే బావా ఒక్కసారి ఆ పళ్ళు తీసి ముఖం చూపించవా?" అంది చిలిపిగా .

"మరదేమండేది. నువ్వు కూడా అలా అంటే ఎలా చెప్పు" సీరియస్సైపోయాడు. "ఇంతకీ విషయానికిరా" అన్నాడు కాస్సేపాగి.

"ఆ... వస్తున్నా... నీ కట్టుడు పళ్ళని నేను కాక ముందుగా మరెవరు కనుక్కుంటారు బావా? అసలు నేను రాగానే నిన్ను చూడాలనే ఆత్రంతో నీ గదిలో కొచ్చాను. నువ్వు మాంచి నిద్రలో వున్నావు. దిండు ప్రక్కనే మిలమిల్లాడుతూ వింతగా కన్పించాయి. అవి నీ పక్క మీద ఎందుకున్నాయో నాకర్థం కాలేదు. దగ్గరకొచ్చి చేతిలోకి తీసుకొని చూసాను. తర్వాత నీ ముఖం చూసాను తెల్సిపోయింది నీ బ్రహ్మ రహస్యం. వెంటనే అవి నా బ్యాగ్‌లో దాచాను."

తేలిగ్గా నవ్వేశాడు.

"బావా అలా పోయి ఒక జాంకాయ కొనుక్కురానా" అంది ఉడికిస్తూ.

"ఊహుం"

"పోనీ వేరుశెనగ ముద్ద?"

"పళ్ళు రాల్తాయ్"

"ఫుల్ సెట్ కట్టిస్తావా? నీలా?" నవ్వుతూ అంది.

ఆమె చిలిపితనం తెల్సి నవ్వుకున్నాడు లోలోపల.

"ఇంతకీ మన పెళ్ళి సంగతేంటి?" తనే అంది అలేఖ్య కొద్ది క్షణాల మౌనం తర్వాత.

"మరో మూడు నెలల్లో ముహూర్తాలున్నాయని ఇందాక నాన్న, మావయ్య, అమ్మా, అత్తయ్య మాట్లాడుకుంటున్నారు"

...ఆ తర్వాత సుబ్బుకి జాబ్ రావడం, మూడు నెలలయ్యాక మాఘమాసం రావడం, పెద్దలు శుభస్యశీఘ్రం అనడం వెంట వెంటనే జరిగిపోయాయి.

**కానీ అప్పుడే జరిగింది సుబ్బు జీవితంలో మరో ముఖ్య సంఘటన.**

* * *



అది తొలిరాత్రి.

మధురంగా, మనోహరంగా గడిపి, సుఖాల లోతులలో మునిగి, అలసి, సొలసి ఏ కొద్దిసేపో నిద్రలో తేలిన మత్తు వదులుతోంది సుబ్బుకి. ప్రక్కనే వున్న తన స్వర్గసీమ మీద చేయి వేసాడు. ఆ చెయ్యి మెడపై నుండి అలేఖ్య తలక్రిందనున్న దిండు క్రిందకి యథాలాపంగా పోయి నరకంగా మారింది. ఎందుకంటే చేతికి పళ్ళసెట్టు తగిలింది. అదేంటి? తన ఎం.ఎ. ఇటొచ్చిందను కుంటూ మరొక సారి తన దిండు క్రింద తడిమాడు తనదక్కడే వుంది. మత్తులో వున్నాను కదా మరోసారి చూద్దామని, మళ్ళీ అలేఖ్య దిండు క్రింద చూసి నిర్ధారించుకున్నాడు అది వేరేదని.

దెబ్బకి ఒదిలింది మత్తు. వెంటనే లేచాడు. కళ్ళు నలుముకున్నాడు. తనను తాను గిల్లుకున్నాడు. కలకాదు నిజమే అనుకుని లేచి కూర్చున్నాడు. అలేఖ్యను లేపాడు.

"నీ దిండు కింద ఈ సెట్టు సంగతేంటి" దీనంగా ఉంది సుబ్బు స్వరం.

"నువ్విలా ఐపోతావనే నీకు రాత్రి చెప్పలేదు ఈ సంగతి" అంది మత్తుగా ముద్దగా .

"ఇదెలా జరిగింది?" కళ్ళ నీళ్ళ పర్యంతమౌతూ విచారంగా అడిగాడు.

అతని భుజంపై తలవాల్చి "ఫ్లాష్‌బ్యాక్"లో కెళ్ళిపోయింది అలేఖ్య.

"క్రితం సారి నిన్నెగతాళి చేసినందుకో ఏమో, మొన్నామధ్య టైఫాయిడ్ వచ్చింది. ఏవేవో మందులన్నీ వాడాను, యాంటీబయాటిక్స్ హైపవరువిచ్చాడా డాక్టరు. చివరిరోజు డేట్ ఎక్స్‌పైర్ అయిన ఇంజెక్షన్ చేసాడా కాంపౌండరు, దాని




ఫలితంగా ఎలర్జీ వచ్చి, చిగుళ్ళన్నీ వాచి, "ప.. ళ్ళ... న్నీ... ఊ... డి... పో... యా... యి... బావా" అంటూ బ్యార్ మందామె. తన కళ్ళు తుడుచుకుని ఓదార్చాడు సుబ్బు.

"ఫుల్‌సెట్ ఐతే కట్టించారు గానీ, మన మీద ఎన్ని జోకులేశారనుకున్నావ్? నీకు నేను - నాకు నువ్వు సినిమా టైటిల్ మనకు కరెక్టుగా సరిపోతుందట (ఆశ్చర్యంగా), నేను నీకు గంతకు తగిన బొంతనట (గారంగా), మనం మేడ్ ఫర్ ఈచ్ అదర్‌ట (అమాయకంగా), దొందూ దొందేనట మనం (రోషంగా), కొంతమంది కుర్రవాళ్ళు పుట్టుకతో వృద్ధులు పాట మన కోసమేనట, 'నీకునేను - నాకునువ్వు ఒకరికొకరు దొందూ దొందే' అంటూ మనమీద పేరడీ పాట రాసి హాసం పత్రికకు పంపమని ఎం.శ్రేష్టకు గాని, తాళాభక్తుల లక్ష్మీప్రసాద్‌కి గాని ఉత్తరం రాస్తారట " అని ముక్కు చీదుకుని, తల వంచుకొని రకరకాల మాడ్యులేషన్స్‌లో చెప్పింది.

"ఇంక చాలు ఆపు" కీచుగా అరిచాడు.

"ఈ విషయం ఎవరకీ తెలియకుండా జాగ్రత్త పడాలి మనం." చిన్నగా అన్నాడు గొంతు సర్దుకుని.

"అది సరేగానీ ఈ రెండు ఎం.ఎ.లు కడిగే బాధ్యత ఒకరోజు నీది, ఒక రోజు నాది" అంది అలేఖ్య వాతావరణాన్ని తేలికపరుస్తూ.

జుట్టు పీక్కున్నాడు సుబ్బు.

"ఒద్దు బావా... అది కూడా ఊడిపోతే విగ్గు మెయిన్‌టెయిన్ చెయ్యాలి నువ్వు" అందీసారి చిలిపిగా.

సరేనని జుట్టుని, పళ్ళసెట్టుని సర్దేసుకున్నాడతను... జీవితంతో పాటు! ■

**నేను రాసిన ఈ కథను తిప్పి పంపుతూ క్లయిమాక్సును మార్చమన్న మీ ప్రోత్సాహకర సూచనతో నా చిన్ని బుర్రకు పదును పెట్టి మార్చాను.**

**నా కథ గురించి ఫోన్ చేసి మీ కార్యాలయంలో అడగ్గానే, వెంటనే గుర్తుపట్టి 'తగిన సూచనలతో రిటర్న్ చేసామని ఎడిటర్ గారు చెప్పమన్నారని' మీ స్టాఫ్ చెప్పడాన్ని బట్టి చూస్తే అర్థమౌతుంది- మీరు ఈ పత్రిక ప్రచురణలో కనబరుస్తున్న శ్రద్ధ!**

**మీ సూచనకు, ఇస్తున్న ప్రోత్సాహానికీ కృతజ్ఞుడను.**

**- ఎ.వి.ఎస్.శ్రీనివాస్, ఒంగోలు.**

సెప్టెంబరు 27, 2003 నుంచి అక్టోబరు 5, 2003
వరకు జరిగే తిరుమలోని శ్రీ వేంకటేశ్వరస్వామి వారి
బ్రహ్మోత్సవాలను పురస్కరించుకుని...

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## ఆర్తుడను నేను

ఆర్తుడను నేను నీ కడ్డమెందుకు లేదు
మూర్తి త్రయాత్మకా మొగి కరుణింపవే

1. సర్వసాక్షివి నీవు సర్వాంతరంగుడవు
సర్వ సర్వం సహా చక్రవర్తీ
నిర్వాణ మూర్తీ నిగమాంత కీర్తీ
సర్వాపరాధములు క్షమియింపవే స్వామీ ॥
2. పరమాత్ముడవు నీవు పరంజ్యోతివి నీవు
పరమ పరానంద పరమపురుషా
కరిరాజ వరదా కారుణ్య నిలయా
శరణాగతుడ నన్ను సరిగావవే స్వామీ ॥
3. అణువు లోపలి నీవు ఆది మహత్తువు నీవు
ప్రణుత శ్రీ వేంకట ప్రచుర నిలయా
అణిమాది విభవా ఆద్యంత రహితా
గణుతించి నా పాల - గలుగవే నీవు స్వామీ ॥

**అన్నమాచార్య కీర్తన**

సంగీతం
ఎం. చిత్తరంజన్
గానం
శ్రీమతి విజయలక్ష్మీ దేశికన్
రాగం
మాయామాళవ గౌళ
- రాగ్ భూప్ (హిందుస్తాని సం॥)
15 మేళకర్త - తాళం : ఖండగతి
(కర్ణాటక సంగీతం)
- ఝప్‌తాల్ (హిందుస్తాని సం॥)
ఆరోహణ : స రి గ ప ద స
అవరోహణ : స ద ప గ రి స

-షడ్జము, శుద్ధ రిషభం, అంతర గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, శుద్ధ దైవతం, కాకలి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

ప్రాచీనమైన మాయామాళవ గౌళ బహుళ ప్రచారంలో వున్న రాగం. కర్ణాటక శాస్త్రీయ సంగీతం అభ్యసించడానికి సరళ స్వరాలు, జంట స్వరాలు, అలంకారాలు మొదలైనవి అన్నీ మాయామాళవ గౌళ లోనే విద్యార్థులకు బోధిస్తారు. భక్తికీ, విరహ విషాదాలకూ, వైరాగ్యానికీ, ఎంతో అనువుగా వుంటుంది యీ రాగం. అందుకే తత్త్వ గీతాలకు మాయామాళవ గౌళ, దాని జన్యమైన నాద నామక్రియ రాగము ఎక్కువగా వినియెగించబడడం పరిపాటి. "వస్తావట్టిదె పోతావట్టిదె ఆశ ఎందుకంట", "ఎవరు చేసిన కర్మ వారనుభవింపక" మొదలగు తత్త్వగీతాలే కాక "ఏ తీరుగ నను దయ చూచెదవో" (రామదాసు కీర్తన), "ఈ రేయి నన్నొల్ల నేరవా రాజా" (ఎంకిపాట) మున్నగునవి ఎన్నో పాటలు యీ రాగాలలో కూర్చబడి తెలుగువారిని ఎంతగానో ఆకట్టుకున్నాయి. చలన చిత్రాలలో కూడా చాలా పాటలకు యీ రాగంలో స్వరకర్తలు బాణీలను అందించారు.

"శ్రవణం కీర్తనం చైవ స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదను"



శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మ నివేదనము అనే తొమ్మిది భక్తి విధానాలలో కీర్తనము అన్న మార్గాన్ని ఎంచుకుని మన వాగ్గేయకారులు భగవంతుని అర్చించి తరించారు. వారిలో అన్నమాచార్యుడు తన వేలాది కృతులతో శ్రీనివాసుని అను నిత్యము కీర్తిస్తూ "సంకీర్తనాచార్యుడు" గా ఖ్యాతి గాంచాడు. యతి, ప్రాస నియమాలను ప్రతి సంకీర్తనలోనూ విధిగా పాటిస్తూ వేలాది కృతులు ఆశువుగా, అవలీలగా గానం చెయ్యడమన్నది అసామాన్యమైన విషయం. అంతటి ఘనత అన్నమయ్యదే. ఎంతో వస్తు వైవిధ్యంతో, ప్రౌఢమైన, సరళమైన పదజాలంతోనూ, మాండలీక శబ్దాల సొబగులతో కూడిన జానపద శైలిలోనూ అద్భుత రచనలు చేసిన మహా వాగ్గేయకారుడాయన. సంకీర్తన రచనా విధానానికి ఆయన ప్రతి కీర్తనా భాష్యం పలుకుతుంది. అందుకే "సంకీర్తనా చార్య"డై తరువాతి తరాల వారికి మార్గదర్శకుడైనాడు. "ఆర్తుడను నేను" అంటూ తన బాధలను బాపి దయతో కాపాడమని శ్రీనివాసుని వేడుకునే యీ అన్నమయ్య సంకీర్తనకు మాయామాళవ గౌళ రాగంలో నేను కూర్చిన బాణీని శ్రీమతి విజయలక్ష్మీ దేశికన్ ఎంతో భావయుక్తంగా గానం చేసింది.

## శ్రీమతి విజయలక్ష్మీ దేశికన్



అక్షరాలు దిద్దుతున్న సమయంలోనే పాటలు పాడి బహుమతులు గెల్చుకున్న మా పెద్దమ్మాయి విజయలక్ష్మి 5వ ఏటనుండి ఆకాశవాణి పిల్లల కార్యక్రమాల్లోనూ, పాట నేర్చుకుందాం ప్రోగ్రాముల్లోనూ పాల్గొన్నది. మాది సంగీత కుటుంబం కావటం వలన మా అమ్మగారు శ్రీమతి పేరిందేవిగారి శిష్యులు, నా శిష్యులు మా తమ్ముళ్ళూ చెల్లెళ్లూ అందరూ పాడటం జరుగుతూండేది. ఆ వాతావరణంలో పెరిగిన విజయలక్ష్మి శాస్త్రీయ సంగీతం ఇంట్లో కొంత అభ్యసించాక ప్రసిద్ధ కర్నాటక సంగీత విదుషీమణి శ్రీమతి రేవతీ రత్నస్వామి గారి వద్ద శాస్త్రీయ సంగీతం నేర్చుకుని సర్టిఫికెట్ కోర్సు డిస్టింక్షన్‌లో ఉత్తీర్ణురాలైంది. ఇంటిలో లలిత సంగీతంలో మెళకువలు నేర్చుకుంటూ భావపుష్టిగల మధుర గాత్రంతో చక్కని గాయనిగా రూపుదిద్దుకుంది. ప్రతి ఏడూ ఆకాశవాణి నిర్వహించే జాతీయ సంగీత పోటీలలో 1989లో లలిత సంగీతంలో జాతీయ స్థాయిలో ప్రథమురాలిగా నిల్చి బంగారు వీణ బహుమతి అందుకుంది. ఆకాశవాణిలో 'బి హై' కళాకారిణిగా గుర్తింపుపొంది రేడియోలోను, అనేక వేదికల మీద, దూరదర్శన్‌లోను పాడుతున్న విజయలక్ష్మి శ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం నిర్వహించిన "పాడుతా తీయగా", "ఎందరో మహానుభావులు" కార్యక్రమాలలో పాల్గొని పలువురి మన్ననలందుకుంది.




రేడియో, టీ.విలలో మంచి గాయనులుగా గుర్తింపు పొందిన తన చెల్లెళ్ళు వందనాదేవి, అమృతవల్లి తో కలిసి లలిత, భక్తి సంగీత కచేరీలు చేస్తోంది. భారతీయ నృత్యరీతుల గురించి నా సంగీత సారథ్యంలో హైదరాబాద్ మాదాపూర్‌లో 1994లో ప్రదర్శించబడిన బాలే లోను, "శ్రీ యాదగిరి లక్ష్మీ నరసింహస్వామి' చిత్రంలో నేను స్వరపరచిన "ఎన్నెన్ని మహిమలు నీవి" అనే పాటను (ఈ చిత్రంలో కొన్ని పాటలు శ్రీ ఎస్.రాజేశ్వరరావుగారు సంగీత పరచినవి) పాడింది. అన్నమాచార్య భావనా వాహిని నిర్వహించిన రాష్ట్రస్థాయి పోటీలలో గెలుపొంది శ్రీ చిన్నజియ్యరు స్వామివారి కరకమలాల ద్వారా తంబూరా అందుకుంది.

తిరుమల, యాదగిరి, వేములవాడ మొ॥ క్షేత్రాలలో బ్రహ్మోత్సవాలలో, పుష్కరాల సందర్భంగాను సాంస్కృతిక శాఖ ద్వారా, తి.తి.దేవస్థానం ధర్మప్రచార పరిషత్ తరపున భక్తి సంగీత కార్యక్రమాలలో పాల్గొంది. స్వరకర్తలు పాలగుమ్మి విశ్వనాథం, కొచ్చెర్లకోట సూర్యప్రకాశరావు, నిర్మల్ కుమార్, ఉషాకాంత్, పి.వి. సాయిబాబా, ఇందిరామణి మొ॥ వారి సంగీత సారథ్యంలో రేడియో, టీ.వి. లలోనూ కాసెట్లలోనూ పాడింది.

ఎకనామిక్స్ లెక్చరర్ అయిన విజయలక్ష్మి ప్రస్తుతం ఆంధ్రమహిళా సభలో నిర్వహిస్తున్న లలిత సంగీతం డిప్లమో కోర్సుకు నాతో బాటు లెక్చరర్‌గా పనిచేస్తున్నది. ●

## మాయామాళవ గౌళ / భైరవ్ రాగాల ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| పాట | చిత్రం | గానం | స్వరకర్త |
|---|---|---|---|
| **తెలుగు** | | | |
| 1. వరుణా వరుణా | బాలరాజు | ఎస్.వరలక్ష్మి | గాలి పెంచల నరసింహారావు |
| 2. ఏ నిమిషానికి ఏమి జరుగునో | లవకుశ | ఘంటసాల | ఘంటసాల |
| 3. తగునా వరమీయ | భూకైలాస్ | ఘంటసాల | ఆర్.సుదర్శనం |
| 4. మనసా నేనెవరో నీకు తెలుసా | పెళ్ళిచేసిచూడు | పి.లీల | ఘంటసాల |
| 5. ముక్కోటి దేవతలు పాటలో 'గోపన్న వలె వగచు' అను చరణం | బావమరదళ్లు | ఘంటసాల | పెండ్యాల |
| **హిందీ** (భైరవ్ రాగం ఆధారంగా) | | | |
| 1. మోహే భూల్‌గయే సావరియా | బైజూబావ్‌రా | లత | నౌషాద్ |




# మిస్టర్ పెళ్ళాం



దర్శకత్వం బాపు

కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు
ముళ్లపూడి వెంకటరమణ

వెండితెర నవల

5

నవలీకరణ
ఇలపావులూరి మురళీమోహనరావు

**జరిగిన కథ**

బాలాజీ, ఝాన్సీ భార్యాభర్తలు. బాలాజీకి ఆడవారంటే కొంచెం చులకన భావం. బ్యాంకులో క్యాషియర్‌గా ప్రమోషన్ పొందిన ఆనందంలో టీవీ, వి.సి.పి. కొంటాడు. క్యాషియర్‌గా బ్యాంకులో చార్జ్ తీసుకున్న రోజే లక్ష రూపాయలు తేడా రావటం వల్ల మేనేజర్‌తో బాలాజీ ఘర్షణ పడి సస్పెండ్ అవుతాడు. వేరే ఉద్యోగాలకు ప్రయత్నించినా జరిగిన విషయం తెలిసి ఉద్యోగం ఇవ్వటానికి ముందుకురారు. ఝాన్సీ తన చిన్ననాటి స్నేహితుని కంపెనీలో రికమెండ్ చేస్తానంటుంది -(ఇక చదవండి)



"మనం భార్యా భర్తలం. బండికి చక్రాల్లాంటి వాళ్ళం. భర్త కోసం భార్య అడిగితే తప్పా?'' అన్నది చిన్న బుచ్చుకుని.

భార్యా ముఖం చూసి కొంచెం తగ్గాడు బాలాజీ. "తప్పని కాదు. ఒకవేళ నీమాట విని వాళ్ళు రమ్మన్నా రేపు నా లక్ష రూపాయల కథ తెలిసి పొమ్మంటారు." అన్నాడు.

"మీకా అనుమానం ఉంటే... " ఏదో చెప్ప బోయింది.

"ఉంది." అన్నాడు భార్యను పూర్తిగా చెప్పనీయకుండానే.

"నీళ్ళు" అని అడిగాడు- తర్వాత ఆమె చెప్పబోయే మాట తన చేత నిజంగానే నీళ్ళు తాగిస్తుందని తెలీక.

"పోనీ .. నేను ట్రై చెయ్‌నా!?" అంటూ లోపలికి తుర్రుమంది.

పుస్తకంలో మస్తకాన్ని దూర్చి సీరియస్‌గా "ఓ పరం ధామా..." అంటూ చదువు తున్నట్లు నటిస్తున్న బాలాజీ ఆ మాటకు షాక్ అయ్యాడు.



"వాట్! నువ్వు ఉద్యోగాని కెళ్తావా?'' అడిగాడు ఆశ్చర్యంగా.

"తప్పా?" అన్నది ఝాన్సీ ఓ చేత్తో మంచినీళ్ళ గ్లాసు పట్టుకుని నడుము మీద మరో చెయ్యి వేసి సత్యభామలా పోజుపెట్టి.

పెళ్ళాం సంపాదిస్తుంటే నిజంగా సత్యభామే అవు తుందని అతని భయం. తన అహాన్ని అణచుకుని భార్యకు లొంగి ఉండవలసి వస్తుందని సందేహం.



''తప్పా తప్పున్నరా? మగాణ్ణి ఇంట్లో కూర్చుంటే.. ఆడదానివి.. నువ్వు రచ్చకెక్కి... అయినా నీ ముఖం చూసి ఎవడిస్తాడు ఉద్యోగం?'' అన్నాడు మగవాడి సహజగుణంతో.

"నా ముఖం చూసి కాదు. నా బీకాం డిగ్రీ చూసి." అన్నది వంటింట్లో కెళ్తూ.

"ఓహో...అదా...ఒట్టి డిగ్రీ ఉంటే ఏ మూలకి? ఎక్స్‌పీరియన్సు? టకాటకా ఇంగ్లీషు మాట్లాడాలి. ఎత్తుకు పై ఎత్తు వెయ్యాలి. ఆఫీసుల్నిండా మగాడిదలు, గుంట నక్కలు, పోకిరీలు, పులులు, సింహాలు - " అన్నాడు బాలాజీ మరింత నిరుత్సాహపరుస్తూ.

ఝాన్సీ కూడా కాలేజీలో చదివే రోజుల్లో ఆడరౌడి అని పేరు తెచ్చుకుంది. తన చెప్పులు మగ పోకిరీల చెంపలను ముద్దాడి ఎన్ని సార్లు తెగిపోయాయో బాలాజీకి తెలియదు మరి.

" మా కాలేజీలో నన్ను సివంగి అనే వారు...తెలుసా?" అంటూ సివంగిలా గర్జించింది చిలిపిగా.

"నో.. ఐడోంట్ లైకిట్..వీల్లేదు" అన్నాడు బాలాజీ ఇంకా మంకుగా.

అయినా ఝాన్సీ తన కోపాన్ని బయటకు కనిపించ నీయకుండా "సరే.. మీ ఇష్టం. మీరన్నట్లు తిని కూర్చోడానికి మనకేం ఆస్తుల్లేవుకదా. జీతగాళ్లం... నెల తిరిగే సరికి అద్దెలు, పాలు, స్కూలు. అప్పులు,



బకాయిలు. అయినా నాకేల చింత ...మీరుండగా!?" వంట గదిలోకి వెళ్ళింది ఝాన్సీ.

బాలాజీ"ఓ...పరంధామా..."అనుకుంటూ ఆలోచనలో పడ్డాడు. తన ఉద్యోగం ఊడింది. మరో ఉద్యోగం ఇప్పట్లో వచ్చే అవకాశాల్లేవు. ఏజ్ కూడా బారయింది. ఏ ఉద్యోగమంటే ఆ ఉద్యోగం వచ్చి వడిలో వాలే వయసు కాదు. హాయిగా



తినికూర్చోడానికి తాతగారిచ్చిన ముల్లెలేం లేవు. రెక్కాడితేనే డొక్కాడేది. తనకు ఉద్యోగమున్నపుడే ఇల్లు గడవడానికి నానా ఇబ్బందులు పడేవారు. రోజులు తరబడి వనీ పాటా లేకుండా కూర్చుంటే తిండెవరు పెడతారు? అదృష్టం కొద్దీ భార్య కూడా చదువుకున్నది, చక్కని సంస్కారం కలిగినది. పైగా తెలిసినవారు ఆ కంపెనీ యజమానులు . ఉద్యోగం రావచ్చేమో! ఇంకా మొండిపట్టుబడితే మొదటికే మోసం వస్తుందని గ్రహించాడు.

"ఏమోయ్.. " పిలిచాడు.

సమాధానం లేదు. కొండ మన దగ్గరకు రాకపోతే మనమే కొండ దగ్గరకు పోవాలి కదా! "నిన్నే...." అంటూ భార్యను వెతుక్కుంటూ దొడ్లోకి వెళ్ళాడు. బట్టలు పిండి ఆరవేస్తున్నది ఝాన్సీ.

"అయినా అన్నపూర్ణ ఫుడ్ కార్పొరేషన్ చాలా పెద్ద కంపెనీ. తెలుసా? ఇంతకీ నీకక్కడ ఎవరు తెలుసే?" అడిగాడు.

"వాళ్ళ మేనేజింగ్ డైరెక్టర్ గోపాలకృష్ణ. ఇంటర్లో నా క్లాస్‌మేట్." లోపలికెళ్తూ చెప్పింది ఝాన్సీ.



భార్యను అనుసరించాడు బాలాజీ. భార్య కీ ఉద్యోగం వస్తే ఎంతో బావుణ్ణు అనుకుంటున్నాడు లోపల. అయినా తేలు చస్తూ కూడా కొండి ఆడిస్తూనే చస్తుందన్నట్లు పురుషాహంకారం కదా! మళ్ళీ అనుమానం వచ్చింది.

"ఏడిసినట్లుంది. నువ్వు ఇంటర్ చదివి పదేళ్ళయింది. ఇప్పుడా నంద గోపాల్ గాడు...." అనబోయాడు.

"గోపాలకృష్ణ.." సవరించింది ఝాన్సీ." అతనలా మర్చిపోడు. ఒకసారి లెంపకాయ కొట్టాను." చెప్పింది గిన్నెలు సర్దుతూ.

"అబ్బో.. లవ్‌లెటర్సా? ఇంకా అడ్వాన్సయ్యాడా?" అసూయ ధ్వనించింది స్వరంలో.

"ఎందుకు లెండి? వద్దు పొమ్మన్నారుగా." అన్నది లోలోపల నవ్వుకుంటూ.

కంగారు పడ్డాడు బాలాజీ. కొంపదీసి తాను చెయ్యనంటే ఇక తాను బ్రతిమలాడుకోవాల్సి వస్తుంది. దాంతో తాను ఇక తగ్గడం క్షేమమనిపించింది.

" నీ క్షేమం కోరి చెప్పామోయ్ - నువ్వు కష్టపడతావని. నువ్వు చేస్తానంటే నాకేంటి? అయినా ఆ వేణు గోపాల్ గాడు.." అందితే జుట్టు అందక పోతే కాళ్ళు టైపులోకి మారాడు బాలాజీ.

"గోపాలకృష్ణ.. యమ్.డీ.." పెద్దగొంతుతో చెప్పింది ఝాన్సీ.



"పేరు కంఠతా పట్టేశాం లెండి. సరె. ట్రై చెయ్యి. ఆనక.." తాను బలవంతం చెయ్యడం లేదు అన్న భావాన్ని పలికిస్తూ.

భర్త మేకపోతు గాంభీర్యాన్ని అర్థం చేసుకున్న ఝాన్సీ మరికొంత బెట్టు చేసింది. "వద్దులెండి. నా ఆఫీసెలా ఉన్నా ఇంటి చాకిరీ. పిల్లలు చిరాగ్గా ఉంటుంది." బెడ్రూమ్‌లోకి దూరి తలుపేసుకుంది.

భార్యను అనుసరిస్తున్న బాలు ముఖాన పడ్డ తలుపుకు ముఖం కొట్టుకుని ఆగి పాయాడు. "అంటే.. నువ్వు ఆఫీసు నడపగలవు కానీ నేను ఇల్లు నడపలేనని నీ ఉద్దేశమా? నల్లేరు మీద బండి నడక! ఆడుతూ పాడుతూ లాగి అవతల పారేస్తా!మీ ఆడాళ్ళదేముంది?సిక్స్ టు నైన్...పొద్దున్న ఆరుగంటల నుంచి తొమ్మిది గంటల దాకానే! ఆనక అంతా ఖాళీయే. మరి మగాళ్ళు? నైన్ టు ఫైవ్ అంటే ఎనిమిది గంటలు... గొడ్డు చాకిరీ. తుక్కైపోతావ్.. ముందే చెబుతున్నా. ఆనక..."



అంతలోనే భళ్ళున తలుపు తెరుచుకుంది. నిండైన చీరెలో, హుందాగా, బాపూబొమ్మలా, కనిపించిన భార్యను చూసి 'బాపురే' అనుకున్నాడు బాలాజీ. "దొంగా... " అన్నాడు కుదుటపడ్డ మనసుతో .

భర్త పాదాలకు నమస్కరించింది ఝాన్సీ. నవ్వుతూ భార్యను లేపాడు. "గుడ్‌లక్ మిస్టర్ పెళ్ళాం" జీవితంలో 'ఆమని' ప్రవేశించినట్టయి...

భార్యకు కష్ట సుఖాలలో అండగా ఉంటానని, తోడు నీడగా మసలుకుంటానని పెళ్ళిపీటల మీద మగాడితో ప్రమాణం చేయిస్తారు కానీ నిజానికి ఈ రోజుల్లో ఆ మంత్రాన్ని భార్యల చేత పలికించాలేమో!

ఆఫీసుకు వెళ్ళి పోయింది ఝాన్సీ. ఆమె వెళ్ళి పోగానే పిల్లలను స్కూలుకు పంపడానికి తయారు చెయ్యసాగాడు బాలాజీ. ఆడుతూ పాడుతూ పిల్లల్ని తయారు చేస్తున్నాడు.



ముల్లుపోయి కత్తి వచ్చె
ఢాం ఢాం ఢాం
మమ్మిపోయి డాడి వచ్చె
ఢాం ఢాం ఢాం
పెన్ను పోయి గరిటె వచ్చె
ఢాం ఢాం ఢాం
ఇదే కొత్త కింగ్‌డమ్...డమ్ ॥ముల్లు॥
అంట్లు తోమే ఆడది, జెంట్సుకు లోకువ చూడు
గాజులు తొడిగే శ్రీమతి, ఫోజులు చెల్లవు నేడు
బట్లరు పనినే చేసినా, హిట్లరు నేనని తెలుసా
ఆలుమగల యాత్రలో, అప్పర్ బెర్తు నే పరిచా
సమాన హక్కులంటే ఆ సమాధి లోపలంటా
మగాడి నీడలోనే స్త్రీలకి ఉగాది ఉన్నదంటా
భీముడల్లే వంట యింట కాముడల్లే పడకటింట
ఆడవాళ్ళ నేలుకొని కోడెగాడు ఎందుకంట ఢాం ఢాం ఢాం ॥ముల్లు॥
హైహీల్స్ బూటులంటా హైహై నాయకీ
లిప్‌స్టిక్ పూతలంటా
హైరంగు నాయకీ
పప్పప్పద మమ్మమ్మప
గగ్గగ్గమ రిగమస
కళ్ళజోడు సోకులంటా
పాద నిదపమ
మాప దపమగ
గామ పమగరి



సరి రిగ గమ మప
కారు ఎక్కి ఉన్నదంటా
ఊర బాహడి వీరవంటల
తేర తిండికి మూడు పూట్ల హజరంట
ముందు ముందు చెల్లదంట
తదోందోం తదీందీం
అటు తంతాం ఇటు తంతాం
సనిదపమగరిస
ముందు ముందు చెల్లదంట
కరాటేలోన కిరీటిన్నేను
అబల తబల తకధిమి నడకల
టింగనాలు చెల్లవంట... ఆయ్...





ఏనాడూ వంటింట్లో అడుగు పెట్టిన పాపాన పోయిన వాడు కాక పోవడంతో గిన్నెలు, గ్లాసులు, చెంబులు, కంచాలు అన్నీ స్థాన భ్రంశమయ్యాయి. ఇల్లంతా రణగొణ ధ్వని, రాళ్ళవాన, పిల్లల్ని హుషారుగా ఎత్తుకుని తిప్పుతూ, ఆడిస్తూ, నవ్విస్తూ వాళ్ళకు స్నానాలు చేయించాడు. ఇదో కొత్త అనుభవంలా తోచింది.



పిల్లలకు డ్రెస్సులు వేసే లోపల ఇంట్లో సామానంతా చిందర వందరై కలియుగ కిష్కింధలా తయారైంది. ఇంటిని మళ్ళీ ఓ కొలిక్కి తేవాలంటే ఈజీగా కొన్నాళ్ళ పడుతుంది.

* * *

అన్నపూర్ణ ఫుడ్ కార్పొరేషన్ వారి హెడ్డాఫీసులోకి ప్రవేశించింది ఝాన్సీ. చాలా విశాలమైన సూపర్ మార్కెట్టది. రైలు, విమానం తప్ప అన్నీ దొరుకుతాయా అన్నంత ఘనంగా ఉన్నది. షాపునిండా జనం. ఎవరికి కావలసినవి వారు తీసుకుంటున్నారు.

ఉద్యోగార్థం రోడ్డెక్కడం, ఒక ఆఫీసులోకి ప్రవేశించడం ఝాన్సీకిదే తొలిసారి. కొంచెం కంగారుగా ఉన్నది.

"యమ్.డీ.గారిని కలుసుకోవాలండీ" అని ఇద్దరు ముగ్గురు నడిగింది. ఎవరూ వినిపించుకోలేదు.

బిల్లు సెక్షన్లో కూర్చున్నాడు భజగోవిందం. భజగోవిందం అనగానే ఆయనేదో పెద్ద భక్తుడని భ్రమపడేరు! యజమానులకు భజన చెయ్యడం ఆయన పని. ఏ పని చేసినా యజమానిని స్తుతించడం ఆయన సహజ లక్షణం. భృత్యుధర్మం బాగా తెలిసిన వాడు.

"సార్... నేను యమ్‌డీ గారిని కలుసు కోవాలండీ..." అని అడిగింది వినయంగా.

అవతలివాడు తగ్గేకొద్దీ ఇంకొంచెం రెచ్చిపోవడం కొంత మందికి హాబీ. అవతల వాడికి వళ్ళుమండి తిరగబడి నాలుగు తన్నబోతే దణ్ణం పెట్టి కాళ్ళుపట్టుకోవడం వారికి పుట్టుకతో వచ్చిన విద్య అటువంటివాడే ఈ భజగోవిందం.



"ఇవాళ బోర్డాఫ్ డైరెక్టర్స్ మీటింగ్ ఉంది. ఆయన చాలా బిజీగా ఉన్నారు." ముఖం చూడ కుండానే చెప్పాడు భజగోవిందం.

" ఫరవాలేదు సార్. కొంచెం అర్జెంటుగా మాట్లాడాలి." రిక్వెస్టు చేసింది ఝాన్సీ.

"ఫరవా లేదని మీరంటే ఎలా? ఉండండి. అడుగుతాను."

కోపంగా చూసి ఫోనెత్తాడు. "హలో.. ఎవరూ మాట్లాడేది." పెద్ద గొంతుతో అన్నాడు. అవతలి గొంతు వినగానే కాళ్ళు చేతులు చల్లబడి. "ఆ...మీరాసార్.. సార్... నేనే సార్..ఎంత జోకేశారు సార్ ఎంత జోకేశారు మీ కోసం ఎవరో లేడీసొచ్చారు సార్ ... లేడీసంటే... ఒకే ఒక లేడీ సార్.. " మౌత్‌పీస్ మీద చెయ్యి అడ్డం పెట్టి "అమ్మా.. పేరడుగుతున్నారు." అన్నాడు ఝాన్సీతో.

"సివంగి అని చెప్పండి" అన్నది ఝాన్సీ.

"క్షమించండి అలాంటి పేర్లు చెబితే బాగుండదు." అన్నాడు భజగోవిందం కోపంగా చూసి.

ఝాన్సీ 'నేను చెబ్తాను'- అని అతని చేతిలోంచి ఫోన్ లాక్కుని "హలో గోపాల్.. నేను సివంగిని" అన్నది.



అవతలి వ్యక్తి చెప్పింది విని ఫోన్ భజగోవిందం కిచ్చింది.

భజగోవిందం మాట్లాడ సాగాడు. వళ్ళంతా చెమటలు పట్టాయి. "సార్.. సారీ సార్.. లిఫ్టులో తీసుకు రమ్మంటారా? వాటె బ్రిల్లియంట్ ఐడియా సార్... వాటె బ్రిలియంట్ ఐడియా" అని ఫోన్ పెట్టేసి "అమ్మా.. పదండి" అన్నాడు రెండు చేతులతో నమస్కారం చేస్తూ.

లిఫ్టులో చివరి అంతస్తుకు తీసుకెళ్ళాడు ఝాన్సీని.

గోపాలకృష్ణ ఎదురొచ్చాడు. "హలో సివంగీ.. వెల్కమ్ వెల్కమ్ వెల్కమ్..." అన్నాడు నవ్వి.

భజన గోవిందం గోపాలకృష్ణ ముందు బంటులా వంగి "భలే ఫన్నీ సార్.. లేడీస్సార్." అన్నాడు. అతనిని వెళ్ళమని సైగ చేశాడు-గోపాలకృష్ణ.

ఆదరంగా తన ఛేంబర్లోకి తీసుకెళ్ళాడు.

"కమాన్...ఎన్నాళ్ళయింది సివంగీ నిన్ను చూసి...ఎక్కడున్నావ్...ఏంటి.. మీ ఆయన ఏం చేస్తుంటాడు? పిల్లలా?" కుశల ప్రశ్నలు అడిగాడు.



ఎపుడో పది సంవత్సరాల క్రితం తనతో చదువుకున్న ఒక అల్లరి పిల్ల ఈ రోజు తనను వెతుక్కుంటూ రావడం అతనికి ఎంతో సంతోషాన్ని కలిగించింది. స్వతహాగా ఉత్తమ గుణస్థుడు, సంస్కారి అయిన గోపాలకృష్ణకు చంద్రుడిలో మచ్చలా చిన్న అవకరం ఉన్నది. అతనికి కొంచెం మాటలోపం ఉంది. దాని వలన మాటలు స్పష్టంగా పలకలేడు. అవి ఎదుటి వారికి వినోదం కలిగిస్తుంటాయి. ఇతరులు ఎగతాళి చేసినా బాధ పడడు. అమాయకుడే అయినా సమర్థుడు. భోళా మనిషి. ఝాన్సీ ఎందుకొచ్చిందో అతనికి అర్థం కాలేదు.

"దా...కూర్చో" కుర్చీ చూపించాడు గోపాలకృష్ణ.

కానీ ఉద్యోగార్థియై రావడంతో బిడియంతో నిలుచునే ఉన్నది ఝాన్సీ.

"అరేయ్.." ప్యూనును పిల్చాడు గోపాలకృష్ణ.



అతను రాగానే "ఆ చెయ్యిటియ్" అంటూ అతని చెయ్యి పట్టుకుని గట్టిగా గిల్లాడు. 'సార్' అన్నాడు అతను బాధతో. 'గో..' అంటూ పంపించా డతన్ని.

"అదేమిటి? అడిగింది ఝాన్సీ అర్థం కాక.

-(ఇంకావుంది)



# నవ్వులసందడి




'పెళ్లైనా మనవాడికింకా చిన్నతనం పోలేదురా' అనే కార్టూనూ.




అలాగే విమానం మెట్లు ఎక్కుతూ, పెళ్లిచూపులు చూసే కార్టూన్ గూడా బాగుంది. మిగతా రెండు కార్టూన్లు గూడా పాఠకుణ్ని ఆనందింప చేసేవే.



అలాగే 39 వ పేజీలో ఫ్లూట్ నేర్చుకునే కార్టూనూ, - నిజంగా వాటి గురించి చెప్పడం కన్నా చూస్తేనే బాగా 'ఎంజాయ్' చెయ్యగలం.




'పొల్యూషన్' గురించీ, టీవీ పిచ్చి గురించి 'గోపాలకృష్ణ' గారివి రెండు కార్టూన్లు వున్నాయి.



వారి మూడో కార్టూన్లో ఒక వ్యక్తి 'వెయిట్ లిఫ్టింగ్' చేస్తూ భార్యని/ ప్రియురాల్ని వూహించుకుంటాడు. ఆ స్త్రీ గూడా అంత లావుగా లేనందువల్ల అందులో హాస్యం ఏఁవిటో వెంటనే బోధపడదు. బహుశా వెయిట్ లిఫ్టింగులో పూర్తిగా ఎత్తాక వెయిట్‌ని విసురుగా కింద పడేస్తారు గదా! అలాంటిదేమైనా వుద్దేశించారేమో కార్టూనిస్టు.

బొమ్మన్ గారివి రెండు కార్టూన్లు వున్నాయి. వాటిలో ఒకటి చిల్లర ఇవ్వడానికి కండక్టర్లు పెట్టే తిప్పలు తెలియచేస్తుంది.



-నిశాపతి

## వయొలిన్ వాద్యవిద్వాంసుడు గుడిమెళ్ల కాలధర్మం



నాగయ్య, ఘంటసాల వంటి ఉద్దండ సంగీత దర్శకుల వద్ద వాద్యవిద్వాంసుడుగా పనిచేసిన గుడిమెళ్ల శఠగోపాచార్యులు సెప్టెంబరు 1న తమ 88వ యేట స్వర్గస్తులయ్యారు. ఏలూరులో శృంగారం వెంకట శేషావతారాచార్యులు గారి వద్ద గాత్రం, వీణ, వయొలిన్ అభ్యసించిన శఠగోపాలాచార్యులు తన మామగారు సీనియర్ సముద్రాల ప్రోత్సాహంతో సినీరంగంలో ప్రవేశించారు.

1938లో మద్రాసులో కాలుపెట్టి త్యాగయ్య, భక్తపోతన, వందేమాతరం, సుమంగళి, దేవత మొ॥న సినిమాలకు పనిచేశారు. తరువాత ఘంటసాల వారి వద్ద సంగీతరావు, పామర్తి ఇత్యాదులతోబాటు లవకుశ, పాండవ వనవాసం, పరమానందయ్య శిష్యుల కథ వంటి అనేక సినిమాలకు వాద్య సహకారాన్ని అందించారు. రాజేశ్వరరావు, కె.వి.మహదేవన్, ఆదినారాయణరావు, పెండ్యాల, టి.వి.రాజుల ఆర్కెస్ట్రాలో పనిచేసిన శఠగోపాలాచార్యులు ద్వారం వారి అభిమానాన్ని కూడా చూరగొన్నారు. ఘంటసాల తదనంతరం వృత్తినుండి విరమించుకున్నారు.

రసభరితమైన పాటలకెన్నిటికో తమ వీణ, వయొలిన్ల ద్వారా జీవం పోసిన తండ్రి బాటలో ఒక కుమారుడు సంపత్ కుమార్ వయొలినిస్టుగా కొనసాగుతుండగా తక్కిన ముగ్గురిలో ఇద్దరు సౌండ్ ఇంజనీర్లుగా పనిచేస్తున్నారు. ●

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల

అడిగేవాడికి చెప్పేవాడు లోకువని సామెత. అడిగేవాడు ఏది పడితే అది, ఎలా పడితే అలా అడగొచ్చు కానీ చెప్పేవాడు మాత్రం ఏది పడితే అది, ఎలా పడితే అలా సమాధానంగా చెప్పటానికి వీల్లేదు. తలతిక్క ప్రశ్నలకి కూడా తలకెక్కే సమాధానాలు చెప్పాలి. ఆ బాధ్యతని బలహీనతగా భావించటం వల్ల లోకువగా కనిపించవచ్చును. కానీ మళ్లీ నోరెత్త లేని సమాధాన మిచ్చేవాడికి అడిగేవాడు లోకువే కాదు సరికదా, జీవితాంతం దానుడు కూడా అవుతాడు.

## శబ్దాల మీద నగిషీలు

లోకంలో చాలా రకాల మనుషులుంటారు. కొందరు ఏదోటి అడుగుతూనే వుంటారు. కానీ ఏమీ తెలుసుకోరు. కొందరు ఎవ్వరూ ఏమీ అడక్కపోయినా ఏదోటి చెప్తూనే వుంటారు. కానీ అవతలి వారు వింటున్నారా లేదా అని కూడా పట్టించుకోరు. కొందరు అన్నీ తమకే తెలిసున్నట్టు ఏమీ అడగరు. కొందరు ఎంత తెలుసుకుందామని అడిగినా చెప్పరు. కొందరు అడిగీ అడగనట్టు అడుగుతూ వుంటారు. కొందరు చెప్పీ చెప్పనట్టు వుంటారు. ఎవ్వరెలా వున్నా, అడిగేవాడికి చెప్పేవాడికి కొన్ని కొన్ని ప్రత్యేక లక్షణాలుంటాయని గ్రహించటం మంచిది. అడిగే విధాన మెలావున్నా, చెప్పే మాట హృదయానికి హత్తుకోవాలంటే, మనోరంజకంగా వుండాలంటే - అది సత్యబద్ధమై అందంగా ఉండాలి. ఈ విషయాన్ని మనుధర్మశాస్త్రం మహా చమత్కార గర్భితంగా ఇలా చెప్పింది:-

సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్ సత్య మప్రియం
ప్రియం చ నానృతం బ్రూయాత్
ఏష ధర్మ స్సనాతనః!!




సత్యాన్నే పలుకు; ప్రియాన్నే మాట్లాడు. సత్యమైనా అప్రియాన్ని పలక్కు; ప్రియంగా వుంటుంది కదాని అసత్యం పలక్కు. ఇదే సనాతన ధర్మం - అని శ్లోక తాత్పర్యం. ఇది చెప్పేవాడికి చెప్పే లక్షణ శ్లోకంలా కనిపిస్తుంది కానీ అడిగే వాడెలాంటి విషయం వింటానికి అడగాలో, ఏది వినాలో చెప్పే చమత్కారం కూడా యిందులో వుంది. సత్యాన్నే విను, ప్రియమైన

దాన్నే విను. సత్యమైనా అప్రియంగా వుంటే వినకు. అలాగే ప్రియంగా వుందని అసత్యాన్ని వినకు. అలాంటి లక్షణాలతో చెప్పేవాడు, వినేవాడూ వున్నప్పుడు ఆ చెప్పిన విషయం హృదయానికి హత్తుకుని యెల్లకాలం గుర్తుంటుంది. పూర్వ సాహిత్యంలో ఆ సత్య సౌందర్య నిబద్ధతవుంది కాబట్టే వందలాది, వేలాది వత్సరాలుగా ఆ శ్లోకాలు, పద్యాలు మన స్మృతిపథం నుండి చెరిగిపోకుండా వుంటున్నాయి.

కొన్ని కొన్ని సంస్కృత శ్లోకాలు చూస్తుంటే మనసు వెన్నెల్లో సంద్రంలా ఉప్పొంగిపోతుంది. ఓ సామాన్య విషయాన్ని కూడా, ఓ శబ్దాలంకారం తోనో, ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకం, దృష్టాంతం, అర్థాంతరన్యాసం వంటి ఏదో ఒక అర్థాలంకారం తోనో ఎంత గొప్పగా నాటి కవులు చెప్పగలిగారా అని ఆలోచిస్తే అమృతం తాగినట్టే ఆకలిదప్పలుండవు. ఒక్కొక్క కవి ఒక్కొక్క శిల్పి. శబ్దాల మీద ఆ నగిషీలు చూసినా, ఆ భావ శిల్పాలు చూసినా మతిపోతుంది. విషయం ఏదైనా, అలాంటి అందమైన శ్లోకాలు కొన్ని మీకు పరిచయం చేస్తాను.




**పుష్ప మాత్రం విచినుయాత్ - మూలచ్ఛేదం న కారయేత్**
**మాలాకార ఇవారామే - న యథాంగార కారకః!!**

ఈ శ్లోకంలో పాలకుడెలా వుండాలో చెప్తున్నాడు. పాలకుడు తోటమాలిలా మొక్కల్ని రక్షించి, పూలు కోసి దండలు కట్టేవాడిలా వుండాలే కాని చెట్లని కూల్చి, కాల్చి, బొగ్గులమ్ముకునే వాడిలా వుండకూడదు. పాలకుడు ప్రజని రక్షించి, పోషించి, వారికి నొప్పి కలగకుండా పన్నులు వసూలు చేసి పాలన చేయాలని శ్లోక తాత్పర్యం. ప్రజాభిమానం వున్న పాలకుణ్ని ఎటువంటి శత్రువులూ ఏమిచేయలేరని భోజచరితమిలా చెప్తూవుంది.

**ప్రజాగుప్త శరీరస్య - కిం కరిష్యంతి సంహతా: ?**
**హస్త న్య స్రాత పత్రస్య - వారి ధారా ఇవారయః !!**

ప్రజాభిమానం గొడుగులాంటిది. చేతిలో గొడుగున్న వాణ్ని వాన ఏం చేస్తుందని శ్లోక భావం.

అతిథి మర్యాద గానీ, దాన గుణం గానీ చాలా గొప్పవి. మనిషి యొక్క ఉత్తమ సంస్కారానికి యివి రెండే గీటురాళ్లు. ఆతిథ్యాన్ని గూర్చి ఎంత హృద్యమైన శ్లోకమో చూడండి :-

**అరావప్యుచితం కార్యం - ఆతిథ్యం గృహమాగతే**
**ఛేత్తుః పార్శ్వగతా చ్ఛాయాం - నోప సంహరతే ద్రుమః !!**

అతిథి శత్రువైనా ఆతిథ్యమివ్వాలి. చెట్టు తనను నరకటానికి వచ్చిన వాడికి కూడా నీడనిస్తుంది కదా! అని అర్థం. చెట్టు అంటే పరోపకారానికి, దాన గుణానికి పెట్టింది పేరు.

దాన గుణ విశిష్టతని గూర్చి; దాతని గూర్చి -

**సంగ్రహైక పరః ప్రాయః - సముద్రో పి రసాతలే**
**దాతారం జ: దం పశ్య - గర్జంతం భువనోపరి !!**

అనే శ్లోకం చెప్తూవుంది. అంటే, దాతృత్వం లేకుండా ధనాలు కూడ బెట్టేవాడు సముద్రంలా అట్టడుగునే వుంటాడు. దాన గుణం గలవాడు మేఘంలా లోకానికి పైన గర్జిస్తూనే వుంటాడని భావం. అందుకే - ప్రజలు మేఘాన్ని కోరుకుంటారు గానీ సముద్రాన్ని కాదని భోజచరితమిలా అంటూవుంది :-

**ప్రియః ప్రజానాం దాతైవ**
**న పునర్ద్రవిణేశ్వరః**
**అగచ్ఛన్ కాంక్ష్యతే లోకై**
**ర్వారిదో న తు వారధిః !!**

వారిద మంటే మేఘం. అంటే, నీటి నిచ్చునదని అర్థం. వారిధి అంటే సముద్రం. జలరాశి అని అర్థం. ఇచ్చి పుచ్చుకునే బంధాన్ని, ఫలితాన్ని కవి యెంత అందంగా తేల్చి పారేశాడో గుర్తించండి.

ఎవరికీ ఏమీ ఉపయోగపడకుండా, దిక్కుమాలిన సందేహాలతో, అనుమానాల తో, విమర్శలతో ఇతరుల్ని బాధిస్తూ వుండటం చెడ్డవారి లక్షణం. తప్పు జరగవచ్చుననే భయంతో వీళ్లు ఏ పనీ చేయటానికి ప్రారంభించరు. అది తప్పు అని హితోపదేశం.

**దోష భీతే రనారంభః**
**తత్కాపురుషస్య లక్షణం**
**కై రజీర్ణ భయాత్ భ్రాతః**
**భోజనం పరిహీయతే!!**

తప్పుకి భయపడి ఏ పనీ చేయకపోవటం మంచిది కాదు; అరగదేమోనని అన్నం తినటం మానుకుంటున్నాడా అని భావం. ప్రయత్నిస్తే కార్యసిద్ధి గానీ కేవలం కోరికల వల్ల పనులు కావు.

**ఉద్యమేన హి సిధ్యంతి**
**కార్యాణి న మనోరథైః!**
**నహి సుప్తస్య సిహస్య**
**ప్రవిశంతి ముఖే మృగాః!!**

అని తానెంత సింహమైనా నోరు తెరుచుకుని పడుకుంటే జంతువులు



తామంతట తామొచ్చి దాని నోట్లో పడవు గదా!

అసలు, దుర్జనులతో వైరమూ వద్దు, స్నేహమూ వద్దంటూవుంది హితోపదేశం:-

**దుర్జనేన సమం వైరం**
**ప్రీతించాపి న కారయేత్**
**ఉష్ణో దహతి చాంగారః**
**శీతః కృష్ణాయతే కరమ్!!**

చెడ్డవాళ్లు బొగ్గుల్లాంటి వాళ్లు. బొగ్గులు వేడిగా వున్నప్పుడు చేతులు కాలుస్తాయి, చల్లగా వున్నప్పుడు తాకితే మసి చేస్తాయి. కాబట్టి, ఏవిధంగానూ దుర్జనుల పొత్తు పనికిరాదని హితవు.

లోకంలో మంచి వాళ్ల సంపదలు మంచివాళ్లకు, చెడ్డవారి సంపదలు చెడ్డవారికే వినియోగపడటం కూడా ఉంది. ఎలాగంటే -

**సతాం ధనం సాధుంభి రేవ భుజ్యతే**
**దురాత్మ భిర్దుశ్చరి తాత్మనాం ధనం**
**శుకాదయ శ్చూత ఫలాని భుంజతే**
**భవంతి నింబాః ఖలు కాక భోజనాః!!**

అని మామిడి పండ్లు చిలకలు తింటాయి. వేప పండ్లు కాకులు తింటాయి. అలాగే సుజన, దుర్జన సంపదలుంటాయని అర్థం. ఈ సుజన, దుర్జను లెలా వుంటారంటే-

**నారి కేళ సమాకారా - దృశ్యంతే హి సుహృజ్జనాః**
**అన్యే బదరికా కారా - బహిరేవ మనోహరాః!!**

అని మంచి మనసుగల వారు పైకి కఠినంగా, లోపల రసపూర్ణంగా వుండే కొబ్బరి కాయల్లాంటి వారనీ, ఇతరులు పైకి తీయని మాటలతో, లోపల స్వార్థబుద్ధి కాఠిన్యంతో, పైకి ఎర్రగా అందంగా లోపలంతా కఠినమైన గింజతో వుండే రేగుపండ్ల లాంటివారని తెలుస్తూవుంది.

ఈ స్వార్థ కాఠిన్యం మనిషికి లోభం వల్ల వస్తుంది. లోభి సంఘానికే కాదు, తన వారికే కాదు, తనకు తానుగా కూడా ఎందుకూ పనికి రాడు.

**శునః పుచ్ఛ మివ వ్యర్థం - లుబ్ధస్య పరిజీవనం**
**నహి గుహ్యా గోపాయ చ - న చ దంశ నివారణే!!**







లోభి వాని బ్రతుకు గాని, ధనం గానీ - సిగ్గును దాచటానికిగాని, ఈగల్ని తోలటానికి గాని పనికిరాని కుక్కతోక లాంటిదని శ్లోక భావం.

సుజనులంతా పండితులు కానక్కర లేదు గానీ, పండితులైన వారు మాత్రం సుజనులై వుండాలి. ఇతరుల దోషాల్ని తమలోనే దాచుకుని, గుణాల్ని మాత్రం శిరసా వహించి ప్రకాశింప జేయటమే వారి సౌజన్యమవుతుందని-

**గుణ దోషౌ బుధో గృహ్ణన్**
**ఇందు క్ష్వేడా వివేశ్వరః**
**శిరసా శ్లాఘ్యతే పూర్వం**
**పరం కంఠే నియచ్ఛతిః**

అనే శ్లోకం చెప్తూవుంది. విషాన్ని కంఠాన దాచి, చంద్రుని నెత్తి మీద పెట్టుకున్న శివునిగా పండితుడు దోషాన్ని దాచి గుణాన్ని శిరసా వహించాలని భావం. అంటే, పండితుడు పరమేశ్వరుడంతటివాడై వుండాలని శ్లోక తాత్పర్యం. ఒప్పు దాచి తప్పు చెప్పే తప్పుడు దారి తప్పని హెచ్చరిక!

పండా అంటే బుద్ధి. అది కలవాడు పండితుడు. బుద్ధి ఏడు విధాలుగా వుంటుంది. పండ, మేధ, చార్వి, చత్వ, గృహేత, శ్రౌతి, ప్రతిభ అనేవి ఆ ఏడు విధాలూను. వీటిలో తత్వాన్ని గ్రహించేది పండ, మరుపు లేనిది మేధ, ఊహాపోహలు గలది చార్వి, ఎంత విన్నా విసుగు లేనిది చత్వ, చెప్పేది గ్రహించేది గృహీత, శుశ్రూషలో ఓర్పుగలది శ్రౌతి, ప్రజ్ఞతో బోధ చేసేది ప్రతిభ.

మనిషి పాండిత్యం ఈ ఏడు విధాల్లో ఏదో విధంగా వుంటుంది కాబట్టి ప్రతిమనిషి తనకు తాను చాలా తెలివిగా వుంటున్నానని భావించుకుంటూ వుంటాడు. నిజానికి కావ్య శాస్త్ర పరిజ్ఞాన పరిపూర్ణతతో గానీ పాండిత్యం రాణించదు. అంటే శాస్త్రాలు చదవటమే కాదు వాటి అర్థ విశేషాలు, ప్రయోగాలు గ్రహించాలి. ప్రజ్ఞతో ఆయా శాస్త్రాల అనుభూతిని, ఫలితాన్ని పొందాలి. అలా కాకపోతే ఆ పరిశ్రమంతా వ్యర్థమేనంటూ కొన్ని శ్లోకాలు తెలియజేస్తున్నాయి. చూడండి:

**యథా ఖర శ్చందన భార వాహీ**
**భారస్య వేత్తా నతు చందనస్య**
**ఏవం హి శాస్త్రాణి బహూనధీత్య**
**చార్థేషు మూఢాః ఖరవ ద్వహంతి!!**

శాస్త్రాలు చదివి వాటి అర్థవిశేషాలెరుగని మూఢులు, పరిమళం తెలియక గంధపు కట్టెలు మోస్తున్న గాడిదల్లాంటి వాళ్లని సుశ్రుతం నిందించింది. ఇలాగే ఉత్తర గీత కూడా-

**అధీత్య చాతురో వేదాన్**
**ధర్మ శాస్త్రాణి మానవః**
**యోవై బ్రహ్మ నజానాతి**
**దర్వీ పాకరసం యథా!!**

అంటూ ఎవడు తాను చదివిన వేద శాస్త్రాన్ని బ్రహ్మజ్ఞానంతో అనుసంధానం చేసి దివ్యానందాన్ని పొందడో వాడు రుచికరమైన పులుసులో తిరిగినా ఏ రుచీ తెలియని తెడ్డు లాంటివాడని

యీసడించింది. శాస్త్ర ప్రయోజనాన్ని పొందటానికి స్వయంగా ప్రజ్ఞ కావాలి-

యస్య నాస్తి స్వయం ప్రజ్ఞా
శాస్త్రం తస్య కరోతి కిం?
లోచనాభ్యాం విహీనస్య
దర్పణం కిం కరిష్యతి?

అన్నది చాణుక్య నీతి. కళ్లు లేనివానికి అద్దం వల్ల లాభం లేనట్టు స్వప్రజ్ఞ లేనివానికి శాస్త్ర ప్రయోజనం ఉండదని శ్లోకార్థం. శాస్త్రం ఒక ఆయుధం లాంటిది. దాన్ని ఉపయోగించే తెలివితేటలు, శక్తి గలవాడే పండితుడు గానీ వాటిని కంఠస్థం చేసి అప్పగించే వాడు కాదు. కాబట్టి శాస్త్రాచరణశీలుడు, క్రియావంతుడే పండితుడు. ఈ విషయాన్ని హితోపదేశం ఈ విధంగా ఉపదేశిస్తూ వుంది.

శాస్త్రాణ్యధీ త్యాపి భవంతి మూర్ఖాః
యస్తు క్రియావాన్ పురుషః స విద్వాన్
సుచింతితం ఔషధ మాతురాణాం
నా నామ మాత్రేణ కరోతి శాంతిం !!

చాలామంది శాస్త్రాలు చదివినా మూర్ఖులు గానే వుంటున్నారు. క్రియావంతుడే విద్వాంసుడు గాని వట్టి చదవరి కాడు. బాగా ఆలోచించి నిర్ణయించిన ఔషధమే అయినా దాని పేరు చెప్పినంత మాత్రాన రోగి రోగం పోతుందా? అని శ్లోక భావం. కాబట్టి, పులుసులో గరిటలు, చెట్టు పేరు చెప్పి కాయలమ్ముకునే వాళ్లు తమకోసం తామైనా జాగ్రత్తపడటం మంచిది.




ఇలాగే కవిత్వ విషయాన్ని కూడా క్షుణ్ణంగా ఆలోచించాలి. కవి స్థితిగతుల్ని బట్టి, పేరు ప్రతిష్ఠల్ని బట్టి, ప్రయోజనాల్ని బట్టి కవిత్వాన్ని అంచనావేయటం గానీ, విలువకట్టటం గానీ మంచిది కాదు. ఆ విధానం ఆవు పొదుక్కి జలగ పట్టుకుంటే అది రక్తాన్నే తాగుతుంది గానీ పాలని త్రాగదన్నట్టుగా వుంటుంది. భోజచరిత్ర లోని ఓ అద్భుతమైన శ్లోకంతో ఈ వ్యాసం ముగిస్తాను:-

నిరవద్యాని పద్యాని
యద్యనాథస్య కాక్షతిః!
భిక్షుణా కక్ష నిక్షిప్తః
కి మిక్షు ర్నీరసో భవేత్!!

కవి దరిద్రుడైనా, దనవంతుడైనా కవిత్వం రసవంతంగా ఉంటేచాలు. బిచ్చగాని చంకనున్నంత మాత్రాన చెరకుగడకి తీపి తరగదు గదా! అని శ్లోకార్థం.

ఎన్నెన్నో చెఱుకు తోటలు! రసజ్ఞుల భాగ్యమే భాగ్యం!

# హాసం ఆల్బమ్

ఆల్బమ్ తిరగేస్తూంటే ఎన్నో జ్ఞాపకాలు చుట్టుముడతాయి. పాఠకుల సేవలో గత ఏడాది ఎలా గడిచిందో సింహావలోకనం చేసుకుంటూ ఆ 24 సంచికలలో మేం అందించిన విషయాలను పాఠకుల సౌకర్యార్థం శీర్షికల పరంగా వర్గీకరించి ఇష్యూ నెంబరుతో సహా ఇస్తున్నాం. 25 అంటే అక్టోబరు 1-15,2002, 26 అంటే అక్టోబరు 16-30,2002, 27 అంటే నవంబరు 1-15,2002.... ఇలా సాగుతుంది. తొలినుండి రెగ్యులర్‌గా 'హాసం' చూడనివారికి, తమకునచ్చిన టాపిక్ ఉన్న పాత సంచికలను కొనగోరేవారికి ఇది ఒక కరదీపిక. 'హాసం' వైవిధ్యం, విస్తృతి అంచనా వేయగోరేవారికి ఒక రెడీ రిఫరెన్స్.

## కర్ణాటక శాస్త్రీయ సంగీతం



## తనికెళ్ల భరణి



## హిందుస్తానీ శాస్త్రీయ సంగీతం



అక్టోబరు 2002



(ఇష్యూ నెం.25,26)

## లలిత సంగీతం

చిత్తరంజన్ -



నవంబరు 2002



(ఇష్యూ నెం.27,28)



## లలిత సంగీత కారులు



డిసెంబరు 2002



(ఇష్యూ నెం.29, 30)



## ఆపాత(ట) మధురం



జనవరి 2003 (ఇష్యూ నెం.31, 32)



## తెలుగు సినిమా సంగీతం

### సంగీత దర్శకులు



### గేయరచయితలు



### గాయనీ గాయకులు



## హిందీ సినిమా సంగీతం

### సంగీత దర్శకులు



### గేయరచయితలు



### గాయనీ గాయకులు





ఫిబ్రవరి 2003 (ఇష్యూ నెం.33, 34)

### విదేశీ సంగీతం



### పాప్‌కార్నర్



### అర్థం చేసుకుందాం (హిందీ)



### అర్థం చేసుకుందాం (తమిళం)





మార్చి 2003 (ఇష్యూ నెం.35, 36)

**కొత్త సినిమా పాటల పుస్తకాలు**



ఏప్రిల్ 2003



(ఇష్యూ నెం.37, 38)



**పాటల అనుబంధం**



మే 2003



(ఇష్యూ నెం.39, 40)



**సీరియల్స్**



జూన్ 2003



(ఇష్యూ నెం.41, 42)



**క్లాసిక్ రీటోల్డ్**

**నవ్వుటద్దాలు- ఆచార్య తిరుమల**



**బాపూ రమణీయం**



**హాస్యకథా రచయితలు**

జూలై 2003



(ఇష్యూ నెం.43, 44)



**అనువాద కథలు**



**హాస్య నాటికలు, స్కిట్‌లు**



**కార్టూన్ స్పెషల్స్**



**హ్యూమరథం (తెలుగు)**



**హ్యూమరథం (హిందీ)**



**హ్యూమరథం (విదేశీ)**



**ఇంటర్వ్యూలు**



**ప్రత్యేక వ్యాసాలు**



ఆగస్టు 2003



(ఇష్యూ నెం.45, 46)



**నిక్షిప్త చిత్రాలు**



**శీర్షికలు**



సెప్టెంబరు 2003



(ఇష్యూ నెం.47, 48)



# అంతేరా... బామ్మర్ది



ఆదివిష్ణు





**జరిగిన కథ**

భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ. కొడుకు మురళి. ఉమ ప్రియుడు వేణుకి నాగపూర్లో ఉద్యోగం వచ్చినా ఉమకోసం హైదరాబాదులోనే ఉద్యోగం కై చూస్తూంటాడు. అతని బావ రంగనాథం తన బాల్యమిత్రుడు బసవరాజును స్వయంగా కలిసి అడుగుతానంటాడు. ఈ లోపుల బసవరాజు పేపర్లో వార్తలు చదివి ఖంగారుపడి బావమరిదికై ఉద్యోగాలకోసం వచ్చే ఫ్రెండ్స్‌ను కలవకూడదని నిశ్చయించుకుంటాడు. అందుకే అతన్ని కలవడానికి వచ్చిన రంగనాథాన్ని చూడ నిరాకరిస్తాడు. కానీ తరువాత బాధపడతాడు. ఆ సంగతి తెలియని రంగనాథం బసవరాజుపై మండిపడుతూంటాడు. బావగారి పేరు చెప్పకుండా ఉద్యోగానికై వేణు డైరక్టుగా వెళతాడు. బసవరాజు అతన్ని చూసి ఇంప్రెస్ అయి ఉద్యోగం ఇస్తాడు. ఆ ఉద్యోగానికి ఒప్పుకున్నందుకు ఉగ్రుడైన రంగనాథం వేణుని ఇంట్లోంచి పొమ్మంటాడు. బసవరాజు అసిస్టెంట్ పాణి చదివి వినిపించిన ఓ వార్త వల్ల బసవరాజు తనను కొడుకు, కోడలు ఆహారంలో విషంపెట్టి చంపేస్తారేమోనని భ్రమిస్తూ వారు తెచ్చిన ఏ పదార్థాన్నీ స్వీకరించకుండా అవమానిస్తాడు.

-(ఇక చదవండి)

రెండురోజుల తర్వాత -

బసవరాజు గారి బంగళా చాలా నిశ్శబ్దంగా వుంది!

బసవరాజు తన గదిలో పేపరు చదువుకుంటున్నాడు!

అనగా -

తనక్కావల్సిన వార్తలు వెతుక్కుంటున్నాడు!

అంతలో -

'గుడ్‌మార్నింగ్ సార్' అని వినిపించింది!

అది పాణి గొంతు మాత్రం కాదు!

అంచేత బసవరాజు తలెత్తి చూసేడు!

తన ముందు నిలబడి వున్నది వేణు!

"ఆఫీసుకి వేళయిందండి!" అన్నాడు వేణు

"నువ్వెల్లు! నేను కొంచెం ఆలస్యంగా వస్తా!"

వేణు వెళ్లబోయేడు. బసవరాజు అతన్ని పిలిచేడు -

"వేణూ!"

వేణు ఆగిపోయేడు.

"ఎప్పుడూ లేనిది - ఇవాళ - ఇల్లు ఇంత నిశ్శబ్దంగా వుందేమిటి?"

"ఇంట్లో ఇద్దరు లేకపోతే అంతే గదండీ మరి?"

"ఇద్దరు లేరా? ఎవరా ఇద్దరు?"

"మీ అబ్బాయి డాక్టర్ మురళీ - మీ కోడలు పద్మగారూ!"

"అయ్‌సీ!" అన్నాడు బసవరాజు... ఏదో ఆలోచిస్తూ...

"మీరు ఏమీ అనుకోనంటె-" వేణు నసిగేడు!

"నెవ్వర్! ఏమీ అనుకోను! అసలు విషయమేమిటి? అచ్చెప్పునాకు!"

"డాక్టర్ మురళి మీకోసం స్వీట్స్ తెస్తే - అక్కర్లేదని అతన్ని అవమానించేరుట!"

"అఫ్‌కోర్స్! తినకూడదనుకున్నాను వద్దన్నాను. అందుక్కోపం వచ్చిందా వాడికి?"

"అతనికి కోపం రావడం కాదు! మీకే అతని మీద కోపమొచ్చినట్టు అర్థం చేసుకున్నాడు!"

"అందుకని వేరే కాపరం పెట్టేడా? అచ్చెప్పు నాకు!"

"దాదాపు ఆపనే చేసేడు!"

"ఆ మాటకొస్తే - నేనే వాళ్లని వెళ్లిపొమ్మని చెబుదామనుకున్నాను! వేరే కాపరం ఎంతో మంచిదని సలహా యిద్దామనుకున్నాను!"

"సలహాలు సరే - కారణం కూడా చెప్పాలిగా?"

బసవరాజు సడన్‌గా లేచి నించున్నాడు. గంభీరంగా అన్నాడు -

"అడక్కు! వాళ్లిద్దరూ నాకు దూరంగా వుండటమే మంచిది! నేను కోరుకున్నది కూడా అదే! దట్సాల్! ఇక నువ్వు ఆఫీసుకి వెళ్లచ్చు!" వేణు - మరేమీ మాటాడకుండా ఆ గదిలోంచి బయటకు వస్తున్నాడు!

బసవరాజు గట్టిగా నిట్టూర్చేడు!

* * *

రంగనాథం నడుస్తున్నాడు!

అతని వెనుక నుంచి ఆటో వచ్చి - అతని ముందు ఆగింది!

ఆటో మనిషి ఆటో దిగి రంగనాథాన్ని అడిగేడు -




"ఎక్కడికి వెళ్లాలిసార్?"

ఆటో మనిషిని ఎగాదిగా చూచి అన్నాడు రంగనాథం -

"ఆ రహస్యం నీకు చెప్పాలా?"

"రహస్యమా?" ఆశ్చర్యంగా అడిగేడు ఆటో మనిషి.

"రహస్యమే! మేము ఎక్కడికి వెడుతున్నాం? ఎందుకు వెడుతున్నాం? వెళ్లిం తర్వాత ఏం చేస్తాం? అన్నీ రహస్యాలే! మా బతుకే ఒక పెద్ద రహస్యం! మీరంటే - మీరు ఆటో వాళ్లు కదా! మీకు రహస్యాలుండవు! అంచేత - మేము మిమ్మల్ని పిలవకపోయినా - మాముందు ఆటో ఆపి ఎక్కడికి వెళ్లాలి సార్ అని ఎంతో ఫ్రాంకుగా, కుండ బద్దలు కొట్టినట్టు... ముక్కు గుద్ది మరీ అడుగుతారు!"

ఈలోగా అక్కడికి కృష్ణమూర్తి వచ్చేడు. వచ్చి ఆ దృశ్యాన్ని చూసేడు.

చూసి రంగనాథానిక్కనిపించకుండా - ఆటో పక్కనే దాక్కున్నాడు!

దాక్కుని వాళ్ల సంభాషణ వింటున్నాడు!

ఆటో మనిషి గొణుక్కుంటున్నాడు -

"ఇదెక్కడి బేరమండీ బాబు?"

రంగనాథం అసహనంగా అంటున్నాడు -

"అంతేమరి! మేము బేరాలు చేసుకు బతికేవాళ్లం! మావి బేరాల బతుకులు! పరమ బేవార్సు బతుకులు! మీరంటే ఆటోవాళ్లు కదా! ఆటోలు తొక్కుతూ ఆనందంగా బతికేస్తారు! కనిపించిన ప్రతి పాసెంజర్నీ పట్టుకుని ఆపి - 'ఎక్కడికెళ్లాల్సార్' అని కూపీ లాగుతారు. అక్కడెక్కడో మర్డర్ జరిగితే - ఆ కేసు మీ ఆటో ఎక్కిన పాసింజర్ నెత్తినెయ్యడానికి శతవిధాల ప్రయత్నిస్తారు!"

రంగనాథం తాలూకు ఉపన్యాసానికి ఆటో మనిషి బెంబేలు పడిపోతూ చేతులు జోడించి అన్నాడు -

"సార్! నన్ను నమ్మండి సార్! నేనల్లాంటి మనిషినికాదు!"

"మీరు కాకపోవచ్చు! మేము మాత్రం అల్లాంటి మనుషులమే! జేబుల్లో కత్తులు దాచుకుని ఆటోలెక్కుతాం! కావల్సిన మనిషి



కనిపించగానే ఆటోలోంచి దూకి - వాడి డొక్కలో పొడిచి - మళ్లా ఆటో ఎక్కుతాం! పనైపోయిందని సంతోషిస్తామే గాని - మమ్మల్ని పోలీసులకు అప్పగించే ధర్మ పురుషులు ఆటో వాళ్లేనని - ఆటో ఎక్కే ముందు మాకు తెలీదు!"

ఆటోవాడు ఆ పాపిష్టి మాటలు వినలేక - ఆటో ఎక్కి పారిపోయే ప్రయత్నం చేసేడు!

అతన్ని పట్టుకుని అన్నాడు రంగనాధం - "వెళ్లిపోతావే?"

"మీరు వెళ్లే పనేంటో తెలవక - ఎక్కడికి వెళ్లాలని అడిగేను సార్!"

"ఇప్పుడు చెబ్తున్నాగా -మర్డర్ పనిమీద వెడుతున్నానని!"

"అందుకే సార్! భయమేసి పారి పోతున్నా! మీరు మామూలు పాసింజర్లనుకుని ఆటో ఆపేను!"

"పిచ్చివాడా? మేము పాసింజర్లం కాదు నాయనా! ఖూనీ కోరులం! గళ్ల లుంగీలు కట్టుకుంటాం! తోలు బెల్టులు పెట్టుకుంటాం! చారల బనీన్లు తొడుక్కుంటాం! కారా కిళ్లీలు నములుతుంటాం! మొలలో - కుడిపక్క బాకులు పెట్టుకుంటాం! ఎడంపక్క చాకులు దాచుకుంటాం! పద! నీ ముచ్చట ఎందుక్కాదనాలి! నీ ఆటోలోనే కూచుంటా! నడు!"




ఆ దెబ్బతో ఆటోవాడు రంగనాధం కాళ్ల మీద పడిపోయేడు!

ఎంతో దీనంగా అంటున్నాడు -

"వద్దు బాబో! వద్దు! తమరు ఆ ఫీల్డులో వున్నారు గనక ఇట్టా పొడిచేసి అట్టా పారిపోగలరు! ఆ ఫీల్డు నాకు కొత్త! పైగా పిల్లలు గలోడ్ని! నేను పారిపోలేను! పోలీసులు నా వెంట పడితే నా బతుకు చిరిగిపోయిన యిస్తరాకవుద్ది! నన్నొదిలేయండి బాబో! నే ఎల్లిపోతా!" అని గబగబా ఆటో ఎక్కి పారిపోయేడు!

ఆటో వెళ్లిపోగానే - చాటున దాక్కున్న కృష్ణమూర్తి బయటపడ్డాడు! అతన్ని చూడగానే రంగనాధం చాలా సీరియస్‌గా అతనివేపు నడిచేడు!




కృష్ణమూర్తి పారిపోవాలనుకుని ఆగిపోయేడు!

ఏం జరిగినా ఫర్లేదనే ధీమాతో కత్తిలాగా నిలబడివున్నాడు!

రంగనాధం కృష్ణమూర్తి దగ్గరికి వచ్చేడు! కృష్ణమూర్తి వేపు విగ్రున చూచేడు!

ఆ తర్వాత అతన్నేమీ పలకరించకుండానే వెళ్లిపోయేడు!

వెళ్లిపోతున్న రంగనాధం వేపు వెర్రిగా చూస్తూ నిలబడిపోయేడు కృష్ణమూర్తి!

* * *

బసవరాజు ఆఫీసు గది!

ఆ గదిలోకి వేణు వెడుతున్నాడు!

అతను కొన్ని ఫైల్సుతోనూ - రష్యన్ దిన పత్రికతోనూ బసవరాజు గదిలోకి అడుగుపెట్టేడు!

బసవరాజు చూపు వేణు మీదగానీ అతను మోసుకొచ్చిన ఫైళ్ల మీద గానీ పడలేదు!

కేవలం రష్యన్ దినపత్రిక మీద అతని చూపు లగ్నమైంది!

అది గుర్తించిన వేణు - ఆ దినపత్రికను బసవరాజుకి అందుబాటులో వుంచి - ఒక ఫైలు తెరుస్తూ అన్నాడు -

"మన కడప బిజినెస్సు అద్భుతం! చాలా భారీ ఎత్తున ఆర్డర్స్ వస్తున్నాయి!"

బసవరాజు వేణు మాటలు వినిపించుకోవడంలేదు!

తనకి అందుబాటులో వున్న రష్యన్ దినపత్రికను తీసుకుని పేజీలు తిప్పుకున్నాడు!

ఆ చర్యను ఒక కంట చూస్తూనే - చెబుతున్నాడు వేణు -

"కడప వారిని చూచి మన కర్నూలు బ్రాంచి వాళ్లు కూడా రెచ్చిపోయే సూచనలు కనిపిస్తున్నాయి!"

వ్యాపారంతో నిమిత్తం లేని ప్రశ్న అడిగేడు బసవరాజు -

"ఇదేం పేపరు?"

వేణు అసహనం నటిస్తూ అన్నాడు -

"వ్యాపార విషయాలు డిస్కస్ చేస్తున్నప్పుడు - పేపరు గురించి ప్రశ్నించడం పద్ధతికాదేమో?"

బసవరాజు చిరాకు పడ్డాడు. అందుకే కటువుగా అన్నాడు -

"నాకు పద్ధతిగానే వుంటుంది! ఇదేం పేపరు? అచ్చెప్పునాకు?"

"నికొలోవ్?"

బసవరాజు ఆ పేరు విని ఆశ్చర్యంగా అన్నాడు -

"నికొలోవా? ఎక్కడా వినలేదే?" పాణి కూడా చెప్పలేదు!"

"దేశవాళీ పేపరు కాదుగదా! అంచేత మీరు వినివుండరు. అతను చెప్పివుండడు"

"అంటే ఈ పేపరు-"

"రష్యన్ పేపరు! మాస్కోలో ప్రింటవుతుంది! రష్యా మొత్తమ్మీద నికొలోవ్‌కిమంచి డిమాండుంది! అక్కడిది మోస్ట్ పాప్యులర్ డైలీ!"

"అట్లా చెప్పు! ఇది రష్యన్ డైలీ అన్నమాట! అందుకే ముద్దుగా 'నికొలోవ్' అని పేరు పెట్టేరు!"

వాళ్ళ పేర్లన్నీ అట్లాగే వుంటాయి! రష్యన్ భాషలో 'నికొలోవ్' అంటే 'మేలుకో' అని అర్థం!

"మేలుకో - మంచిపేరు! చాలా మంచి పేరు! అవును మిస్టర్ వేణూ! నీకు రష్యన్ భాష కూడా వచ్చా?"

వేణు మొహమాటం నటిస్తూ అన్నాడు -

"యూనివర్శిటీలో - తోచక నేర్చుకున్నాను!"

ఆ మాటకి బసవరాజు మురిసిపోతూ అన్నాడు -

"మరిన్నాళ్లూ చెప్పేవుకాదే?"

"అడక్కుండా చెప్పడం నా పద్ధతి కాదు!"

"అంతేలే! నేనడగలేదు! నువ్వు చెప్పలేదు! అద్సరేగాని - ఈ పేపరు నీకు ప్రతిరోజూ వస్తుందా?"

"వస్తుంది! రష్యన్ భాష తెలిసిన ఇండియన్స్‌కి - ఈ డెయిలీని ఫ్రీగా పంపిణీ చేస్తారు!"

"ఎవరు?"

"ఈ దేశంలో వున్న రష్యన్ ఎంబసీ! 'నికొలోవ్' చదవందే నాకు నిద్రపట్టదు!"

వేణుకి పేపర్నిస్తూ అన్నాడు బసవరాజు -

"చదువు! వింటాను!"

బసవరాజు మాటకి ఆశ్చర్యపోతున్నట్టు నటిస్తూ అన్నాడు వేణు -

"ఓవ్! మరి చెప్పరే? మీక్కూడా వచ్చా రష్యన్ భాష?"

"ఏమడుగుతావులే! మాతృభాషే సరిగ్గా రాదు! ఇక పరభాష కూడానా? ఇంగ్లీషు భాషొక్కటే అంతంత మాత్రం వచ్చు!"

"మరి... ఈ రష్యన్ డైలీ ఎందుకు చదవమంటున్నారు?"

"సౌండు విందామని-"

"సౌండా? సౌండొక్కటే చాలా? మీనింగు అఖ్ఖర్లేదా?"

"మీనింగు చెప్పేందుకు నువ్వున్నావుగా? ముందు ఆ భాష యొక్క సవుండు వినిపించు!"

వేణు ఆ పేపర్లో రెండు మూడు హెడ్‌లైన్స్ చదివేడు.

బసవరాజు - వేణు చదివింది విని అన్నాడు -

"ఏమిటో కంకర్రాళ్లు కొరుకుతున్నట్టు - సౌండు విచిత్రంగా వుంది!"

"ఆ భాష తీరు అంతే! కంకరభాష!"

"మీనింగేమిటో?"

"ఏముందీ? మామూలే! ఆ దేశంలో కమ్యూనిజం మళ్లా ఇప్పుడిప్పుడే రాజుకుంటోందిట!"

బసవరాజు అయిష్టంగా అడిగేడు -

"నికొలోవ్ నిండా ఆ టైపు వార్తలేనా?"

"మీకు ఏ టైపు వార్తలు కావాలి?"

"అదేనయ్యా! చంపడాలు చావడాలూ..."

"క్రైమ్ న్యూసా?"

"ఎందుకంత ఆశ్చర్యంగా అడుగుతావ్? రష్యాలో క్రైమ్ న్యూసే వుండదా?"




"ఎందుకుండదు? ఆ న్యూస్ కోసం రెండు పేజీలు ప్రత్యేకంగా కేటాయిస్తారు! ఆ పేజీలకు 'నేరాలో పేజోవ్' అనిపేరు పెట్టేరు!"

"నేరాలో పేజోవ్ - ఆ ఒక్కముక్క అర్థమైనట్టుంది! ఆ పేజీల్లో ఒక మంచివార్త చదువు!"

"మరి కర్నూలు ఫైలు -"

బసవరాజు కించిత్తు కోపంగా అన్నాడు -

"ఇప్పుడు నాకు కర్నూలు వద్దు! కాకరకాయా వద్దు! నేరాలో పేజోవ్‌లో ఒక్కటంటే ఒక్కటి - మచ్చుకి ఒకే ఒక్క వార్త చదువు!"

వేణు ఆ పేజీల్లో ఒక వార్తని పట్టుకుని - గబగబా కంకర్రాల్లు కొరికేసేడు!

అతను చదవడం పూర్తికాగానే -

"ఇప్పుడు తెలుగులో చెప్పు?" అన్నాడు బసవరాజు.

"ఈ గొడవ మాస్కోలో జరిగింది! తోళ్ల వ్యాపారం చేసే తోర్కియోవ్‌ని -"

"తోర్కియోవ్ అంటే? తోళ్ల వ్యాపారం చేసే మనిషి పేరా?"

"అవునండి!"

"వద్దు! పేర్లొద్దు! పేర్లవీ లేకుండా వార్త మాత్రమే చెప్పు!"

"అదేం పద్ధతి?"

"వార్త బాగాఅర్థం కావాలిగదా! బాగా అర్థం కావాలంటే పేర్లవీ అడ్డు పడకూడదు! ఊ... కానివ్వు!"

"ఆ పేరులేని తోళ్ల వ్యాపారి దగ్గిర ఒక పేరులేని పి.ఎ. వున్నాడు!"

"అంటే? నా దగ్గిర పాణి వున్నట్టు!"

వేణు బసవరాజుని మెచ్చుకుంటూ అన్నాడు-

"అబ్బ! ఉస్కో అంటే చాలు - పాయింటుని భలే పట్టుకుంటారు!"

"నేనంతే! నాదో టైపు! నువ్వు ఉస్కో అను!"

"కానీ - పాణి పీఆర్వోకదా? పి.ఏ. కాదు కదా?"

"పి.ఎ. కూడా అతనే! ఇప్పుడు పాణి గొడవ ఎందుకు? నువ్వు ఉస్కో అను!" అన్నాడు బసవరాజు!

**-(ఇంకావుంది)**



అక్టోబర్ 2 గాంధీ జయంతి సందర్భంగా...

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : దో ఆంఖేఁ బారహ్ హాథ్
రచన : భరత్ వ్యాస్
సంగీతం : వసంత్ దేశాయ్
గానం : లతా మంగేష్కర్, బృందం
అభినయం : శాంతారాం, సంధ్య తదితరులు







అయ్ మాలిక్ తేరే బందే హమ్
ఐసే హోఁ హమారే కరమ్
నేకీ పర్ చలేఁ, ఔర్ బదీ సే టలేఁ
తాకి హఁస్‌తే హుయే నిక్‌లే దమ్

బడా కమ్‌జోర్ హై ఆద్మీ
అబ్ భీ లాఖోఁ హై ఇస్‌మేఁ కమీఁ
పర్ తూ జో ఖడా, హై దయాలూ బడా
తేరీ కిర్‌పా సే ధర్తీ థమీ
దియా తూనే హమేఁ జబ్ జనమ్
తూ హీ ఝేలేగా హమ్ సబ్‌కే గమ్ ॥నేకీ పర్॥ ॥అయ్ మాలిక్॥

యే అంధేరా ఘనా ఛా రహా
తేరా ఇన్సాన్ ఘబ్‌రా రహా
హో రహా బేఖబర్, కుఛ్ న ఆతా నజర్
సుఖ్ కా సూరజ్ ఛుపా జా రహా
తో అమావస్ కో కర్‌దే పూనమ్ ॥నేకీ పర్॥ ॥అయ్ మాలిక్॥

జబ్ జుల్మోఁ కా హో సామ్‌నా, ఆ ఆ
జబ్ జుల్మోఁ కా హో సామ్‌నా
తబ్ తూ హీ హమే థామ్‌నా
వో బురాయీ కరేఁ, హమ్ భలాయీ భరేఁ
నహీఁ బద్‌లే కీ హో కామ్‌నా
బఢ్ ఉఠే ప్యార్ కా హర్ కదమ్
ఔర్ మిటే బైర్ కా యే భరమ్ ॥నేకీ పర్॥ ॥అయ్ మాలిక్॥

సామాజిక సమస్యలను చర్చించటానికి అనువైన శక్తివంతమైన సాధనంగా చలనచిత్ర మాధ్యమాన్ని గుర్తించిన తొలి దర్శకులలో ఒకరు వి.శాంతారాం. 30వ దశకంలో రైతుల సమస్యలు ఇతివృత్తంగా రూపొందిన 'సావ్‌కారీ పాశ్' చిత్రంతో మొదలైన ఆయన సినీ ప్రస్థానం 'దహేజ్', జాతీయ సమైక్యతపై 'తీన్ బత్తీ చార్ రాస్తా', జైలు సంస్కరణలపై 'దో ఆంఖేఁ బారహ్ హాథ్' చిత్రాల రూపకల్పనతో సాగిపోయింది. ఆయన ఎన్నో కొత్త ప్రక్రియలను కూడా ప్రవేశ పెట్టారు. తొలి బాలల చిత్రం (రాణీ సాహిబా), తొలిసారి ట్రాలీ ఉపయోగించిన చిత్రం (చంద్రసేన), తొలి రంగుల చిత్రం (సైరంధ్రి), తొలిసారి టెలిఫొటో లెన్స్ వాడిన చిత్రం (అమృత్ మంథన్), తొలిసారి యానిమేషన్ ఉపయోగించిన చిత్రం (జంబూకాకా), తొలిసారి బ్యాక్ ప్రొజెక్షన్ వాడిన చిత్రం (అమర్‌జ్యోతి), తొలిసారి విదేశాలలో ప్రదర్శించిన చిత్రాలు (డా॥ కోట్నిస్ కీ అమర్ కహానీ, శకుంతల) ఆయన ఖాతాలోనే ఉన్నాయి. ఆయనకు దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు ఇచ్చి సత్కరించటమే కాక భారత ప్రభుత్వం ఆయన శతజయంతిని పురస్కరించుకుని ఒక పోస్టల్ స్టాంప్ కూడా విడుదల చేసింది.



'దో ఆంఖేఁ బారహ్ హాథ్' ఒక ఆదర్శవంతుడైన జైలర్ కథ. ఖైదీలను జైలు గోడల మధ్య ఉంచకుండా వారిని స్వేచ్ఛగా ఉంచి సంస్కరించే ఈ పాత్రలో శాంతారాం నటించారు. ద్వేషం నిండిన వారిపట్ల కఠినంగా వ్యవహరిస్తే లాభం ఉండదని, ద్వేషాన్ని ప్రేమతోనే జయించాలని నమ్మిన జైలర్ ఆరుగురు ఖైదీలలో మార్పు తీసుకువచ్చి వారిని గాంధీజీ చూపించిన అహింసా మార్గంలో నడిపిస్తాడు. వారికి కష్టపడి స్వశక్తితో జీవించడం నేర్పిస్తాడు. అతని పర్యవేక్షణలో వారు కష్టజీవులుగా మారటానికి సంకేతమే ఈ చిత్రం పేరు - 'దో ఆంఖేఁ బారహ్ హాథ్' (రెండు కళ్ళు-పన్నెండు చేతులు). ఈ చిత్రానికి 1957వ సంవత్సరపు ఉత్తమ చిత్రంగా జాతీయ పురస్కారం లభించింది. బెర్లిన్ ఫిల్మ్ ఫెస్టివల్‌లో సిల్వర్ బేర్ అవార్డు,



ఉత్తమ విదేశీ చిత్రంగా శామ్యూల్ గోల్డ్విన్ అవార్డు కూడా లభించాయి.

ఈ చిత్రానికి థీమ్‌సాంగ్ లాగ ఆసాంతం వినిపించే భజన 'అయ్ మాలిక్ తేరే బందే హమ్'. ధర్మబద్ధంగా నడిచి, దేవుణ్ని నమ్ముకుని, క్షమాగుణం కనబరుస్తూ జీవితం గడపాలని చెప్పే అద్భుత భక్తిగీతం ఇది. నేటి సమాజంలో కౌన్సెలింగ్, సెల్ఫ్ హెల్ప్ బుక్స్‌లో చెప్పే విషయాలు ఇవే కదా అనిపిస్తుంది ఈ పాట వింటే. ఏ మతం వారైనా సరే ఈ పాటలో ఒక్క పదం కూడా మార్చకుండా ప్రార్థన చేసుకునేలా వ్రాశారు గీత రచయిత భరత్‌వ్యాస్. ఈయన 1943లో గీత రచయితగా చిత్ర రంగంలో అడుగుపెట్టి దరిమిలా ఖేమ్‌చంద్ ప్రకాశ్ సంగీత దర్శకత్వంలో అనేక గీతాలు వ్రాశారు. వారి కాంబినేషన్‌లో 'జిద్దీ', 'సావన్ ఆయారే', 'బిజిలీ', 'తమాషా', 'ముకద్దర్' చిత్రాలు వచ్చాయి. 50వ దశకంలో ఆయన గీత రచయితగా ఎంతో ఖ్యాతి గడించారు. బిమల్‌రాయ్, విజయ్‌భట్, వి.శాంతారాం చిత్రాలలో పాటలు వ్రాశారు.

వసంత్ దేశాయ్‌కి సంగీత దర్శకుడిగా మంచి పేరు తెచ్చిన చిత్రం 1942లో శాంతారాం రాజ్‌కమల్ స్టూడియోస్ స్థాపించి రూపొందించిన మొదటి చిత్రం 'శకుంతల'. ఆయన రాగాలు, మాధుర్యం పాటిస్తూ ఎన్నో పాటలు చేశారు. జయదేవ్, చిత్రగుప్త, రోషన్‌లలా ఆయన సింప్లిసిటీకే ప్రాధాన్యత ఇచ్చేవారు. అన్ని రకాల పాటలూ చేశారు. 'ఆశీర్వాద్'లో అశోక్‌కుమార్ పాడిన 'రేల్‌గాడీ రేల్‌గాడీ' ఆయన చేసినదే. ఆయన స్వరపరచిన మరో గొప్ప ప్రార్థనా గీతం 'హమ్‌కో మన్‌కీ శక్తి దేనా' (గుడ్డీ). 'అయ్ మాలిక్ తేరే బంద్ హమ్' ఆయనకి అజరామర కీర్తిని ఆర్జించి పెట్టింది.

ఈ చిత్రంలో ముఖ్యమైన ఘట్టాలలో ఈ పాట చరణాలు బృందగానంలో వినబడతాయి. క్లయిమాక్స్‌లో లతా మంగేష్కర్ పాడిన వెర్షన్ హీరోయిన్ సంధ్యపై చిత్రీకరించారు. ఈమెది హీరోకి సహాయపడే ఒక బొమ్మలమ్ముకునే యువతి పాత్ర. ఖైదీలను కాపాడే ప్రయత్నంలో హీరో తీవ్రంగా గాయపడిన సందర్భంలో ఆమె ఈ ప్రార్థనా గీతం పాడుతుంది.

మాలిక్ అంటే ప్రభువు, యజమాని. ఈ పదాన్ని దేవుడికి అన్వయించటం 'సబ్‌కా మాలిక్ ఏక్' అనే సాయిబాబా సూక్తి ద్వారా పరిచితమే. బందే అంటే బిడ్డలు, సేవకులు అనే అర్థాలలో వాడతారు. కరమ్ అంటే కర్మ, చేతలు. నేకీ అంటే ధర్మం, మంచితనం. బదీ అంటే అధర్మం, చెడు (ఏదైనా పదానికి ముందు బద్ చేరిస్తే చెడ్డది అనే అర్థం వస్తుంది. ఉదా॥ బద్‌నామ్). దమ్ అంటే ఊపిరి. బలం, లిప్త అనే బహుళార్థాలు ఉన్నాయి. ఇక్కడ ఊపిరి సరైన అర్థం.

**'ఓ ప్రభూ! నీ సేవకులం మేం**
**ఉండాలి మా చేతలు ఇలా**
**ధర్మాపథాన నడవాలి, చెడు విడనాడాలి**
**నవ్వుతూనే ప్రాణం వదలాలి'**

మానవులంతా దేవుడికి కట్టుబడి ఉండాల్సినవారే. సృష్టి అంతా ఆయన ఆధీనంలో ఉంది. ఏ మతస్థులైనా వారి పవిత్ర గ్రంథాలలో ఉండే ప్రధాన అంశం తమను సన్మార్గంలో నడిపించమని దేవుణ్ని వేడుకోవటం. 'బదీ సే టలే' అంటే 'చెడుకి దూరంగా ఉండాలి' అని. చెడు వినవద్దు, చెడు కనవద్దు, చెడు అనవద్దు అనే సందేశం పాటించాలని భావం. జీవితం ఇలా గడిపితే హాయిగా, ఎటువంటి అపరాధభావం లేకుండా ప్రాణం వదలవచ్చు.

కమ్‌జోర్ అంటే బలహీనం. ఆద్మీ అంటే మనిషి. కమీ అంటే లోపం. దయాలూ అంటే దయాళువు. కిర్‌పా అంటే కృపకు వికృతి. ధర్తీ అంటే భూమి, ధరణి. జనమ్ అంటే జన్మ. గమ్ అంటే బాధ.

**'అమిత బలహీనుడు మానవుడు**







**కలవెన్నో లోపాలు ఇప్పటికీ**
**కానీ నీవున్నావుగా, గొప్ప దయాళువుగా**
**నీ కృపతో నిలిచింది ధరణి**
**ఇచ్చావు నీవే మాకీ జన్మని**
**నీవే బాపేవు మా బాధని'**

మనిషి చాలా బలహీనుడు. అనేక ప్రలోభాలకి లొంగిపోతాడు. కానీ భగవంతుడు ఎంత దయామయుడంటే మనం చేసిన పాపాలను క్షమిస్తూ ఉంటాడు. అందుకే భూమి పాపభారంతో కృంగిపోకుండా ఉంది. మనిషి కూడా దయాగుణం, క్షమాగుణం కలిగి ఉండాలి. దేవుడిచ్చిన జన్మని సార్థకం చేసుకోవాలి. అప్పుడు ఎటువంటి బాధ వచ్చినా దేవుడే తీరుస్తాడు.

అంధేరా అంటే చీకటి. ఘనా అంటే చిక్కనిది. ఇన్సాన్ అంటే మానవుడు. ఘబ్‌రానా అంటే భయపడటం. బేఖబర్ అంటే ఏమీ తెలియకపోవటం. సూరజ్ అంటే సూర్యుడు, రవి. రోష్నీ అంటే కాంతి, తేజం. అమావస్ అంటే అమావాస్య. పూనమ్ అంటే పున్నమి.

**'అలముకుంటోంది చిక్కని చీకటి**



కలతపడుతున్నాడు నీ మనిషి
దిక్కేతోచదు, ఏమీ కానరాదు
కనుమరుగైపోతున్నాడు రవి
నీ తేజంలో ఉందీ శక్తి
అమాస అయ్యేను పున్నమి'

ఒక్కోసారి మనిషిని నిరాశ ఆవహిస్తుంది. ఆ నిరాశలో నిస్పృహ కలుగుతుంది. ఇక్కడ సూర్యుడిని సుఖంతో పోల్చారు. ఆ సూర్యుడు అస్తమిస్తున్నట్టు కనబడతాడు. కానీ అంతా జరగాల్సిన విధంగానే జరుగుతోందని అనుకుంటే, ఫలితాన్ని దేవుడికే వదిలేస్తే దేవుడే సరైన మార్గం చూపిస్తాడు. దేవుడి దయ ఉంటే అమావాస్య కూడా పున్నమిగా మారుతుంది. దేవుడు మనకోసం రాసిపెట్టి ఉన్నది పున్నమి అయితే సూర్యుడు అస్తమించినా వెలుగే కదా!

జుల్మ్ అంటే అరాచకం. బురాయీ అంటే చెడు. భలాయీ అంటే మంచి. బద్‌లా అంటే ప్రతీకారం. కామ్‌నా అంటే వాంఛ, ఆకాంక్ష. కదమ్ అంటే అడుగు. బైర్ అంటే వైరం. భరమ్ అంటే భ్రమ, మాయ.

'అరాచకం ఎదురైనపుడు
నీవే మాకు తోడై ఉండు
వారు చెడు చేసినా, మేం మంచే చేయాలి
ప్రతీకార వాంఛ కూడదు
ప్రతి అడుగూ ప్రేమ బాటనే
వైరమనే మాయ తొలగాలిలే'

ఎవరైనా చెడు చేస్తే మన స్వభావానికి విరుద్ధంగా చెడు చేయాలని తలచకూడదు.

ఇక్కడ ఒక చిన్న కథ గుర్తొస్తుంది - తేలు కుట్టిన గురువు గారికి మందు వేసి కట్టుకట్టిన శిష్యుడు 'ఆ తేలుని ఎందుకు చంపలేద'ని అడిగితే 'దాని స్వభావం కుట్టడం - అది కుట్టింది. చంపడం నా స్వభావం కాదు. అది దాన్ని స్వభావాన్ని వదులుకోనపుడు నేను స్వభావాన్ని ఎందుకు వదులుకోవాలి' అన్నారట గురువుగారు. ఒకరు చెడు చేసినా మనం మంచే చేయాలి. 'అపకారికినుపకారము' చేయాలి. ప్రేమతోనే అడుగు ముందుకేయాలి. అసలు వైరం, వ్యతిరేకభావం ఉండకూడదు. కొందరు ఈ ప్రపంచమంటే కల్మషాలకు నిలయమని అనుకుంటారు. ఎదుటివారు తమను ఎప్పుడూ మోసం చేయాలనుకుంటున్నారని భావిస్తారు. ఈ వ్యతిరేక భావం పక్కన పెట్టి ఎదుటివారిని మన లాంటి వారే అని భావిస్తే, వారితో సవ్యంగా ప్రవర్తిస్తే ప్రపంచం ఏమంత చెడుగా అనిపించదు. మనకి అందరితోనూ వైరమే అనే మాయ తొలగిపోతుంది.

గాంధీ తత్వాన్ని కాచివడబోసిన ఈ పాటలోని సందేశాన్ని పాటిస్తే సమసమాజం సాధ్యమే

- పి.వి.సత్యనారాయణరాజు

---




**1959**

సాహిర్ గీత రచనలో ముఖేష్, సుధా మల్హోత్రా గానం చేసిన ఎవర్‌గ్రీన్ సాంగ్ 'తుమ్ ముఝే భూల్‌భీ జావో'(దీదీ) ఎన్.దత్తా స్వరకల్పనలో రూపుదిద్దుకుంది. అయితే ఈ గీతాన్ని రికార్డు చేసింది మాత్రం సుధా మల్హోత్రా. ఈ పాటను సాహిర్ సుధాను ఉద్దేశించి రాశారంటారు.

తమ్ముడు ఆనంద్‌జీ తో కలిసి టీముగా ఏర్పడేముందు ఒంటరిగా కళ్యాణ్ జీ విర్జీ షా ' ఓ తేరా క్యా కహనా', 'బేదర్ద్ జమానా క్యా జానే' (ముఖేష్ హిట్ గీతం 'నైనా హై జాదూ భరే'ఈ చిత్రంలోనిదే!)లాటి సినిమాలకు సంగీతాన్ని చ్చారు. 'సట్టాబజార్' తో కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ టీము ఏర్పడింది. మలిచిత్రం - 'మదారి'.



'ఓ తేరా క్యా కహనా' లో మెహమూద్, కామూ, భగవాన్

'సట్టాబజార్' చిత్రం ద్వారా గీత రచయిత 'గుల్షన్ బావ్రా' పరిచయం. నాలుగు దశాబ్దాలుగా పరిశ్రమలో ఉన్నప్పటికీ కేవలం



'సట్టాబజార్' లో బాల్‌రాజ్ సాహ్నీ

300 గీతాలు మాత్రమే రచించడం అతని సెలక్టివ్ పనితీరుకు నిదర్శనం. 'సట్టాబజార్' చిత్రంలో ఈయన పాటలు- 'తుమ్హే యాద్‌హోగా'(లతా-హేమంత్), 'అంకఢే క ధంధా, ఇక్ దిన్ తేజీ',(రఫీ) 'చాందీ కే చాంద్ టుకడే'('హేమంత్) హిట్ గీతాలుగా నిలిచాయి.

'మదారి' చిత్రంలో 'దిల్ లూట్‌నే వాలే జాదూగర్'(లతా)'మై హూ మస్త్ మదారీ' (ముఖేష్) పాటలు హిట్ అయ్యాయి.

ఖైదీ నెం.911 కోసం దత్తారాం స్వర పరిచిన 'మీఠీ మీఠీ బాతోం సే బచనా జరా' లతా హిట్స్‌లో ఒకటిగా నిలిచిపోయింది. ఇది తెలుగులో 'తీయతీయని తేనెల మాటలతో' (ఖైదీ కన్నయ్య) గా వచ్చింది.

'ఏక్ రాత్ మేఁ దో దో చాంద్ ఖిలే'(బర్ఖా), 'దిల్ కో లాఖ్ సంభాల్'(గస్ట్‌హౌవుస్), 'లాగీ ఛూటే నా', 'దగా దగా వయీ'(కాలీ టోపీ లాల్ రూమాల్) పాటలు ద్వారా చిత్రగుప్త మంచిపేరు సంపాదించారు.

షమ్మీ కపూర్- ఆశాపరేఖ్‌లు జంటగా ఎస్.ముఖర్జీ దర్శకత్వంలో నాసిర్ హుస్సేన్ నిర్మించిన 'దిల్ దేకే దేఖో' చిత్రం ద్వారా సంగీత దర్శకురాలిగా ఉషాఖన్నా పరిచయం. రఫీ గానం చేసిన టైటిల్ సాంగ్ , 'హమ్ ఔర్ తుమ్', 'బోలో బోలో' తో పాటు ఆశా-రఫీల 'యార్ చుల్‌బులా హై','బడే హై దిల్ కే కాలే' పాటలు మంచి హిట్స్.



ఉషాఖన్నా

-(వచ్చే సంచికలో మరికొంత)

# రాజా ఆడియో రివ్యూ

ప్రముఖ ఛాయాగ్రాహకుడు రసూల్‌ను దర్శకుడిగా పరిచయం చేస్తూ జెమినీ కిరణ్ తన నిర్మాణ సంస్థ అయిన ఆనంది ఆర్ట్ క్రియేషన్స్ పతాకంపై నిర్మించిన 'ఒకరికి ఒకరు' సినిమా ఆడియో క్యాసెట్ మార్కెట్‌లో వుంది. సిరివెన్నెల సీతారామశాస్త్రి ఒక పాటను, చంద్రబోస్ అయిదు పాటలను రాసిన ఈ చిత్రానికి ఎం.ఎం. కీరవాణి సంగీత దర్శకుడు.

క్యాసెట్‌లో తొలుత వినిపించే 'వెళ్ళిపోతే ఎలా (వెళ్ళనంటే ఎలా)' పాట ఓ టిపికల్ కంపోజిషన్. రెండు ఆక్టేవ్‌లలో పాడి వేర్వేరు ట్రాక్‌లలో మిక్స్ చేసిన పాట యిది. సంగీత దర్శకుడిగా, గాయకుడిగా కీరవాణి శక్తికి, ఆసక్తికి దర్పణం పట్టే పాట. ప్రతిభను నిరూపించు కోవాలనుకున్న ప్రతి వర్ధమాన గాయకుడికి ఈ పాటను పాడడం ఓ లిట్మస్ టెస్ట్ లాంటిది. సీతారామశాస్త్రి గారిలోని భావుకుణ్ణి, దార్శనికుణ్ణి సమాంతరంగా చూపించే పాటల్లో ఇదొకటి. చెలి దారిని - నింగి - చినుకు వంతెనేసి చెప్పడం లాంటి వాక్యాలు ఆయనలోని భావుకత్వానికి, పాటలోని రెండవ చరణం దార్శనికతకు సాక్ష్యంగా నిలుస్తాయి.




విడుదల : సుప్రీమ్
వెల : రూ 30/-

తర్వాత వచ్చే 'నాదిరిదీనా నాదిరిదీనా నాదిరిదీనా నచ్చినదాని కోసం నా తపన' పాట ఈ యేటి మేటి పాటల్లో ఒకటి. అవార్డులంటు ఇస్తే ఇలాంటి పాట కివ్వాలనిపించే పాట యిది. అగ్రతాంబూలం కచ్చితంగా స్వరకల్పనకి, పాడించిన విధానానికీ వెళుతుంది. మనసు హాయిగా గాలిలో తేలిపోవాలంటే యమన్‌రాగం ఆధారంగా తయారైన ఈ పాట పాడుకుంటే చాలు. కార్తిక్, గంగ విజృంభించి మరీ పాడేరు. అలాగే... చంద్రబోస్ కూడ తన శైలికి భిన్నంగా రాశాడీ పాటని.

మూడవ పాట 'ఎక్కడున్నావమ్మా ఓ ప్రియతమా' ఓ సరదా పాట. సరదా అంటే నిజంగా సరదాయే...! సరదా ముసుగులో హద్దు మీరిన చిలిపి తనం కాదు... హ్యాప్పీగా హుషారుగా వినొచ్చు. సుబ్బలక్ష్మి అనే అమ్మాయికి రకరకాల యింటి పేర్లు తగిలించి పిలవటం. ఈ పాటలో చంద్రబోస్ చేసిన ప్రయోగం. ఇలాటి పాటలు ఎలా పాడాలో అలాగే పాడేరు బాలూ.

సంగీత దర్శకుడు కీరవాణి హైదరాబాదు వచ్చినప్పుడు రెగ్యులర్‌గా ఒక ట్రావెల్ కంపెనీకి సంబంధించిన కారుని తెప్పించుకుంటూ ఉంటారు. ఓరోజు ఆ కంపెనీకి చెందిన కారుడ్రైవర్ కీరవాణిని ఎక్కడికో తీసుకువెళుతూ "క్షణక్షణం సినిమా తర్వాత అలాంటి మ్యూజిక్ మీరు ఇంకే సినిమాలోనూ ఇవ్వలేదేంటి సార్!?" అని అడిగాడు. ఆ మాట కీరవాణి గార్ని క్షణం సేపు ఆలోచనలో పడేసింది. ఆ డ్రైవర్ అన్నమాటల్ని దృష్టిలో పెట్టుకునే ఈ సినిమాకి స్వరకల్పన చేశానని 'ఒకరికి ఒకరు' ఆడియో రిలీజ్ నాడు సభాముఖంగా చెప్పారు కీరవాణి. 'నువ్వే నా శ్వాస... మనసున నీకై అభిలాష' పాట వింటుంటే ఆ మాటల ప్రభావం ఈ పాటకే వుందనిపిస్తుంది. శ్రేయగోషల్ అచ్చం తెలుగమ్మాయిలా ఎంత బాగా ఈ పాటను పాడిందో చెప్పలేం. అంత చక్కగా ఉందా అమ్మాయి ఉచ్చారణ. రాబోయే రోజుల్లో ఎంతో మంది నోట ప్రతివారూ రకరకాల వేదికలపై వినబోయే పాట యిది. జాగ్రత్తగా వింటే 'నాదం తనుమనిశం' అనే సంప్రదాయ కీర్తన లోని తొలి వాక్యాన్ని వెస్ట్రనైజ్ చేస్తూ అలా ఆలాపించు కుంటూ పోతే ఈ 'నువ్వే నా శ్వాస' పాట పల్లవి పుట్టిందేమోనని అనిపిస్తుంది. ఆ కీర్తన తెలిసినవాళ్ళు 'తనుమనిశం' దగ్గర వరసను గుర్తుకు తెచ్చుకొని ఈ పాటలో 'నా శ్వాస' దగ్గర ట్యూన్‌తో పోల్చి చూసుకోండి. నడక ఒక్క లాగే ఉందనిపిస్తుంది. ఈ పాటలో ప్రముఖంగా వినిపించే 'సెల్లో' వాద్యం 'క్షణక్షణం' చిత్రంలో 'జామురాతిరి' పాటలో కూడా వినబడుతుంది జాగ్రత్తగా గమనిస్తే!

టిప్పు, నిత్య సంతోషిణి పాడిన 'ఘాటు ఘాటు ప్రేమ - ఈ ఘాటు చాలదమ్మా' మరో గుడ్ మెలోడీ... థాట్‌ని బీట్ చెయ్యని బీట్ అంటే ఎలా వుంటుందో ఈ పాటని విని తెలుసుకోవాలి. ఈ పాటకి మధ్యమావతి రాగాన్ని ఆధార రాగంగా తీసుకున్నారనిపిస్తుంది.

కీరవాణి, గంగ పాడిన 'అల్లో నేరేళ్ళో' పాట కూడా టిపికల్ కంపోజిషన్ కోవలోకి వస్తుంది. పల్లవి విని చరణాల విషయంలో ఓ అభిప్రాయానికి ముందే వచ్చేస్తే తర్వాత గట్టిగా నాలుక్కరుచు కునేటంత భిన్నంగా, మెలోడియస్‌గా వచ్చాయి చరణాలు. రెండో చరణంలో కీరవాణి పాడిన పద్ధతి వింటుంటే - ఉత్తరాది సంగీతపు పోకడలు కొంతా, రెహమాన్ స్వరపరిచిన 'వెన్నెలా... వెన్నెలా' (ప్రేమదేశం)పాట కొంతా... ఈయన మీద ప్రభావం చూపించాయా అని అనిపించక మానదు. ఈ సమీక్షకుడు ఇటీవల కీరవాణితో మాట్లాడినప్పుడు "ఈ 'ఒకరికి ఒకరు' పాటలలో ఈ పాటంటేనే నాకెక్కువ ఇష్టం" అని అన్నారాయన. సాహిత్య పరంగా చూసుకుంటే ఈ పాట మొదటి చరణంలోనే కాదు మిగిలిన పాటలలో కూడా మనకు కొత్త చంద్రబోస్ అడుగడుగునా కనబడుతూ వుండడం ఓ విశేషం. అతనిలోని తపనకు తగ్గ పరిణతి కనిపిస్తుందీ సినిమాలోని పాటలలో. టోటల్‌గా కీరవాణి, చంద్రబోస్ కాంబినేషన్‌లో ఇటీవల వచ్చిన గంగోత్రి - సింహాద్రి - ఒకరికి ఒకరు - ఈ మూడింటిలో పాటలను వరసగా చూసుకుంటే వీళ్ళిద్దరిలోనూ కనబడిన సృజనాత్మక వైవిధ్యానికి భలే ముచ్చటేస్తుంది. ■



విడుదల : సురభి మ్యూజిక్
వెల : రూ.50/- (క్యాసెట్),
రూ॥100/- (సి.డి.)

ఈ క్యాసెట్లు, సి.డి లు 'హాసం' ఆఫీసులో లభ్యమవు తున్నాయి. నేరుగా కావాలనుకునే వారు దిగువ నున్న అడ్రస్‌కు ఎం.ఓ. ద్వారా పైకాన్ని పంపి కొరియర్‌లో తెప్పించుకొన వచ్చును. కొరియర్ చార్జీలు అదనం.

1-9-289/3/1/ఎ, విద్యానగర్,
పోస్టాఫీసు దగ్గర, మెగాసిటీ నెం.774,
హైదరాబాద్-500 044.
(ఫోన్ : 27616880)





"మనిద్దరం పాలు, నీళ్లలాగ కలసిపోయాం కదూ రాధా"
"ఆ మాటనకు రాజూ ఎవరైనా వింటే మనది కల్తీ ప్రేమని అనుకుంటారు."

ఒకాయన కాఫీలో పంచదార తక్కువగా ఉందని, భార్యను తెమ్మన్నాడు. వెంటనే ఆవిడ "అవుటాఫ్ స్టాక్" అంది.
"అంటే అర్థం ఏమిటి నాన్నా" అని అడిగాడు కొడుకు.
"ఏదైనా లేదు అని చెప్పడానికి ఇలా అంటారు బాబూ" అన్నాడు తండ్రి.
ఓ రెండు రోజుల తర్వాత వారింటికి కొంతమంది వచ్చారు. వెంటనే ఆ కుర్రాడు "డాడీ అవుటాఫ్ స్టాక్" అన్నాడు




ఓ పత్రికా విలేకరి ఓ రాజకీయ నాయకునితో "మీరు మంత్రి కాబోతున్నారని మాకు న్యూస్ వచ్చింది. మీ అనుభూతిని చెప్తారా... రాసుకుంటాను" అన్నాడు.
దాంతో ఆ రాజకీయ నాయకుడు సంతోషం పట్టలేక ఇంటికి ఫోను చేసి "నీకు మంత్రిగారి భార్య అని అనిపించుకోవడం ఇష్టమేనా?" అని అడిగాడు.
"ఎంత మాటండి... అది నా అదృష్టంగా, మహద్భాగ్యంగా భావిస్తాను... ఇంతకీ ఏ మంత్రికి భార్యగానో కొంచెం చెప్తారా !?" అందా మహా ఇల్లాలు.



**ఈ జోకులను పంపినవారు : జి.బి.లక్ష్మి, హైదరాబాద్.**

"ఆ అమ్మాయి మడి మీదుండి అలా శృంగార పాటలు పాడుతుందేంటండీ" అంది శర్మగారి భార్య సిన్మా హాల్లో భర్తతో.
"అది మడీ గిడీ కాదే వెర్రివెంగళమా... రెయిన్ సాంగ్" చెప్పాడు శర్మగారు భార్యని ఎడ్యుకేట్ చేస్తూ.



పెళ్లి కాకుండా తల్లి అయిన తన కూతురితో ఓ తండ్రి బాధపడే సీన్ ఇది అని చెప్పి "మంచి కొటేషన్‌లా వుండాలి. డైలాగ్‌లో పంచ్ వుండాలి. టోటల్‌గా ఈ జనరేషన్‌కి తగ్గట్టుండాలి" అంటూ స్క్రిప్ట్ రాయమన్నాడో కమర్షియల్ రచయిత తన ఘోస్ట్ రచయితతో.



దానికా ఘోస్ట్ రైటర్ రాసిన డైలాగ్ యిది. "కంట్లో నలుసు ఉత్తే (ఊదితే) పోతుంది గాని కడుపులో నలుసు ఉత్తినే పోదమ్మా".

**ఈ జోకులను పంపినవారు : లకనం మూర్తి, కాకినాడ.**

"కోపం వస్తే శక్తి కొద్దీ తిట్టాలిగాని మొగుణ్ణి ఇలా గొడ్డుని బాదినట్టు బాదటం పాపం కాదా?" అంది పక్కింటి పుల్లమ్మ మొగుణ్ణి చితక్కొట్టేస్తున్న కాంతంతో బాధగా.
"ఆయన్ని పల్లెత్తు మాటకూడ అనినని మా అత్తగారు చావబోతున్నప్పుడు ప్రమాణం చెయ్యాల్సివచ్చిందండీ అందుకే ఈ ఉతుకుడు" అంది కాంతం పరమ శాంతంగా.





"ఏరా చారు గిన్నె తెమ్మంటే ఒట్టి గిన్నే తెచ్చావూ... ఇందులో చారు ఏది..." అడిగింది తల్లి కంగారుగా.
"నువ్వే కదమ్మా నీ మాట తు.చ. తప్పకుండా చేయాలన్నావు. అందుకే చారు పారపోసి, గిన్నె తెచ్చాను." అన్నాడా పుత్రరత్నం బహు వినయంగా.

**ఈ జోకులను పంపినవారు**
**అడ్డాల శ్రీనివాసరావు, విశాఖపట్నం.**

"మా కొత్త బ్రాంచి మేనేజరు శాఖాహారి"
"శాఖాహారి కాదు, శాకాహారి అనాలి"
"అది మాకూ తెలుసండీ... ఇతగాడు ఇదివరలో తను పనిచేసిన బ్రాంచినే తినేశాడట అందుకే శాఖాహారి అన్నాను".



**ఈ జోకును పంపినవారు**
**కె.వి.రమణ, జయపురం.**

హ్యూమర్ బాక్స్

"ఉదయానికి సాయంత్రానికి తేడా ఏమిటి?" అడిగాడు రాజేష్ తన కొలీగ్ కిరణ్‌ని.
"నిద్రలేచి ఆఫీస్‌కి వెళ్ళితే ఉదయం. వెలకువొచ్చి ఇంటికెళితే సాయంత్రం" వివరించాడు కిరణ్.





"ఆఫీసునుండి ఆలస్యంగా వస్తే ఛస్తానని మావార్ని తీవ్రంగా హెచ్చరించా" అంది ఉమ.
"జోక్‌గా తీసుకోలేదు కదా?" అడిగింది రమ ఆత్రంగా.
"లేదు... చాలా సీరియస్‌గా తీసుకున్నారు. 'మళ్ళీ ఆలస్యమైందే! ఇంటికి రావాలా? శ్మశానానికి రావాలా?' అని ఫోన్ చేశారు" అంది ఉమ దిగాలుగా.

**ఈ జోకులను పంపినవారు : బి. చంద్రశేఖరయ్య, రామసముద్రం.**

"ఏమయ్యా అప్పారావు... ప్రతిరోజూ ఆఫీసుకు ఉదయం లేట్‌గా వస్తున్నావు సాయంకాలం తొందరగా వెళ్ళిపోతున్నావు. ఏంటి సంగతి" అడిగాడు ఆఫీసర్ తీవ్రంగా.
"రెండుసార్లూ లేటయితే బాగుండదని" నసిగాడు అప్పారావు వినయంగా.



**ఈ జోకును పంపినవారు మామిడి శ్రీలత, పూణె.**

రెండేళ్ళ వయసు గల కొడుకునెత్తుకొని ఒకామె డాక్టరు దగ్గరకొచ్చింది.
"ముద్ద మాటలు పోవాలంటే ఎలా డాక్టర్?" అని అడిగింది.
"మీ బాబు వయసెంత?" అడిగాడు డాక్టర్.
"రెండేళ్ళు"
"ఇంకా చిన్న పిల్లాడేగా! వయసు పెరుగుతున్న కొద్దీ అవే పోతాయ్. తొందరపడి ఏ మందులూ వాడకండి" సలహా ఇచ్చాడు డాక్టర్.
"తొందరపడద్దంటే ఎలా? 30 ఏళ్ళొచ్చినా పోలేదు. ముద్దమాటలు మా వారికి, మా అబ్బాయికి కాదు" విసుక్కుంటూ వెళ్ళిపోయింది ఆ వచ్చినామె.



"నాన్నా ఇంత డబ్బు ఒక్కడివి ఎలా సంపాయించావ్?" అని అడిగాడు ఓ సుపుత్రుడు తన తండ్రిని.
"పన్నులు కట్టి కొంత, కట్టక కొంత" అంటూ తాపీగా సమాధానమిచ్చాడు దంతవైద్యుడైన ఆ తండ్రి.






ఇద్దరు స్నేహితులు హోటలులో టిఫిన్ తింటున్నారు-
ఒకడు : ఈ సర్వర్‌కి టిప్పుల మీద అస్సలు ఆశలేదు.
రెండోవాడు : అంత కచ్చితంగా ఎలా చెప్పగలవ్?
మొదటివాడు : వాడు ప్లేట్లు పెట్టే తీరు చూసి .. (మీద పడ్డ సాంబారు తుడుచుకుంటూ)

"ఏంటి మీరు ఈ మధ్య మా పత్రిక్కి కార్టూన్లు పంపడం లేదు" అడిగాడు ఎడిటర్ కార్టూనిస్టుని.
'కార్టూన్ కింద కార్టూనిస్టు ఇంటి అడ్రసు కూడా వేయడం మొదలు పెట్టారుగా'' గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు కార్టూనిస్టు.




**ఈ జోకులను పంపినవారు : రమణశాస్త్రి, సంగారెడ్డి.**




ఇండిపాప్ రంగంలో ఆడియోకంపెనీలు నెత్తిన పెట్టుకుని ఊరేగాలంటే గాయనీమణుల్లో కాస్త గ్లామర్ ఉండాలి. ఎర్రటి ఎరుపు, ఓ మోస్తరు ఎత్తు... కళగల మొఖం. వీటితో పాటుగా గొంతుకూడా బావుంటే అప్పుడు రికార్డింగ్ కంపెనీలు రెడ్ కార్పెట్ పరుస్తాయి. కానీ బొద్దుగా, చామనచాయగా, పొట్టిగా వుండే ఓ 'అనామిక' ఈ నిబంధనల్ని ఛేదించి- ఇండి పాప్ రంగంలో తనకంటూ ఓ స్థానాన్ని సుస్థిరం చేసుకుంది. తనలోని లోటుపాట్లను గుర్తించి, అధిగమించలేని వాటి గురించి మనసు పాడు చేసుకోకుండా - తనలోని ప్రతిభకు పదును పెట్టింది. ఆ ప్రతిభలోనే ఇవాళ రికార్డింగ్ కంపెనీలు ఆమె ఆల్బమ్ చేయడానికి పోటీ పడేలా కృషి చేసింది. ఆమె పేరు 'అనామిక' అయినా - ఆ గాత్రం వింటే ఇక మరువలేం... ఆమె పాటను వదలలేం... ఆమె ఓ పాటలో చెప్పినట్టుగా 'కహి కర్‌తా హోగా ఓ మేరా ఇంతజార్...' అని మనమూ ఆ ముగ్ధమనోహర గాత్రం కోసం ఎదురు చూస్తూ ఉండాల్సిందే!

చిన్నప్పుడే శాస్త్రీయ సంగీతాన్ని అభ్యసించిన అనామిక - ఆ తర్వాత న్యూయార్క్‌లో హోటల్ మేనేజ్‌మెంట్ కోర్సు పూర్తి చేసింది. అమెరికాలో వుండగానే ఆమెకి పాప్ సంగీతంలో పరిచయం ఏర్పడింది. అక్కడి స్థానికులతో 'యాంకీ' అనే బృందంగా ఆమె మ్యూజికల్ నైట్స్‌లో పాల్గొంది. ఆ అనుభవంతోనే భారతదేశానికి రాగానే ఢిల్లీలో 'ద టెంప్టేషన్స్' పేరుతో ఓ బృందాన్ని ఏర్పరచి సంగీత కార్యక్రమాన్ని నిర్వహించింది. వివిధ వేదికల మీద తన పాటలకి వస్తున్న అభినందనలతో అనామిక 1996 లో 'క్యాట్‌వాక్' పేరుతో తొలి ఆల్బమ్‌ని విడుదల చేసింది. చూడగానే ఆకట్టుకోలేని అనామిక అందం కారణంగా అప్పట్లో రికార్డింగ్ కంపెనీలు ఆమె గొంతును కూడా వినడానికి ఆసక్తి చూపలేదు... ఆ రోజుల్ని అనామిక తలుచుకుంటూ "నేనేమీ మోడల్‌ని కాదు... పెద్ద ఎత్తూ లేను... అందగత్తెనూ కాను... నా వెనుక ఏ గాడ్‌ఫాదర్ లేడు.... అలానే నా సంగీత దర్శకుడు ఎడ్విన్ ఎ.జె.ఫెర్నాండేజ్‌కీ పెద్దగా తెలిసినవాళ్ళు లేరు. అయినా మా మీద మాకున్న నమ్మకంతో సొంత డబ్బుతో పాటల్ని రికార్డింగ్ చేశాం. ప్రజలలోకి వాటిని పంపాలని చాలా తక్కువ రేటుకే



# అనామిక...

## ఓ సారి గొంతు వింటే మరవమిక!!

- "నేను ఐదు, ఆరు తరగతులు చదువుతున్నప్పటి నుండే పాడటం అలవాటైంది... ఇదంతా అత్యంత సహజంగా జరిగింది. నిజానికి నాకు ఇంగ్లీషు పాటలు పాడటం ఇష్టం. మెగ్నాసౌండ్ కంపెనీకి నేను ఇంగ్లీషు పాటలతోనే డెమో ఇచ్చాను. ఆ పాటల ఆల్బమ్ పేరు 'లెటజ్‌గెట్ ఫంకీ' అని అనుకున్నాం. కానీ అదింతవరకూ వెలుగు చూడలేదు. చివరకు 'క్యాట్‌వాక్'తో నేను శ్రోతలకి పరిచయమయ్యాను".
- "ఇప్పుడు నా పేరును 'అన్నామిక'గా మార్చుకున్నాను. ఆ మధ్య అమెరికా వెళ్ళివచ్చిన తర్వాత చేసిన మార్పు ఇది. నా అసలు పేరు 'అనామిక'ను చాలామంది పూర్తిగా పలకరు. కొందరు 'అన్నా' అని, మరికొందరు 'మికా' అని పిలుస్తుంటారు. అందుకనే వాళ్ళందరికీ పలకడానికి సులువుగా వుంటుందని 'అన్నామిక' గా మార్చేశాను... ఇప్పటికీ కొందరు పేరుతో కాకుండా 'క్యాట్‌వాక్ గర్ల్' అని పిలుస్తారనుకోండి. అది వేరే సంగతి."
- "నేను పాడే పాత పాటల గురంచి కొందరు విమర్శిస్తుంటారు. నా వాదన ఒక్కటే- మనకి పాత దుస్తులు బోర్ కొడితే- వాటిని వదిలి ఎలాగైతే కొత్తవి వాడతామో ఇదీ అంతే! నేను పాత పాటల్ని మళ్ళీ పాడినా - అందులోని ఆత్మని మాత్రం నిర్లక్ష్యం చేయటం లేదు. ఈ రకంగాను విజయాన్ని పొందవచ్చని ఆశాభోంస్లే మన కళ్ళముందే నిరూపించారు. అయినా నా పాటల్ని శ్రోతలు చక్కగా ఆదరిస్తున్నప్పుడు - నేను చేసే పని సరికాదు అని విమర్శకులు ఎలా అంటారు? భారతీయ సంగీతాన్ని నాదైన బాణీలో తప్పకుండా నేను ప్రమోట్ చేస్తాను."

అనామిక అనే ఇది...

విక్రయించాం" అని చెప్పింది. తొలి ఆల్బమ్‌లోనే అనామికకు 'క్యాట్‌వాక్ గర్ల్' అనే పేరు వచ్చేసింది.

'క్యాట్‌వాక్' ఆల్బమ్‌ను ప్రమోట్ చేయటం కోసం తీసిన వీడియోకు కేన్ ఘోష్ దర్శకత్వం వహించారు. ఆ ఆల్బమ్ విజయస్ఫూర్తితో అనామిక 1998లో తన పేరుతోనే మరో ఆల్బమ్ విడుదల చేసింది. అందులోని పాటలకు ఎనలేని ఖ్యాతి దక్కింది. ముఖ్యంగా 'కహి కర్‌తా హోగా ఓ మేరా ఇంతజార్', 'ఆజా ఆజా', 'కాలా- షా-కాలా' పాటలు బాగా పాపులర్ అయ్యి- ప్రతి ఇంటిలోనూ అనామిక గొంతు వినేలా చేశాయి. ఇందులో ఇంతజార్ పాట ముఖేష్ పాటకు రీ-మిక్స్. దీనిని అనామిక ఎంతో ఫన్నీగా పాడటమే కాదు- చిత్రీకరణ అలానే ఉండేలా జాగ్రత్త పడింది.

రెండో పాట 'ఆజా... ఆజా'ను లాస్ ఏంజెల్స్ లో చిత్రీకరించారు. దీనికి రాబర్ట్ కసర్ట్ దర్శకత్వం వహించాడు. పాపులర్ పాప్ స్టార్స్ ఆల్బమ్స్‌లో నటించిన వారే ఈ ఆల్బమ్‌లోనూ చేయటం ఓ విశేషం. దీనితో అనామిక ఆల్బమ్ అంతర్జాతీయ స్థాయిలో వుందంటూ పలువురు ప్రశంసించారు. అలానే పంజాబీ సంప్రదాయ గీతం 'కాలా-షా-కాలా'కీ మంచి గుర్తింపు వచ్చింది. రీమాలగూ, అలోక్‌నాథ్, నటి, మోడల్ కాశ్మీరా షా ఈ ఆల్బమ్‌లో నటించారు. పెళ్ళి నేపథ్యంలో వచ్చే పాట ఇది. 'అనామిక' ఆల్బమ్‌లోని ఎనిమిది పాటలలో ఐదు పాటలను ఆమె రాయటం ఓ విశేషం.

అందమైన గొంతేకాదు - ఆ గొంతుతో వేలాది మందిని మంత్రముగ్ధుల్ని చేయటం కూడా అనామిక చేతనౌను. స్వదేశంలోనే కాకుండా దుబాయ్, ఆస్ట్రేలియా, అమెరికా, మలేషియా, సింగపూర్, నేపాల్, కెనడా తదితర దేశాలలో అనామిక 500 పైగా స్టేజ్‌షోలు ఇచ్చింది. అంతేకాదు హీరోహోండా, బజాజ్, న్యూ హాలెండ్ ట్రాక్టర్స్ కంపెనీల కోసం రోడ్‌షోలను నిర్వహించింది. ఇంత బిజీ షెడ్యూల్ లోనూ ప్రతిరోజు గంటసేపు సంగీత సాధన చేస్తానని - ఏ మాత్రం అవకాశం లభించినా - కొత్త ప్రదేశాలు చూడటానికి, కొత్త స్నేహితులను పరిచయం చేసుకోవడానికి ఆ సమయాన్ని వెచ్చిస్తానని అనామిక అంటోంది.

'క్యాట్‌వాక్' ఆల్బమ్ టాప్‌టెన్ పట్టికలో స్థానం సంపాదించుకున్నా- దాని ప్రమోషన్ కోసం తీసిన విడియో వి ఛానల్, ఎంటీవిల్లో ప్రసారమయ్యే సరికి 10 నుండి 1 వస్థానానికి ఆ ఆల్బమ్ చేరింది. తొలి ఆల్బమ్‌నుండి అదే రకమైన స్పందనను అనామిక శ్రోతలనుండి పొందడం మరో విశేషం. ఆ తర్వాత విడుదలైన 'అనామిక', 'నైనా'లు అలానే బ్లాక్ బస్టర్స్‌గా నిలిచాయి. ఇటు స్టేజ్‌షోలు, ప్రైవేట్ ఆల్బమ్స్‌తో పాటుగా అనుమల్లిక్ సంగీతం సమకూర్చిన 'అవుజార్' చిత్రంలో 'దిల్ దే దేనా' అనే పాటనూ అనామిక పాడింది. అలాగే తొలి ఆల్బమ్‌తోనే 'ఛానల్ వి'లో బెస్ట్ ఆల్బమ్, బెస్ట్ ఫీమేల్ పాప్ సింగర్, బెస్ట్ వీడియో కేటగిరీలకు నామినేట్ అయ్యిందామె.

హోటల్ మేనేజ్‌మెంట్‌లో పట్టా పుచ్చుకున్న అనామిక పాప్‌తో పాటుగా హోటల్ బిజినెస్‌కి ప్రాధాన్యం ఇవ్వాలనుకుంటోంది. ఢిల్లీలో రెస్టారెంట్ ప్రారంభించాలన్నది ఆమె కోరిక, అలానే 'అమన్ కె పూజారి' పేరుతో కొత్త ఆల్బమ్ తెచ్చే ప్రయత్నంలో ఉంది.

**- వి. అరుణ సత్యవతి**

# ఘంటసాల క్విజ్

మొదటి బహుమతి : రూ. 250/-
రెండవ బహుమతి : రూ. 200/-
మూడవ బహుమతి : రూ. 150/-
} మరియు ఘంటసాల కలర్ ఫోటో

క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ
డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్‌నెం-11

1. ఘంటసాల సంగీతలో హాస్యనటుడు నల్లా రామ్మూర్తి పాడిన చిత్రం?
జ: ....................

2. ఘంటసాలతో నటి కన్నాంబ పాడిన యుగళ గీతం గల చిత్రం?
జ: ....................

3. ఘంటసాల సంగీతంలో ఆర్.బాలసరస్వతీదేవి పాడిన తొలి చిత్రం?
జ: ....................

4. ఘంటసాల, రఘునాథపాణిగ్రాహి, పి.బి.శ్రీనివాస్ కలిసి పాడిన పాట? ఆ పాట గల చిత్రం సంగీత ప్రధానమైనది?
జ: ....................

5. ఘంటసాల, కె.జమునారాణి కలిసి పాడిన తొలి చిత్రం?
జ: ....................

పంపినవారి పేరు : ____________________
చిరునామా : ____________________
____________________

## నిబంధనలు:

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 15-10-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**
'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.




# రాజా ఆడియో రివ్యూ

విడుదల : మయూరి
వెల : రూ 35/-

నందమూరి హరికృష్ణ గారబ్బాయి కళ్యాణ్‌రామ్‌ని హీరోగా పరిచయం చేస్తూ, తొలి ప్రయత్నంలోనే 'నువ్వులేక నేను లేను' వంటి హిట్‌నిచ్చిన కాశీవిశ్వనాథ్ దర్శకత్వంలో ప్రముఖ నిర్మాత శ్రీ రామోజీరావు ఉషాకిరణ్ పతాకంపై నిర్మించిన 'తొలిచూపులోనే' సినిమా ఆడియో విడుదలయింది. చక్రి ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

క్యాసెట్‌లో తొలిగీతంగా వచ్చే 'శుక్లాం బరధరమంటూ నే ప్రేమిస్తున్నా నిన్ను' పాట బండారు దానయ్య రాసినది. ఉదిత్ నారాయణ్, శ్రేయ గోషల్ పాడేరు. హిందోళ రాగం ఆధారంగా రూపొందిన ఈ పాట ట్యూన్‌ని చాలా క్యాచీగా మలిచాడు చక్రి. రెండవ పాటగా వచ్చే 'పగడాల పెదవి పైన తెలుగింటి మీగడల్లె' పాటను నూతన రచయిత చిన్ని చరణ్ రాయగా రాజేష్, హరిణి పాడేరు. పాట ట్యూన్ వింటుంటే 'అన్నమయ్య'లోని 'పదహారు కళలకు ప్రాణాలైన నా ప్రణయ దేవతలకు ఆవాహనం' పాట, ఇళయరాజా స్కూల్‌లోని కొన్ని పాటల నడక గుర్తొస్తుంది. వాటి నుంచి చక్రి కేవలం ఇన్‌స్పిరేషన్‌ని మాత్రమే తీసుకున్నాడనుకోవచ్చు. రచయితగా చిన్నికృష్ణ కలంలో మంచి పదునుంది. సాహిత్యాన్ని అందించటంలో పడిన విరామాలు తాళానికి తగ్గట్టుగా ఉన్నాయే తప్ప బలవంతంగా మలుపులు తిప్పినట్టు, రాజీ పడినట్టు లేవు. పెద్ద సంస్థలు కొన్నాళ్ళపాటు ప్రోత్సహిస్తే మంచి స్థానానికి చేరుకోగల లక్షణాలు కనిపిస్తున్నాయి ఈ రచయితలో.

'అమ్మో అమ్మాయి బాపు బొమ్మాయి మోగించేసెయ్‌నా డోలు సన్నాయి' పాట ట్యూన్, బీటు రెండూ మాస్ అప్పీలింగ్‌తో హుషారుగా వున్నాయి. ఉదిత్ నారాయణ్, శ్రేయగోషల్ కూడా ఆ లెవల్లోనే పాడేరు. సాహిత్య పరంగా చూస్తే భువనచంద్ర మసాలా కోసం ఘాటు ఎక్కువగా తగిలిస్తున్నారనిపిస్తుంది.

కందికొండ రాయగా శంకర్ మహదేవన్, కౌసల్య పాడిన 'సఖియా సఖియా సఖియా నీకై వేచే వున్నాలే' పాటను హిట్ సాంగ్ ఆఫ్ ది ఆడియోగా పోర్కొనాలి. చాలా మంచి ట్యూన్ ఇచ్చాడు చక్రి. భవిష్యత్తులో ఈ పాటని తన వన్ ఆఫ్ ది హిట్స్‌గా చెప్పుకోవచ్చు. కందికొండ కూడా పదిమందిలో హాయిగా పాడుకోదగ్గ సాహిత్యాన్ని అందించాడు. శంకర్ మహదేవన్... ఏ మ్యూజిక్ డైరెక్టర్‌కి పాడితే వాళ్ళు ఒరిజినల్‌గా పాడితే అలా పాడుతున్నట్టు అనిపిస్తుంది. అదే నిజమైతే బాగా గమనించండి... ఈ పాట చక్రి పాడితే ఎలా వుంటుందో అలా పాడేడాయన. కౌసల్య గురించి ప్రత్యేకంగా చెప్పేదేముంది...!?

నూతన రచయిత్రి సూర్యకుమారి రాయగా చక్రి, కౌసల్య పాడిన 'కన్నులు మూస్తే చాలు నువ్వే కల్లోకొస్తావు ఏమ్మాయ చేశావో మరి' పాటను కూడా హిట్ సాంగ్‌గా పేర్కొని తీరాలి. పాట ట్యూన్‌తో పాటు ఫ్లూట్‌తో ఇచ్చిన బిట్ కూడా హాంటింగ్‌గా జతపడందీ పాటకి. తెలుగు సినీ సంగీత చరిత్రలో పాటలు రాసే రచయిత్రుల సంఖ్య చాలా తక్కువ. నూతన రచయిత్రి రావటం ఆహ్వానించదగ్గ పరిణామం. కుటుంబ సమేతంగా వినే పాటలొస్తాయి. ఈ చిత్ర దర్శకుడు కాశీవిశ్వనాథ్‌కు ఈమె సోదరి.

భాస్కరభట్ల రవికుమార్ రాయగా శంకర్ మహదేవన్ పాడిన 'హెచ్చచ్చా ఎచ్చారచ్చా... మీ కోనం ముందే వచ్చా' పాట వినగానే తెలిసిపోతుంది హీరో ఇంట్రడక్షన్ సాంగ్ అని. ఇమేజ్ వున్న వంశం నుంచి వస్తున్న ఓ కొత్త హీరో పరిచయ గీతానికి ఎలా రాస్తే బావుంటుందో అలాగే రాశాడు భాస్కరభట్ల. ఈ సినిమా గనక హిట్ అయితే హీరో ఇంట్రడక్షన్ సాంగ్‌లకి భాస్కరభట్ల రచన ఓ సెంటిమెంట్ అయిపోయినా ఆశ్చర్యపడనవసరం లేదు. చక్రి ట్యూన్ కూడా అందుకు ఏ మాత్రం తీసిపోని స్థాయిలోనే వుంది. ■

**రచన: భాస్కరభట్ల రవికుమార్ (1) గానం: శంకర్ మహదేవన్**

ప: హేచ్చాచ్చా ఎచ్చా రెచ్చా ఎచ్చాచ్చా వచ్చా వచ్చా
మీ కోసం ముందే వచ్చా ఆవేశం నాతో తెచ్చా
ఎవరేమన్నా ఎదురేమున్నా విజయం అంటే నాదేలే
చెంగున దూకే చిరుతల వేగం నాలో వున్నదిలే
కష్టమైనా నష్టమైనా వెంట నేనే వుంటాలే
కోరుకుంటే ఎప్పుడైనా ఉప్పెనల్లే వస్తాలే
మీరంతా నాకు దేవుళ్ళోయ్... మీ అండే నాకు వుండాలోయ్...
ప్రేమిస్తే పచ్చ జెండాలోయ్ దీవిస్తే కోటి దండాలోయ్ ॥హేచ్చాచ్చా॥
చ: దానం ధర్మం చెయ్యాలంటే దాన కర్ణుడే రానక్కర్లే మెయ్యయ్యో చిల్లర తియ్యయ్యో
సత్యం నువ్వు చెప్పాలంటే హరిశ్చంద్రుడే కానక్కర్లే అయ్యయ్యో నువ్వే చాలయ్యో
అన్యాయాన్నాపాలంటే లా బుక్కే చదవాలా
ఉపకారం చేయాలంటే ఉపయోగము చూడాలా
ఇది మా థికింగ్... వుయ్ డూ సంథింగ్...ఎపుడూ విన్నింగ్‌లే
చెప్పింది చేసి చూపిస్తాం... అడ్డొస్తే దుమ్ము రేపేస్తాం
సై అంటే చెయ్యి కలిపేస్తాం... ముందుండి మేము నడిపిస్తాం ॥హేచ్చాచ్చా॥
చ: వెళ్లే దారే రైటనుకుంటే వెనక్కి తిరిగి చూడక్కర్లే వెళ్లయ్యో గెలుపే నీదయ్యో
చేసేదంతా మంచనుకుంటే అనుమతి కోసం ఆగక్కర్లే చెయ్యయ్యో చెయ్యే వెయ్యయ్యో
గుండెల్లో ధైర్యం వుంటే గునపాలే కావాలా
చేతల్లో శౌర్యం వుంటే సైన్యాన్నే తేవాలా
ఇది మా థియరీ... ఎవరేం అననీ... పద పద పదని...
కాలంతో పరుగే పెట్టేస్తాం... కాదంటే కాలాన్నాపేస్తాం
ఎవరెస్ట్ ఐనా ఎక్కేస్తాం... జై అంటూ జెండా పాతేస్తాం ॥హేచ్చాచ్చా॥

**రచన: బండారు దానయ్య (2) గానం: ఉదిత్ నారాయణ్, శ్రేయగోషల్**

ఆ: శుక్లాంబరధరం విష్ణుంశశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే సర్వవిఘ్నోపశాంతయే
అ: శుక్లాంబరధరమంటు నే ప్రేమిస్తున్నా నిన్ను ॥2॥
విష్ణుం శశివర్ణం చతుర్భుజం ఆ దేవుడు దీవించగా నన్ను
ప్రసన్న వదనం ధ్యాయే నా ప్రతి కదలికలో నీవే ॥2॥
సర్వ విఘ్నోప శాంతయే సఖి నా మనసు దోచినావే
దోచినావే... నను దోచినావే ॥శుక్లాం॥
అ: నిన్ను చేరగా తపస్సు నను కరుణించావే ఉషస్సు
నీ నవ్వుల వెలుగున నా మనసు పరవశమొందె ఈ వయసు
దీపావళిలా ఏకాదశిలా భోగి కనుమ హోలి రంగులా



రస సరసమీ ముద్దు ॥పగడాల॥
ఆ: మేలిమి బంగరు హారం మెడవంపు ముద్దు వన్నెల వడ్డాణమైంది నాభి పైన ముద్దు
అ: కలవరమును పెంచుతోంది కమ్మని ఎదముద్దు
అణువణువును అల్లుతోంది అసలు సిసలు ముద్దు
ఆ: కారం మమకారం కలబోసింది ముద్దు తీయగ తెరతీయమని ఎరవేస్తుంది ముద్దు
అ: చాటుకొరు ముద్దు సాంప్రదాయ ముద్దు
ఆ: కాటువేసె ముద్దు హద్దు చెరుపు ముద్దు
అ: చిరుగాలిలో పయనించె చిత్రమైన ముద్దు
ఆ: అడగకనే చుంబించే ఆత్రమైన ముద్దు
అ: మణికట్టు ముద్దు కనికట్టు ముద్దు
కసిరే కసి ముద్దు మురిసే పసిముద్దు ॥పగడాల॥

**రచన: భువనచంద్ర (6) గానం: ఉదిత్ నారాయణ్, శ్రేయగోషల్**

అ: హల్లో అమ్మాయి... బాపూ బొమ్మాయి మోగించేసెయ్‌నా డోలు సన్నాయి
ఆ: ఔనా అబ్బాయి చాల్లే బడాయి ఓకే అన్నాక గమ్మునొచ్చేయి
అ: పట్టుకోక ఇస్తా కట్టేసుకో
ఆ: కట్టుకొస్తా చెయ్యి పట్టేసుకో
అ: అదిరే లగ్గం ఉందే పిల్లా ఈనాడూ
ఆ: తెలిసే ముందుకొచ్చా కట్టేయ్ నా జోడూ
అ: గిజ గిజ లాడుతోందే భామా గిజిగాడు
ఆ: నలుగురు చూస్తేరంటే అమ్మో ఛీ పాడు ॥హల్లో॥
ఆ: వారే వీరుడా... కళ్యాణ రాముడా... కన్నె మనసుని గెలిచావుగా
అ: సైరే సుందరి జైపూరి జాంగిరి లాగించేసెయ్ నా లవ్ క్యాడ్ బరీ
ఆ: వస్తే ముచ్చటగా... మోజుపడే తుమ్మెదగా ఊరే తేనెలలో నిన్ను ముంచెయ్‌నా
అ: అరె వచ్చా వచ్చా వచ్చా వచ్చా ఒంటరి పువ్వమ్మో
జర గిల్లో గిచ్చో మురిపించేయ్‌వే మిఠాయి బొమ్మో
ఆ: సరసకు చేరి దోచెయ్ గుప్పెడు అందం గువ్వల చెన్నా
తరగని మోహం... దాహం... చంపుతువున్నా కిమ్మనకున్నా ॥హల్లో॥
అ: పొంగే సొగసుతో కృంగింది నడుమూ ఇంతా ఎందుకే ఆ బిడియమూ
ఆ: కొంగే చాలని బంగారు బరువుని మోస్తే తెలియునోయ్ ఆ వివరమూ
అ: దాస్తే దాగదనీ సొగదనీ తెలిసి కూడా అన్నీ దాయటము తప్పుకదమ్మా
ఆ: అది నీకే నీకే నీకే ఇస్తారావయ్యో అరె ఇచ్చేసాక గిచ్చావంటే నేనేం చెయనయ్యో
అ: బెదిరితే పోలీ నారీ ముచ్చట ఎట్టా తీరేనమ్మా
సరిగమలాడీ... పాడీ... సందడి చేద్దాం రావే గుమ్మా.... ॥హల్లో॥
అ: అందాతా ఆగలేనే చెలియా ఇటు చూడు
ఆ: కోరిన కానుకిస్తా గురువా మనువాడు



**రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (1) గానం: యమ్.యమ్.కీరవాణి**

ప: వెళ్లిపోతే ఎలా... మనసా ఎటో అలా... ఐనా...
ఎందుకని ఇలా... తడబాటు అంతలా...
తెగ హుషారుగా ఎగిరిపోతే...
తగని ఊహవెంట...
సరైన దారి తెలియందే...
ఈ ఉరుకులెందుకంటా...
వెళ్లిపోతే ఎలా... వెళ్లిపోతే ఎలా...
చ: ఆమె వలలో చిక్కుకుందా... సమయం
ప్రేమలయలో దూకుతోందా... హృదయం
నేనిప్పుడెక్కడున్నానంటే...
నా కూడా అంతు చిక్కకుంటే...
గమ్మత్తుగానే వున్నదంటే... నాకేదో మత్తు కమ్మినట్టే...
రమ్మంది గాలి నను చేరి...
మెరుపు సైగ చేసి...
చెప్పింది నింగి చెలి దారి...
చినుకు వంతెనేసి....
వెళ్లనంటే ఎలా... మనసా అటే... అలా... వెళ్లనంటే ఎలా...
చ: తాను కూడ రాకపోతే... నాతో నేను కూడా ఆగిపోనా... తనతో!
నా ప్రాణం ఉంది తనవెంటే నా ఊపిరుంది తననంటే...
కళ్లారా చూశానంటూ వుంటే...
ఎల్లా నమ్మేది స్పష్టమంటే...
వెనక్కి వెళ్లి వెతకాలి... తిరిగి ఆ క్షణాన్ని...
మరొక్కసారి చూడాలి... కనులు ఆ నిజాన్ని
వెళ్లనంటే ఎలా... మనసా అటే... అలా... వెళ్లనంటే ఎలా...

**రచన: చంద్రబోస్ (2) గానం: కార్తీక్, గంగ**

ప: నాదిరిదీనా... నాదిరిదీనా... నాదిరిదీనా...
నచ్చినదాని కోసం నా తపన
నాదిరిదీనా... నాదిరిదీనా... నాదిరిదీనా...
విచ్చిన పూల సందేశం వినినా...
సీతాకోక చిలుక.... రెక్కల్లోన ఒలికే...
వర్ణాలన్ని చిలికి... హోళి ఆడనా... ॥నాదిరి॥
చ: చిగురే పెదవై... చినుకే మధువై
ప్రతిలతలో ప్రతిబింబించే



**రచన: చంద్రబోస్ (6) గానం: ఎస్.పి.బాలు**

ప: ఎక్కడున్నావమ్మా... ఓ ప్రియతమా
ఏది అనుకోనమ్మా... నీ చిరునామా
దేశం కాని దేశంలో... సాగరం లాంటి నగరంలో
ఎప్పుడు ఎదురొస్తావో... నా ఎదపై ఎప్పుడు నిదురిస్తావో
సుబ్బలక్ష్మి - ఎల్లూరు, సుబ్బలక్ష్మి - పిచ్చుక, సుబ్బలక్ష్మి - సుంకర,
సుబ్బలక్ష్మి - కూచిపూడి, సుబ్బలక్ష్మి - గురజాడ, సుబ్బలక్ష్మి - చెరుకూరి,
సుబ్బలక్ష్మి - దగ్గుబాటి, సుబ్బలక్ష్మి - పోసాని, సుబ్బలక్ష్మి - బెల్లంకొండ,
సుబ్బలక్ష్మి - సానా, సుబ్బలక్ష్మి - కోడూరి ॥ఎక్కడు॥
చ: అసలు పేరు ఒకటే తెలుసు... కొసరు పేరు ఏదిటో
మేనిఛాయ ఒకటే తెలుసు... వున్నచోటు ఏదిటో
రూపురేఖలొకటే తెలుసు... ఊరువాడ ఏమిటో
మాటమధురిమొకటే తెలుసు... ఫోను నంబరేమిటో
అక్కడి చిలకను అడిగితే...
నువు సప్త సముద్రాలవతల వుంటున్నావని చెప్పిందే
మరి ఇక్కడకొచ్చి వాలితే...
ఏ ఇంగ్లీష్ చిలకా నీ ఆచూకీ తెలుపగ లేకుందే
ఎవరిని అడగాలి... ఎలా నిను చేరాలి
సుబ్బలక్ష్మి - మాగుంట,
సుబ్బలక్ష్మి - దాసరి, సుబ్బలక్ష్మి - వాసిరెడ్డి, సుబ్బలక్ష్మి - మేడికొండ,
సుబ్బలక్ష్మి - గోరంట్ల, సుబ్బలక్ష్మి - వెల్లంకి,సుబ్బలక్ష్మి -, పగడాల,
సుబ్బలక్ష్మి - కొమ్మూరి, సుబ్బలక్ష్మి - మరుధూరి, సుబ్బలక్ష్మి - కోనా,
సుబ్బలక్ష్మి - నండూరి ॥ఎక్కడు॥
చ: ఫస్ట్ టైము డయల్ చేయగా... అష్టలక్ష్మి పలికెరా....
రెండోసారి రింగ్ చేయగా... రాజ్యలక్ష్మి దొరికెరా...
మరోమారు ట్రయల్ వేయగా... మహాలక్ష్మి నవ్వెరా...
సుబ్బలక్ష్మి మాట ఎత్తగా... సుబ్బాయమ్మ తిట్టెరా...
ఎదురు దెబ్బలే తగిలినా... నే పట్టువదలని విక్రమార్కుడికి మాస్టర్‌నౌతానే
కలమబ్బలెన్ని నను కమ్మినా... నా నెచ్చెలి నింగికి నిచ్చెనవేసి చేరువౌతాలే
నమ్మకముందమ్మా... నిను కలుపును నా ప్రేమ...
సుబ్బలక్ష్మి - భోగవల్లి, సుబ్బలక్ష్మి - అక్కినేని,
సుబ్బలక్ష్మి - నెక్కంటి, సుబ్బలక్ష్మి - ఆకుల, సుబ్బలక్ష్మి - గోగినేని,
సుబ్బలక్ష్మి - మిద్దే, సుబ్బలక్ష్మి - బొమ్మకంటి, సుబ్బలక్ష్మి - తనికెళ్ళ,
సుబ్బలక్ష్మి - బోయిన, సుబ్బలక్ష్మి - కట్టా, సుబ్బలక్ష్మి - కైకాలా ॥ఎక్కడు॥

**రచన : సూర్యకుమారి** (4) **గానం : చక్రి, కౌసల్య**

అ: కన్నులు మూస్తే చాలు నువ్వే కల్లోకొస్తావు ఏమ్మాయ చేసావో మరీ ॥2॥
వెన్నెల చూస్తే చాలు నువ్వే గుర్తొస్తున్నావు ఏమ్మత్తు జల్లావో మరీ
నిన్ను చూస్తే ఆగదు మనసూ క్షణమైనా యుగమని తెలుసూ ॥2॥
నువ్వు పక్కన వుంటే పగలూ రేయీ ఒక్కటే నాకూ ॥కన్నులు॥
అ: ఉరికే గోదావరి నదిలా మనసే ఉప్పొంగుతు వుందిపరువం ప్రాయం నాదేనని
ఎగిరే ఆ గువ్వను చూస్తే మనసే రివ్వంటూ వుంది
నీతో కలిసి వుండాలని చేరలేకా వేరే దారిలేకా ఆగలేకా... ఆశను దాచలేకా
ఉవ్వెత్తున కెరటంలా నిన్ను చేరుకోవాలనీ ఊహల్లో నీతో కలిసి ఊసులాడుకోవాలనీ
మనసేమో నీకోసం వెతుకుతూ వున్నది
వేయికళ్లతో నీకై తానే ఎదురు చూస్తున్నది ॥కన్నులు॥
ఆ: వచ్చే మరు జన్మ కూడా నువ్వే నా ప్రియుడై పుడితే నన్నే నువ్వు చేరాలని
గుడిలో ఆ దేవత కూడా మనసారా దీవించింది నువ్వూ నేనూ ఒకటవ్వాలని
చెప్పలేకా మనసే విప్పలేకా సిగ్గుతోటి బుగ్గలు కందిపోగా
ఆ స్పందన నాలో ఏదో ఆనందం కలిగిస్తుంటే
ఆరాధన నా కన్నులలో హారతిగా వెలుగుతువుంటే
నీ కోసం నా హృదయం కలవరిస్తున్నది
కోటి కళ్లతో ఎన్నో తియ్యని కలలు కంటున్నది ॥కన్నులు॥

**రచన: చిన్ని చరణ్** (5) **గానం : రాజేష్, హరిణి**

అ: పగడాల పెదవిపైన తెలుగింటి మీగడల్లె తేనెల్ని చిలుకును తొలిముద్దు
మకరందాన్ని పీల్చును మలిముద్దు
ఆ: జగడాలు మాని జంట జతచేరి వలపు పంట పండించు ప్రథమ ఎరువు ముద్దు
అనుబంధాల కల్పతరువు ముద్దు
అ: చిగురించు వసంతం ప్రణయాన చిలిపి ముద్దు
ఆ: కరిగించును పంతం కౌగిలిలో కొసరు ముద్దు
అ: వెన్నెలనద్దు చల్లని ముద్దు తడియారని ముద్దు బిడియాలిక వద్దు...॥పగడాల॥
అ: కనురెప్పలపై ముద్దు కవ్వించు ముద్దు నడుమును తడిమే ముద్దు నవ్వించు ముద్దు
ఆ: నుదుటన చేరే ముద్దు దీవించు ముద్దు పెదవిని తాకే ముద్దు ప్రేమించుముద్దు
అ: తెలి మంచు వేళలో వెలుగులనేదిద్దూ తెలవారుఝాములో మదికోరుముద్దూ
ఆ: చెవిని కొరుకు ముద్దు చెలిమి కోరు ముద్దు
అ: చెంప పైన ముద్దు చేరువైన ముద్దు
ఆ: భేదాలను తరమదా పాదాలు తాకు ముద్దు
అ: వేదాలను పలకదా వేళంటూ లేని ముద్దు
ఆ: తుంటరి ముద్దు తూరుపు పొద్దు నవరసముల ముద్దు



పండుగలన్నీ పల్లకి ఎక్కి నీ రూపంలో నన్ను చేరగా... ॥2॥
నాకు కాదు పుట్టినరోజు
ప్రేమా... నాకై నువు పుట్టినరోజు... పున్నమిరోజు ॥శుక్లాం॥
ఆ: నీలో ప్రేమకై తరించా నిను మనసా వాచా వరించా
స్వయం వరంలో ఆ శివ ధనస్సు... నువు గెలిచిన ఈ నా మనసు
దేవుడు నీవై దాసిని నేనై చెలుడి చేతి ప్రణయవీణనై
గుండెలనిండా ప్రేమలు నిండా నీ కన్నుల్లో కాంతి రేఖనై ॥2॥
నీ కౌగిలి చెరలో చెలిగా సఖుడా కరగటమే ఇక నా పనిగా ప్రియ భావనగా
శుక్లాంబరధరమంటు నే ప్రేమిస్తున్నా నిన్ను ॥2॥
విష్ణుం శశివర్ణం చతుర్భుజం ఆ దేవుడు దీవించగా నన్ను...
ప్రసన్న వదనం ధ్యాయే నా ప్రతి కదలికలో నీవే...
సర్వ విఘ్నోప శాంతయే సఖి నా మనసు దోచినావులే...
ప్రేమ నీవులే చిరునామ నీవులే ॥శుక్లాం॥

**రచన : కందికొండ** (3) **గానం : శంకర్ మహదేవన్, కౌసల్య**

అ: సఖియా సఖియా సఖియా సఖియా.. నీకై వేచే వున్నాలే
సఖియా సఖియా సఖియా సఖియా.. ఎన్నో కలలే కన్నాలే
ఆ: ఈ బంధం ఏనాటిదో అనుబంధం వేసిందిలే
నా హృదయం ఈనాటితో నీ వశమై పోయిందిలే
అ: నా సర్వం... నువ్వే... నువ్వే.... నువ్వే... ॥సఖియా॥
అ: నువ్వు మేఘమే అయినా నీలోన చినుకునై లేనా
నువ్వే ఊపిరనుకున్నా నా ప్రియనేస్తమా...
ఆ: కలత నిదురలో మొన్నా కనురెప్ప చాటులో నున్నా
నిన్ను నేను కనుగొన్నా నా ఎద గీతమా...
అ: ఆకాశమా... అనురాగమా...
ఆ: మంచు పల్లకిలో రానా మరుమల్లె మాలకలు తేనా
మనసు కోవెలకు రానా నీ వలపు దీపికను కానా
అ: నీ ప్రేమ చిరుజల్లు తడిపిందిలా.... ॥సఖియా॥
అ: నిన్ను చేరవస్తున్నా శతకోటి ఊహలలో వున్నా...
నీతో చెప్పలేకున్నా నా ప్రియ భావమా...
ఆ: నువ్వు గగనమే అయినా నే చందమామనై రానా నీడలాగా వస్తున్నా నీ ఎద చేరగా
అ: సంగీతమా.... నా ప్రాణమా...
ఆ: తేనె జల్లునై పోనా నీపైకి వెల్లువై రానా
ప్రణయ సింధువే కానా నీలోకి బంధువై రానా
అ: మనసంతా నిండావే మధుమాసమా ॥సఖియా॥



ఆ: చూడు
అ: నిను చూసినకొద్దీ చూడందేదో చూడాలంటూ బతిమాలుతుంది వయసు
ఆ: చెప్పు
అ: అని పలికినకొద్దీ చెప్పందేదో చెప్పాలంటూ చెలరేగుతుంది మనసు
ఆ: నా పసిడి ప్రాయాలు ఒంపినా
అ: నా పట్టపగ్గాలు తెంపినా
ఆ: నువ్వో సగమై నేనో సగమై యిద్దరమొకటై వుండాలంటే
ఏం చేయాలి... ఏం చేయాలి... ఏం చేయాలి... ॥ఘాటు॥
అ: ముద్దు
ఆ: నువు పెట్టినకొద్దీ దాహం పెరిగి దావానలమై ననుకాల్చుతుంది ఒట్టు...
అ: పట్టు
ఆ: నువు పట్టినకొద్దీ మత్తుగ నాలో కమ్మినమైకం ఎక్కింది ఆఖరిమెట్టు
అ: కౌగిళ్ల లోగిళ్లు చేరినా
ఆ: సరసాల శిఖరాలు తాకినా
అ: నువ్వే నేనై నేనేనువ్వై నువ్వు - నేను వుండాలంటే
ఏం చేయాలి... ఏం చేయాలి... ఏం చేయాలి... ॥ఘాటు॥

**రచన : చంద్రబోస్** (5) **గానం: శ్రేయగోషల్**

ప: నువ్వే.... నా శ్వాస మనసున నీకై... అభిలాష
బ్రతుకైన నీతోనే... చితికైన నీతోనే
వెతికేది నేనిన్నేనని.... చెప్పాలని చిన్ని ఆశ
ఓ ప్రియతమా.... ఓ ప్రియతమా.... ॥నువ్వే॥
చ: పూవుల్లో పరిమళాన్ని... పరిచయమే చేశావు
తారల్లో మెరుపులన్ని... దోసిలిలో నింపావు
మబ్బుల్లో చినుకులన్ని... మనసులోన కురిపించావు
నవ్వుల్లో నవలోకాన్ని... నా ముందే నిలిపినావుగా
నీ జ్ఞాపకాలన్నీ... ఏ జన్మలోనైనా
నే మరువలేనని నీతో చెప్పాలని చిన్ని ఆశ
ఓ ప్రియతమా... ఓ ప్రియతమా... ॥నువ్వే॥
చ: సూర్యునితో పంపుతున్నా.. అనురాగపు కిరణాన్ని
గాలులతో పంపుతున్నా... ఆరాధన రాగాన్ని
ఏరులతో పంపుతున్నా... ఆరాటపు ప్రవాహాన్ని
దారులతో పంపేస్తున్నా అలుపెరుగని హృదయ లయలని
ఏ చోటనుంటున్నా... నీ కొరకు చూస్తున్నా
నా ప్రేమ సందేశం విని.... వస్తావని చిన్ని ఆశ
ఓ ప్రియతమా... ఓ ప్రియతమా... ॥నువ్వే॥



నదులే నడకై... అలలే పలుకై
ప్రతి దిశలో ప్రతి ధ్వనియించే
ఎవరికలో... యీ లలన ఏ కవిదో... యీ రచన ॥నాదిరి॥
చ: కురిసే జడిలో... ముసిరే చలిలో
ప్రతి అణువు కవితలు పాడే
కలిసే శృతిలో... నిలిచే స్మృతిలో
ప్రతి క్షణము శాశ్వతమాయే
యీ వెలుగే.... నీ వలన
నీ చెలిమే... నిజమనినా ॥నాదిరి॥

**రచన: చంద్రబోస్** (3) **గానం: యమ్.యమ్.కీరవాణి, గంగ**

ప: అల్లో నేరేళ్లో... అల్లోనేరేళ్లో (2)
జనకుని కూతురు జానకి... అల్లోనేరేళ్లో
జాజుల సోదరి జానకి.... అల్లోనేరేళ్లో
మిథిలా నగరిని జానకి... అల్లోనేరేళ్లో
ముద్దుగా పెరిగిన జానకి..... అల్లో నేరేళ్లో
అందాల రాముని పరిణయమాడి...
అయ్యోధ్య చేరును జానకి.... అల్లోనేరేళ్లో ॥అల్లో॥
చ: ఏటిపాయల పాపిటకి... కుంకుమబొట్టే ఆభరణం
ఎదురు చూపుల కన్నులకి.... కాటుక రేఖే ఆభరణం
పుడమి నంటని పదములకి... పసుపు వన్నెలే ఆభరణం
పెదవి దాటని మాటలకి... మౌనరాగమే ఆభరణం
మగువ మనసుకు ఎనాడో... మనసైనవాడే ఆభరణం ॥అందాల రాముని॥
చ: చేయిజారిన చందమామని... అందుకోగలనా
రాయలేని నా ప్రేమలేఖని... అందజేయగలనా
దూరమైన నా ప్రాణజ్యోతిని... చేరుకోగలనా
చేరువయి నా మనోవేదన.... మనవిచేయగలనా
నా ప్రేమతో... తన ప్రేమని... గెలుచుకోగలనా.... ॥అందాల రాముని॥

**రచన: చంద్రబోస్** (4) **గానం : టిప్పు, నిత్యసంతోషిణి**

ప: ఘాటు ఘాటు ప్రేమ - ఘాటు ఘాటు ప్రేమ నీకు నాకు నడుమ యీ ఘాటు చాలదమ్మా
నీకు నాకు నడుమ - యీ దూరమేమిటమ్మా
చేరాముగా - ఒకే దరి
ఈ చేరువా - సరిపోదేమరి
నాలో నువ్వై - నీలో నేనై - యింకా యింకా వుండాలంటే
ఏం చేయాలి... ఏం చేయాలి... ఏం చేయాలి.... ॥ఘాటు॥

## తారాగణం

కళ్యాణ్‌రామ్, ఆకాంక్ష, సుమన్, ఊర్వశి శారద, బ్రహ్మానందం, చరణ్‌రాజ్, ఎం.ఎస్.నారాయణ, ఎల్బీ శ్రీరామ్, సునీల్, వేణుమాధవ్, 'అల్లరి' రవిబాబు, రఘుబాబు, ఆహుతి ప్రసాద్, కల్పన, సుదీప, తెలంగాణ శకుంతల, మాస్టర్ ఆనంద్ వర్ధన్, మాస్టర్ స్వప్నిల్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : పరుచూరి బ్రదర్స్ |
| డ్యాన్స్ | : లారెన్స్, రాజు సుందరం, సుచిత్ర చంద్రబోస్, అశోక్‌రాజ్ |
| ఫైట్స్ | : కణల్‌కణ్ణన్, |
| ఆర్ట్ | : నారాయణరెడ్డి |
| ఎడిటింగ్ | : మార్తాండ్ కె.వెంకటేష్ |
| విజువల్ ఎఫెక్ట్స్ | : మంత్ర (రామోజీ ఫిల్మ్‌సిటి) |
| పి.ఆర్.ఓ. | : ఎల్.వేణుగోపాల్ |
| పబ్లిసిటీ | : కృష్ణ డిజిటల్స్ |
| కో-డైరెక్టర్ | : రామినేని నేతాజీ |
| డైరెక్షన్ టీం | : వోలేటి శ్రీనివాస్, సన్ని నాగబాబు, బి.ఆర్.శ్రీనివాస్, ఎస్.బాలాజీ |
| కెమెరా | : శేఖర్ వి.జోసఫ్ |
| సంగీతం | : చక్రి |
| నిర్మాత | : రామోజీరావు |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : వై.కాశీ విశ్వనాథ్ |

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

ఉషాకిరణ్ మూవీస్

# తొలి చూపులోనే...

రామోజీరావు వై.కాశీవిశ్వనాథ్ చక్రి


వై.కాశీవిశ్వనాథ్


రామోజీరావు


చక్రి


భువనచంద్ర


కందికొండ


భాస్కరభట్ల రవికుమార్



## తారాగణం

శ్రీరామ్, ఆర్తి ఛాబ్రియ, మానవ్, భరణి, బాలయ్య, దేవన్, రాధకుమార్, హేమ, విజయ్, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, గౌతమ్‌రాజు, జూనియర్ రేలంగి, దువ్వారి మోహన్, ధీరజ్, సుబ్బరాజు, రతి, జాహ్నవి (యాంకర్), ఆషా

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| స్టోరీ & డైలాగ్స్ | : కోన |
| లిరిక్స్ | : సిరివెన్నెల సీతారామశాస్త్రి, చంద్రబోస్ |
| ఆర్ట్ డైరెక్టర్ | : నారాయణరెడ్డి |
| ఎఫెక్ట్స్ కో- ఆర్డినేటర్ | : యుగంధర్ |
| ఎడిటర్ | : శంకర్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : ప్రసాద్ |
| మేనేజర్స్ | : ఖాన్, ఆంజనేయులు, రవి, శ్రీను |
| మేకప్ | : భాస్కర్ |
| కాస్ట్యూమ్స్ | : కృష్ణ |
| పి.ఆర్.ఓ. | : ఎల్.వేణుగోపాల్ |
| పబ్లిసిటి | : కృష్ణ డిజిటల్స్ |
| కో- డైరెక్టర్ | : వి.వి.సూర్యకుమార్ |
| డైరెక్షన్ టీమ్ | : రవి కాంత్, రాధాకృష్ణ, శాంతిశ్రీ, ప్రణీత |
| సినిమాటోగ్రఫీ | : సెంథిల్ |
| సంగీతం | : ఎమ్.ఎమ్.కీరవాణి |
| ప్రొడ్యూసర్ | : పి.కిరణ్ |
| కథ, స్క్రీన్‌ప్లే - దర్శకత్వం | : రసూల్ ఎల్లోర్ |

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

ఆనంది ఆర్ట్ క్రియేషన్స్

# ఒకరికి ఒకరు

EK DUUJE KE LIYE

కిరణ్ రసూల్ ఎల్లోర్ యమ్.యమ్. కీరవాణి


పి.కిరణ్


రసూల్ ఎల్లోర్


ఎమ్.ఎమ్.కీరవాణి


సిరివెన్నెల


చంద్రబోస్



# మనిషికి శ్వాస ఎంత అవసరమో - కళాకారుడికి విజయం అంత అవసరం

**- 'గజల్' శ్రీనివాస్**

తెలుగువాడు తెలుగు పాటను పాడటం గగనంగా వున్న ఈ రోజుల్లో పారసీక దేశంలో ఉద్భవించి ఉర్దూ మీదుగా, హిందీ, గుజరాతీ భాషల నుండి తెలుగులోకి వచ్చిన గజల్‌ను ఓ వ్యక్తి 16 సంవత్సరాలుగా పాడటం విశేషమనే చెప్పాలి. ఆ వ్యక్తి పేరు 'కేశిరాజు శ్రీనివాస్'. అయితే 'గజల్' శ్రీనివాస్ అంటే ఇవాళ ఎవరైనా అతన్ని ఇట్టే గుర్తు పడతారు. "నా పద్దెనిమిదేళ్ళ వయసు నుండి గజల్స్‌ను పాడటం ప్రారంభించాను. నా తర్వాత కొందరు ఇవి పాడటం ప్రారంభించినా పట్టు దొరక్క - పాడటం మానేశారు. ఇవాళ 'గజల్' నా ఇంటి పేరుగా మారడానికి 16 సంవత్సరాల సాధన వుంది" అంటారాయన.

1986లో శ్రీనివాన్ గజల్స్ పాడటం ప్రారంభించినప్పుడు 'తెలుగులో గజల్స్ ఏమిటీ' అని నవ్విన వారు వున్నారు. అయితే కోటి మందిలో ఒకడిగా ఉండాలనే కోరికే - తనను ఆ రంగం నుండి పక్కకు తప్పించకుండా కొనసాగేట్టు చేసిందని శ్రీనివాస్ చెప్పారు. "నలుగురిలో ఒకడిగా ఉండటం చిన్నప్పటి నుండీ నాకు ఇష్టం లేదు. చిన్నతనంలోనే స్టేజ్ మీద పాటలు పాడి బహుమతులు పొందాను. అలానే మా స్వగ్రామం పాలకొల్లులో అనేక నాటకాలూ వేశాను. అయితే ఈ రంగాలలో అప్పటికే పేరు ప్రఖ్యాతులు గడించినవాళ్ళు చాలామంది వున్నారు. నాకంటూ ప్రత్యేక గుర్తింపు రావాలంటే ఎవరూ నడవని దారిలో అడుగువేయాలి. అందుకని గజల్స్‌ను ఎంచుకున్నాను. మొదట్లో హార్మోనియం, సరోద్, తబలాల్తో పాడాను. కానీ ప్రేక్షకుల్ని మెప్పించలేకపోయా - ఆ సమయంలో కంజీరాను చేతిలోకి తీసుకుని నాదైన శైలిలో గజల్‌ని గానం చేయటం మొదలెట్టాను. 1992లో మొదటిసారి సి.నారాయణరెడ్డిగారు విని నన్ను అభినందిస్తూ 'శ్రీనివాస్ ఈజ్ ఎ ట్రెండ్ సెట్టర్' అని అన్నారు. అంతేకాదు నా స్టయిల్‌కి తగ్గట్టుగా గజల్స్ రాయటం మొదలుపెట్టారు. తెలుగుదేశంలో గజల్స్‌కి ఒక్క శ్రోత కూడా అప్పట్లో లేరు - ఇవాళ నాకంటూ కొందర్ని పొందగలిగాను. గజల్‌ని కంఠస్థం కాదు - హృదయస్థం చేసి పాడతాను కాబట్టే ఇంతమంది అభి మానాన్ని పొందాను. మనిషికి శ్వాస ఎంత అవసరమో - కళాకారుడికి విజయం కూడా అంతే అవసరం. అయితే గజల్ అనేది పాడేవాళ్ళు వినేవాళ్ళ మధ్య సమన్వయం ఉంటేనే రాణిస్తుంది. నిజానికి గజల్ పాడటం కంటే వినటం గొప్ప కళ" అని అన్నారు.

50 దేశాలలో 5 వేలకు పైగా ప్రదర్శనల్ని ఇచ్చిన శ్రీనివాస్ ఇప్పుడు తన దృష్టిని జైళ్ళ మీద పెట్టారు. మన రాష్ట్రంలోని దాదాపు 9 జైళ్ళలో ఆయన గజల్స్ కార్యక్రమం నిర్వహించారు.

"దాదాపు రెండేళ్ళ క్రితం ఓసారి రైల్లో ప్రయాణిస్తుంటే - ఓ ప్రయాణికుడు నన్ను పలకరించాడు. అభిమాని అని చెప్పాడు. కడపలో ఇంజనీరింగ్ చదివిన ఆ యువకుడు ఓ హత్యానేరంపై 3 సం॥రాలు జైలులో వుండివచ్చాడని తెలిసింది. ముఠా కక్షల నేపథ్యంలో చేయని నేరానికి తమ కుటుంబం జైలు పాలైందని చెప్పాడు. మీలాంటివారు జైళ్ళలో పాడితే బాగుంటుంది - **ఆకలి మనిషికి ఎంత అవసరమో ఓదార్పూ అంతే అవసరం - ఆ ఓదార్పు లేక మేం జైల్లో ఎంతో మానసిక వేదన అనుభవించాం**' అని ఆ వ్యక్తి చెప్పాడు.

ఆ తర్వాత నేను జైళ్ళకి సంబంధించిన అనే పుస్తకాలు చదివాను. కరుడుగట్టిన నేరస్థులే జైళ్ళలో వుంటారనుకోవటం తప్పు. చేయని నేరానికి శిక్ష అనుభవించే వాళ్ళు కూడా అక్కడ వున్నారు. ఏ మనిషీ పుట్టుకతో నేరస్థుడు కాదు. క్షణికావేశంలో చేసిన పనికి కఠిన శిక్ష

## తొలి తెలుగు గజల్ ఆల్బమ్ 'నేను - నా ఇల్లు'

'గజల్' శ్రీనివాస్‌గా పేరు సంపాదించుకున్నా ఇంతవరకూ గజల్ ఆల్బమ్‌ను ఆయన విడుదల చేయనేలేదు. అయితే తాజాగా తొలిసారి తెలుగులో ఎనిమిది గజళ్ళతో స్వీయ సంగీత దర్శకత్వంలో 'నేను - నా ఇల్లు' ఆల్బమ్‌ను రూపొందించారాయన. ఇటీవలే ఈ ఆల్బమ్ సి.డి.ని హైదరాబాద్‌లో బిజెపి జాతీయ అధ్యక్షులు ఎం.వెంకయ్యానాయుడు ఆవిష్కరించగా, ఆడియో క్యాసెట్‌ను నటుడు మోహన్‌బాబు ఆవిష్కరించారు. సినారె, కె.ఇ.ప్రభాకర్, జస్టిస్ చలమేశ్వర్, యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, దగ్గుబాటి వెంకటేశ్వరరావు, ల్యాంకో రాజగోపాల్, 'మాటీవీ' మురళీకృష్ణంరాజు తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ ఆల్బమ్ 'ప్రతి ఇంటి గడపలో తెలుగుదనం - ప్రతి గుండెలో తెలుగు గజల్ తీయదనం నింపుతుందని" శ్రీనివాస్ అంటున్నారు. "ప్రతి మనిషి జీవితానికి పునాది ఇల్లు - అది జ్ఞాపకాల నిధి. ఈ విషయాన్నే 'నేను - నా ఇల్లు' ఆల్బమ్ ద్వారా తెలియజేసాం. ఎనిమిది పాటల ఈ ఆల్బమ్‌ను తెలుగువాళ్ళు ఆవకాయకు ఎంత ప్రాధాన్యతిస్తారో అంత ప్రాధాన్యం ఇచ్చి పెట్టుకోవచ్చు" అని అన్నారు. సి.నా.రె, డా॥రెంటాల వెంకటేశ్వరరావు, వి.నరసింహారెడ్డిలతో పాటు శ్రీనివాస్ కూడా ఇందులో గజల్స్‌ను రాశారు. ఈ పాటల వీడియో ఆల్బమ్‌ను వచ్చే నెలలో ఢిల్లీలో అద్వాని చేతుల మీదుగా విడుదల చేస్తానని శ్రీనివాస్ చెప్పారు.

అనవసరం. జైలు బయట పోలీసులు వుండొచ్చు. కానీ జైలు లోపల సంస్కరణవాదులు వుండాలి - నేరస్థుల మనసుల్లో మార్పుతేవాలి - అని నా భావన. అందువల్లే అక్కడి వ్యక్తుల్లో వారి మనసుల్లో కొంత మానవతను నింపడానికి గజల్స్ గానం చేస్తున్నాను. మా అమ్మాయి సంస్కృతికి 3 సం॥రాలు. తనను కూడా తీసుకెళ్ళి ఈ మధ్య అక్కడ పాడించాను. నిజం **చెప్పాలంటే జైళ్ళ పేరును తీసేసి - 'సంస్కరణాలయం' అని మార్చాల్సిన అవసరం వుంది"** అంటారు శ్రీనివాస్.

శ్రీనివాస్ కేవలం గాయకుడే కాదు సంగీత దర్శకుడు కూడా. ఆదిత్య ఆడియోస్ ద్వారా విడుదలైన 'శ్రీశ్రీనివాసం' ఆడియోకు శ్రీనివాస్ సంగీతాన్ని సమకూర్చడమే కాకుండా బాలు, ఎస్.జానకి, నిత్య తో కలిసి కొన్ని పాటలు పాడారు. ఈ క్యాసెట్ ద్వారా వచ్చిన లాభాలను శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నజీయర్ స్వామి వారి 'వికాస తరంగిణి'కి అందించామని చెప్పారాయన. ఆ తర్వాత ఓజస్ ఆడియోస్ అనే సొంత కంపనీ ద్వారా గజల్ శ్రీనివాస్ స్వీయ సంగీత దర్శకత్వ గానంలో 'నా తండ్రీ శ్రీనివాస్!', 'అయ్యప్ప మాలవెయ్' ఆడియో క్యాసెట్లను విడుదల చేశారు.

త్వరలోనే 'థ్యాంక్యూ సోమచ్' పేరుతో ఓ తెలుగు పాప్ ఆల్బమ్‌ని కూడా తేబోతున్నానని శ్రీనివాస్ అన్నారు. నటులకు పుట్టిల్లు అయిన పాలకొల్లులో బాల్యాన్ని గడిపిన 'గజల్' శ్రీనివాస్ చిరంజీవి స్ఫూర్తితోనే చలనచిత్ర నటుడూ అయ్యారు. హాస్యబ్రహ్మ జంధ్యాల ఆఖరి చిత్రం 'విచిత్రం'లో శ్రీనివాస్ కథానాయకుడిగా నటించారు. త్వరలోనే 'సోహం' పేరుతో ఓ చిత్రాన్ని తానే హీరోగా నటిస్తూ - నిర్మించబోతున్నాని ఆయన అన్నారు.

'గజల్‌కి గ్లామర్ తేవాలన్నదే నా కోరిక' అని చెప్పే శ్రీనివాస్ - అనేక సామాజిక సేవా కార్యక్రమాల నిర్వహణకు నిధులను సేకరించడానికీ గజల్స్‌ను ఉపయోగిస్తున్నారు. ''చనిపోయిన తర్వాత కూడా బ్రతికి ఉండటం కోసమే నేను గజల్స్ పాడుతున్నాను - ఈ సేవా కార్యక్రమాలు చేస్తున్నాను'' అంటారాయన.

**- చంద్రలేఖ**



# వెన్నెలకంటి వెలుగులు









## వెన్నెలకంటి పద్యాలు

1. హీరో ఏయన్నారుకు
సరసన సావిత్రి వుంటె సక్సెస్ సినిమా
ఆరోజుకు ఈరోజుకు
వేరెవరోయ్ అంత పెయిర్ వెన్నెలకంటీ

2. గోంగూర వంటి పచ్చడి
రంగారావంటి నటుడు రసములలోనన్
శృంగారమంటి రసమును
పింగళివంటి కవిలేడు వెన్నెలకంటీ

3. పౌరాణిక పాత్రలలో
తారక రాముణ్ణి మించు టాపార్టిస్టే
లేరని ఎన్నడు రారని
వీరావేశాన జెప్పు వెన్నెలకంటీ

4. నెల్లూరుఖ్యాతి దేశపు
ఎల్లలు దాటించు ఘనుడు యస్పీ బాలూ
థ్రిల్లగు పాటల శరముల
విల్లేగద అతని గొంతు వెన్నెలకంటీ

## వెన్నెలకంటి పదాలు

1. చిత్ర భారతి తల్లి
పుత్రుడై విలసిల్లి
చెలగె బలిజేపల్లి
ఓ వెన్నెలమ్మా

2. మాటలకు మధుశాల
పాటలకు రసడోల
వెరసి సముద్రాల
ఓ వెన్నెలమ్మా

3. చమకులో పింగళి
శబ్దాల గింబళి
అతడికిదె అంజలి
ఓ వెన్నెలమ్మా

4. జాను తెనుగుల వేది
నుడికారముల ప్రోది
వేరెవరు మల్లాది
ఓ వెన్నెలమ్మా



(1881-1953)







**ఘంటసాల క్విజ్ - 9 విజేతలు**

మొదటి బహుమతి
జి. భోగేశ్వరరావు, విశాఖపట్నం.
రెండవ బహుమతి
కె.ఎల్.ఎన్.మూర్తి, సత్తెనపల్లి.
మూడవ బహుమతి
డా.సయ్యద్ రహమతుల్లా,
పర్లాకిమిడి (ఒరిస్సా).

**కరెక్టు సమాధానాలు**

1. పల్లెటూరు
2. కన్నకొడుకు
3. లైలామజ్ను
4. కాళహస్తి మహాత్మ్యం
5. పాడకే నా రాణి పాడకే పాట

**బహుమతులు**

మొదటి బహుమతి: ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటలు) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.
రెండవ బహుమతి: 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటలు) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
మూడవ బహుమతి: ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మి నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



15

ఇలపావులూరి మురళీమోహనరావు

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్ చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



## జరిగినకథ



వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. ఎలుకలబోను పెడితే దాన్ని ఎలుక కొరికేస్తుంది. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. అది ఎలుకను పట్టకుండా వడినిద్రపోతూ ఉంటే వెంకట్రావు మండిపడతాడు. తిండిపెట్టక మాడుస్తాడు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లి కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో పక్కింటి ఆండాళ్ళమ్మ సలహాతో ప్రాయశ్చిత్తం చేయించాలని పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వచ్చి శాంతుల పేరిట ఇరవై వేల రూపాయలను అడుగుతాడు. దానికి వెంకట్రావు ఒప్పుకోకపోవటంతో శాస్త్రి వారిని నరకబాధలు తప్పవని భయపెట్టి వెళ్లిపోబోతుంటాడు

(ఇక చదవండి)

"అయన మాటలు వింటుంటే వళ్ళు జలదరిస్తున్నది. వెధవ డబ్బు పోతే పోయింది. ముందాయన్ని పిలవండి" అన్నది సుందరి.

"పిచ్చివట్టిందా ఏం? ఇరవైవేలు ఎక్కడినుంచి తెస్తాం?" కోపంగా అన్నాడు వెంకట్రావు.

"కావాలంటే నా మంగళసూత్రాలు అమ్మేద్దాం. శరీరాన్ని చీల్చి ముక్కలు చేసి శనగపిండిలో కలిపి.... అయ్యబాబోయ్... తలచుకుంటేనే నరాలు చచ్చుబడుతున్నాయి." ఏడుపు గొంతుతో అన్నది సుందరి.

"ఏవండోయ్ శాస్త్రిగారూ" కేకపెట్టాడు వెంకట్రావు.

సైకిలు వట్టుకుని వెళ్తున్నట్లు నాటకమాడుతున్న శాస్త్రిగారు వెంకట్రావు పిలుపు వినపడగానే సైకిల్ ఎక్కుతున్నట్లు నటించసాగారు.

వెంకట్రావు బయటకు పరుగెత్తుకుని వచ్చాడు.

"ఒకసారి లోపలకు రండి శాస్త్రిగారూ." అన్నాడు.

"అబ్బా..ఏమిటి వెంకట్రావుగారూ అవతల ఆలస్యమైతే బంగారపు బల్లి పోతుంది. అటు బల్లికి చెడి ఇటు పిల్లికి చెడితే పిల్లలు గలవాణ్ణి ఏమైపోవాలి?" విసుగు నటించారు శాస్త్రిగారు.

"ఒకసారి లోనికి రండి. మళ్ళీ మాట్లాడుకుందాం." అన్నాడు వెంకట్రావు.

"మళ్ళీ ఇంకేం మాటలండీ, మీకేం ప్రభుత్వోద్యోగులు. మహాప్రభువులు. మేము తెల్లవారితే నలుగురి మీద ఆధారపడి బ్రతికేవాళ్ళం ఇలా మా సమయం వృధా చేస్తే ఎలా? మీరు ఆఫీసుకు వెళ్ళినా, వెళ్ళక పోయినా పని చేసినా, చెయ్యక పోయినా ప్రభుత్వం వారు పువ్వుల్లో పెట్టి మీకు జీతబత్తలు అందిస్తారు. మాకు అలా కాదే..."

"సరే.. మీరు రండోసారి..."

"అమ్మమ్మా.. ఇక నావల్లకాదు బాబూ.. ఆకలితో జీర్ణకోశం దహించుకుపోతున్నది.




నాలుగుమెతుకులు గతికి పెళ్ళిళ్ళు, ఆబ్దికాలు చూసుకోవాలి. నన్ను వదిలెయ్యండి మహాప్రభో..."

"మళ్ళీ టిఫిన్ చేయించి పెడతాం. మీరు లోనికి రండి.."

విసుగు నటిస్తూ సైకిల్ స్టాండు వేసి లోపలకు వచ్చారు శాస్త్రిగారూ.

"అమ్మాయ్.. నువ్వుముందు దిబ్బరొట్టెల్లాగా ఉండే ఇరవై ఇడ్లీలు బాగా నేతిలో ముంచి పట్రా. వెంకట్రావుగారు ఇవాళ నన్ను వదిలేట్టులేరు. ఎంతైనా ఇంటి పురోహితుడిని కదా భరించక తప్పదు." కూర్చున్నారు శాస్త్రిగారు.

మెటికలు విరిచి లోపలకు వెళ్ళింది సుందరి.

"అయ్యా శాస్త్రిగారూ.. మరో మార్గమేదైనా చూడండి." చేతులు నలుపుకుంటూ అన్నాడు వెంకట్రావు.

మళ్ళీ గొంతు సవరించుకున్నారు శాస్త్రిగారు.

**"పిల్లిని మించిన దైవము**
**ముల్లోకములనెచటైన మూర్కొన గలవా?**
**పిల్లికి సరిసాటిది జా**
**బిల్లి యొకటియె విశ్వమందు వినుమా పార్థా!**

అని అఖుబుక్కు మహర్షి అర్జునుడితో అన్నాడు. తెలుసా?"

"అబ్బా... ఈ అఖుబుక్కు మహర్షి ఎవరండీ పనిలేని మంగలి పిల్లితల గొరిగినట్లు పిల్లిమీద ఇన్ని పద్యాలు చెప్పాడు? మేమసలు ఇలాంటి పద్యాలు వినలేదు. ఆ మహర్షి పేరు అంతకంటే వినలేదు."

"అవున్లెండి సర్కారీ కొలువు, మీకు అంత అవసరమేముంది? వృత్తి గాబట్టి మేము ప్రతి రోజూ శాస్త్రాలు, పురాణాలు, వేదాలు వల్లెవేయాలి కాబట్టి అవి నిరతము మానోళ్ళలో నానుతుంటాయి. ఇంకా ఎంతోమంది ఎన్నో విధాలుగా పిల్లిని ప్రస్తుతించారు. అవన్నీ చెప్పాలంటే మీ సమయం వృధా చెయ్యడమే".

"కానీ శాస్త్రిగారూ.. కొంచెం డిస్కౌంట్ ఇవ్వడానికి వీలౌతుందేమో చూడండి."

"వెంకట్రావుగారూ.. మీరూ చేసిన పాపం సామాన్యమైంది కాదు. హత్య! ఒక మనిషి హత్య చేస్తే పోలీసులకు నాలుగు రూపాయలు ఆశ చూపించి మాఫీ చేయించుకోవచ్చు. మహా అయితే ఏడు సంవత్సరాలు జైలు శిక్ష పడుతుంది. ఈలోపల ఏ గాంధీ జయంతో నెహ్రూ వర్ధంతో వస్తుంది. ఆ సందర్భంగా ప్రభుత్వం ఇచ్చే ఆదేశాలతో బయట పడవచ్చు. కానీ ఇది అలా కాదు, దైవ సమానమైన అందమైన జంతుహత్య! లంచాలిచ్చి యమలోకంలో శిక్షలు మాఫీ చేయించుకోవడం జరగని పని, చచ్చిన తరువాత చచ్చినట్లు అనుభవించాలి. అటువంటి శిక్షలను ముష్టి ఇరవైవేలతో మాఫీ చేస్తానంటే మీరేదో గొణుగుతున్నారు." నిష్ఠూరంగా అన్నారు

శాస్త్రిగారు.

వెంకట్రావు, సుందరి కళ్ళతోనే సంప్రదించు కున్నారు. మంగళసూత్రాలు చూపించింది సుందరి. శాస్త్రిగారు అది గమనించి కూడా ఏమీ ఎరగనట్లే కూర్చున్నారు.

"సరె.. అలాగే కానివ్వండి. రేప్పొద్దున్నే వచ్చి ఆ శాంతేదో కానిచ్చెయ్యండి." అన్నాడు వెంకట్రావు.

"రేప్పొద్దునా?... అన్నన్న.న్న... నాలుగు మాసాల దాకా నా డైరీలో అస్సలు ఖాళీలేదు. ఇది ఏప్రిల్ కదా.. ఆగస్టులో మొదలు బెడతాం." కంగారు నటిస్తూ అన్నారు శాస్త్రిగారు.

"అమ్మో.. అంతాలస్యమా? మరి పాపం పెరిగిపోదూ..." అన్నది సుందరి.

"ఏం చెయ్యమంటావమ్మా... రేపు కలెక్టరు గారింట్లో సత్యన్నారాయణ వ్రతం ఉంది. అడ్వాన్సు కూడా పుచ్చుకున్నాను. పెద్ద పెద్ద వాళ్ళళ్ళలో చాలా కార్యాలున్నాయి" అన్నారు. శాస్త్రిగారు డైరీ పేజీలు తిరగేస్తూ.

"సరె.. కానివ్వు... శాస్త్రిగారు అంత బిజీ మరి! అప్పుడే చేయిద్దాం." అన్నాడు వెంకట్రావు అప్పటిదాకానైనా సుందరి మెడలో మంగళసూత్రాలుంటాయి కదా అని.

ఇంతలో శాస్త్రిగారి సెల్ మోగింది.

"అయ్యా.. కలెక్టరుగారూ.. నమస్కారం దీర్ఘాయుష్మాన్ భవ. రేపు ఉదయం ఎనిమిది గంటలకల్లా ఉంటాను.... ఏంటీ మీ శ్రీమతి గారికి వంట్లో బాగాలేదా?"

"............."

"అయ్యో.. అంత పని జరిగిందా? మరి..."

"............."

'మీ ఇంట్లో వ్రతం అని ఇక్కడో శాంతి పూజకు రాలేనని చెప్పానే...."

"............."

"ఫరవాలేదా... అయ్యయ్యో.. ఎంతమాట! అడ్వాన్సుదేవుందిలే.. ఓ..హె..హె..హె ధర్మమూర్తులు... అలాగే ఉంచుతాలెండి... తరువాతే పెట్టుకుందాం. ఓ...వచ్చే నెలలో దివ్యమైన ముహూర్తాలున్నాయి.. సరే.. ఉంటాను. శుభం." సెల్ ఆఫ్ చేశారు శాస్త్రిగారు.

"వెంకట్రావుగారూ... కలిసొచ్చే కాలానికి నడిచొచ్చే బిడ్డ పుట్టడం అంటే ఇదే! మీ పాపం ఏమాత్రం పెరక్కుండా యమధర్మరాజు చక్రం అడ్డం వేశాడు. కలెక్టరుగారి భార్యగారిని మంచం ఎక్కించాడు. రేపు మీ శాంతి పూజకు ఏమాత్రం అడ్డంకులు లేవు. అదృష్టవంతులు." అన్నారు.

సుందరి, వెంకట్రావుల ముఖాలు వికసించాయి.

"వెంకట్రావుగారూ.. పూజకు కావల్సిన సామగ్రి చెబుతాను రాసుకోండి" అన్నారు




శాస్త్రిగారు.

వెంకట్రావు పెన్ను పేపరు తీసుకున్నాడు.

"ప్రసాదాల కోసం - రెండుకిలోల జీడిపప్పు... కిలో ఖర్జూరాలు.."

"రెండుకిలోల జీడిపప్పా... మేము సంవత్సరానికి కూడా అన్ని కొనమండీ..."

"అయ్యో, యమధర్మరాజుకు జీడిపప్పు అత్యంత ప్రీతిపాత్రమైనది. ఆయన దేవేరికి ఖర్జూరాలు ఎంతో ప్రియమైనవి. అవి దండిగా ఉండకపోతే వారికి ఆగ్రహం కలుగుతుంది. వారికి కోపం వస్తే మీ తోలు చెక్కుతారు."

"...వద్దులెండి అలాగే కానిద్దాం. ఇంకా...?"

"యాలకులు పావుకిలో, నెయ్యి రెండు కిలోలు, పంచదార పది కిలోలు, కర్పూరం వందగ్రాములు, ఎండుకొబ్బరి రెండుకిలోలు, బెల్లం నాలుగు కిలోలు. ఇవి ప్రసాదాలకు, ఇక వంటలకు, ఎన్ని కూరలు చెయ్యాలను కుంటున్నారు?"

"మీ ఇష్టం. చెప్పండి."

"బాగా గట్టిగా నీలం రంగులో నిగనిగలాడే గుత్తి వంకాయలు నాలుగు కిలోలు, లేతగా ఉండే బెండకాయలు రెండు కిలోలు, రాళ్ళలా ఉండే బంగాళాదుంపలు మూడు కిలోలు, నవనవలాడే పచ్చ అరటికాయలు డజను.. నాలుగు కూరలు చేద్దాం."

"ఎంత మందికి ఎస్టిమేట్ వేశారు?"

"చెబుతాను. మీరు రాస్కోండి. కందిపప్పు రెండు కిలోలు, పెసరపప్పు కిలో, గారెలకు మినపప్పు మూడుకిలోలు, శనగపిండి రెండు కిలోలు బజ్జీలకు, ఇక పులుసులోకి ముక్కలకు మంచి లేత సొరకాయలు రెండు, కేరెట్లు కిలో, చిలగడ దుంపలు రెండు కిలోలు పట్రండి.

"ఇక పులిహోరకు మంచి రిఫైన్డ్ వేరుశనగ నూనె కిలో, పచ్చళ్ళు అల్లం పచ్చడి, టమోటా పచ్చడి, గోంగూర పచ్చడి, తెల్లవంకాయ పచ్చడి, కందిపొడి, నువ్వులపొడి... ఇవి వంటలకు."

"ఇంతేనా ఏమైనా ఇంకా చెబుతారా?"

"రాస్కోండి. పూజకు మంచి రాగి కలశం, ఎనిమిది జాకెట్ ముక్కలు, వందగ్రాముల కుంకుమ, వంద గ్రాముల పసుపు, తమలపాకులు నాలుగు కట్టలు, అరకిలో పూలు, దేవుడి నైవేద్యానికి క్షీరాన్నం కోసం నాలుగు లీటర్ల పాలు, మంచి గడ్డపెరుగుకు నాలుగు లీటర్ల పాలు, దక్షిణలకోసం ఐదురూపాయల బిళ్ళలు ఓ వంద..."

"వందా... వంద దేనకి?"

**-(ఇంకావుంది)**





# కొమ్మ కొమ్మకో సన్నాయి...

## పాటసారి డైరీ లోంచి....





"ఓ సీతకథ'తో గీతకథ సంగీత కథ హరికథతో మొదలై గడచిన 34 సంవత్సరాలలో ఎందరో దర్శకులతో, సంగీత దర్శకులతో సహృదయులైన నిర్మాతలతో గడిపిన అనుభవాలను తలుచుకుంటే మనసు ఆ మధుర స్మృతులతో నిండిపోతుంది. ఎన్నో సంఘటనలు గుర్తుకు వస్తాయి.

ఒక్కొక్క పాట పుట్టడానికి ఎందరెందరు ఎన్ని విధాల నేపథ్యంలో కృషి చేశారో, చేస్తారో ఆలోచించి చూస్తే అంతా స్వప్రయోజకత్వమే అనే అజ్ఞానం, అహంకారం కూడా పటావంచలై పోతాయి.

ముఖ్యంగా ఈ రాసుకోని రాగాల డైరీ నుంచి కొన్ని ఉదంతాలు ఇక్కడ ప్రస్తావిస్తాను.





**నా** సినీ గేయ రచనా జీవితానికి ఓనమాలు దిద్దించిన గురువు శ్రీ కాశీనాథుని విశ్వనాథ్. అంతకు ముందు అలవోకగా పద్య రచన, పాటల రచన అనే అలవాటు వున్నా దాన్ని తెరచాటు నుంచి తెరమీదకి తెచ్చినవారు ఆయనే. నేను 'ఆకాశవాణి' కోసం రాసిన 'సిరికాకొలను చిన్నది' బహుళ ప్రజాదరణ పొందినప్పుడు, అది అనేకసార్లు విజయవాడ కేంద్రం నుంచి పునఃప్రసారమైనప్పుడు ఒకటి రెండు సినిమా అవకాశాలు వచ్చినా పత్రికా రచన మీద గల అభిమానం నన్ను రానివ్వలేదు. ఆ రేడియో సంగీత నాటిక బహుళ ప్రశస్తి పొందడానికి ముఖ్య కారకులు శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు. దానికి సంగీత కళానిధి అయిన శ్రీ పెండ్యాల నాగేశ్వరరావుగారు సంగీతం సమకూర్చారు. ఆ నాటిక విని అది సినిమా తీయాలనే ఆలోచనతో శ్రీ ఎన్.టి.రామారావు కొందరు నిర్మాతలను రప్పించి స్పూల్‌టేపు రేడియో నుంచి తెప్పించి వినిపించారు. కానీ అప్పట్లో అది సాధ్యం కాలేదు.

శ్రీ కె.విశ్వనాథ్ అందులో పాటలు నాచేత పాడించుకుని విని ఒకసారి లేచి ఆలింగనం చేసుకుని 'ఇక నా సినిమాలకు మీరే పాటలు రాయాలి' అన్నారు. అప్పుడు 'ఓ సీతకథ' అనే చిత్రానికి నాచేత రెండు మూడు పాటలు రాయించారు. శ్రీ కె.వి.మహదేవన్ నా తొలి సినిమా పాటను స్వరపరిచారు. కోడంబాకం ట్రస్టుపురంలో తొలిసారి సినీ కవిగా అటువంటి మహనీయుల చరణ సన్నిధిని నా సినీ జీవితం పల్లవించింది.

నోరు తిరగని గ్రాంధిక భాషలో రాసిన ఆ హరికథను సినిమా పాటగా స్వీకరించిన శ్రీ విశ్వనాథ్‌గారి ధైర్యం, ఔదార్యం ఈనాటి ప్రమాణాలతో చూస్తే పురాణ సత్యాలు. దాన్ని నాలుగైదు రాగాలలో మాలికగా స్వరబ్రహ్మ సంగీతీకరిస్తున్నప్పుడు నేను పొందిన ఆనందం మరువలేను. ఆ గీతం మధ్యలో 'నవరసమంజరీ నారీ - నవజీవన వన నాట్యమయూరీ' అనే చరణాన్ని సారమతి రాగంలో స్వరపరచి ఆయన పాడుతున్నప్పుడు పుట్టిన పులకాంకురాలు ఇప్పటికీ పూలు పూస్తూ ఆ మధురస్మృతులకు పరిమళాలు సంతరిస్తూనే వుంటాయి.

ఇక 'సిరిసిరిమువ్వ' చిత్రంలో 'రా దిగిరా దివి నించి భువికి దిగిరా' అనే పాట కోసం డాబా పిట్టగోడల మీద కూర్చుని ఆ సన్నివేశం అంతా చెప్పి రెచ్చగొట్టి ఆవేశాన్ని దానికి కావలసిన కవితావేశాన్ని రాబట్టుకోవడానికి శ్రీ విశ్వనాథ్‌గారు పడ్డ శ్రమ నాకు మరపురాదు. అప్పుడు కట్టలు తెంచుకుంటూ పుట్టుకొచ్చిన ఆ గీతాన్ని ఎంతో 'ఎడిట్' చేస్తే సినిమాలో పాట పరిమితికి చేరింది.

**'సతీ వియోగము సహియించక - దు**
**ర్మతియౌ దక్షుని మదమడంచగా**
**సకలలోక జర్జరిత భయంకర**
**వికటనటత్పద విస్ఫులింగముల**
**విలయ తాండవము సలిపిన నీవే**
**శిలవే అయితే పగిలిపో-**
**శివుడే అయితే రగిలిపో-'**

ఇది ఆశువుగా చెప్పిన గీతం. రాసుకోవడానికి మరెవ్వరూలేరు. విశ్వనాథ్‌గారే వస్తున్న పాటను లేఖకుడుగా అక్షరబద్ధం చేశారు. కళను తపస్సుగా భావించి తపించి సృజనాత్మకమైన చిత్ర కల్పనలో తలమునకలైన విశ్వనాథ్, మణిరత్నం, బాపు వంటి స్రష్టలతో కలిసి పనిచేసే అదృష్టం విధి నాకు అందించిన నిధి.

అలాగే విద్యార్థి దశలో అప్పుడప్పుడూ రాసిపెట్టుకున్న 'ప్రయివేటు' రచనలను కూడా తెరకు తెచ్చి వాటికి సార్థకత కలిగించారు విశ్వనాథ్. 'సప్తపది' చిత్రంలో

**'ఏ కులము నీదంటె గోకులము నవ్వింది**
**మాధవుడు యాదవుడు మా కులమే లెమ్మంది**
**ఆది నించి ఆకాశం మూగది**
**అనాదిగా తల్లి ధరణి మూగది**

నడుమ వచ్చి ఉరుముతాయి మబ్బులు
ఈ- నడమంత్రపు మనుషులకే మాటలు
ఇన్ని మాటలు'

సందర్భోచితంగా ఈ గీతాన్ని విశ్వనాథ్ ప్రయోగించి అటు కథనానికి, ఇటు గీతానికి కూడా ప్రాణం పోశారు. భావ రాగ దర్శనాల త్రివేణీ సంగమాలు విశ్వనాథ్ చిత్రాలు.

సినిమా పాటల రచయితగా స్థిరపడిన



తరువాత 'సీతామాలక్ష్మి' చిత్రంలో ఒక సన్నివేశంలో ఏ విధమైన పాట వుండాలో, రాయాలో తెలియక ఆయనా నేను డోలాయమాన స్థితిలో వున్నప్పుడు 'ఏ పాట నే రాయను బ్రతుకే పాటైన పసివాడను' అన్నాను- 'ఇదే... ఈ పాటే రాయండి' అంటూ అక్కడ చిన్నపిల్లవాడు పాడతాడు గనుక 'రాయను' అనే మాటకు బదులు 'పాడను' అంటే సరిపోతుంది అన్నారు. **ఇక్కడొక రహస్యం చెప్పితీరాలి- కవితా రచనకే పూనుకుని వుంటే శ్రీ విశ్వనాథ్ ప్రముఖ సినీ కవి అయివుండేవారు.**

ఇటువంటిదే మరొక సంఘటన. ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ (పి.ఎ.పి) 'ఆలుమగలు' చిత్రానికి కొన్ని పాటలు నేను రాశాను. సంగీతం శ్రీ తాతినేని చలపతిరావు అందించిన ఆ చిత్రానికి దర్శకుడు శ్రీ తాతినేని రామారావు. హీరో నాగేశ్వరరావు మొహమాటం కొద్దీ చక్కని చుక్కల చేతుల్లో పడతారు. అక్కడ అతనుపడే అగచాట్లను శృంగారపరంగా రాయాలి. అంతకు ముందు దాశరథి గారు కొంత ప్రయత్నించారు. దర్శకుడికి యింకా ఏదో కావాలనే తపన. 'ఇదేదో... మనకందడం లేదు మీరు చూసుకోండి' అన్నారు దాశరథి. నేనూ చాలా పల్లవులు రాస్తూనే వున్నాను. కానీ ఏదీ ఎక్కడం లేదు. అక్కడ ఏ రచయితకయినా సరసమైన ఒక చిక్కు ఎదురయ్యేది. సంగీత దర్శకుడు చలపతిరావుగారు కూడా మంచి రచయిత... కవి.... విమర్శకుడు, దాంతో ముందు ఆయనను ఒప్పించవలసి వచ్చేది. విశ్వనాథ అంతటి వారి కవితలోనే యతి దోషాలు పట్టుకున్నవాడు ఆయన! 'ఉరిమిన నీ కొనసంగెద నుపాయనముల్ నవబాష్ప బిందువుల్ అనే పద్యపాఠంలో 'ఉ'కి 'పా' అనే ప్రాస వేసి పప్పులో కాలు వేశారని ఒక్కసారి చలపతిరావుగారు అన్నారు. సరే నేనుకూడా పది పల్లవుల వరకూ రాసి 'అయ్యా! ఎరక్కపోయి వచ్చాను... ఇరుక్కుపోయాను... వదిలెయ్యండి... సెలవు' అన్నాను. వెంటనే చలపతిరావు 'అబ్బ. ఇదేనయ్యా ఇదే మా పల్లవి. దీనికి చరణాలు రాయి' అన్నారు.

ముళ్లపూడి వెంకటరమణగారన్నా బాపూగారన్నా నాకు ఆపేక్ష. ఆరాధన అనను. అంటే కాస్త దూరమౌతారని భయం. ఆంధ్రపత్రికలో 1958-59లో అన్నగారు రమణగారి సరసన కూర్చుని అక్షరాలకు వర్ణాలు దిద్దుకున్న వాడిని- ఆయనా నన్నంతగా ప్రేమగా చూసేవారు. నేనేమైనా తప్పుగా రాసినా, మాట్లాడినా 'మీరు నాకు ముద్దొస్తున్నారు' అని మందలించేవారు. 'మిస్టర్‌పెళ్లాం', 'రాంబంటు' వంటి చిత్రాలలో నా పాటలకు అన్నగారి ప్రభావమే పల్లవీ, చరణాలూ కూడా-

ఓసారి 'బుల్లెట్' చిత్రం కంపోజింగుకు మహాబలిపురం రోడ్డులో నేనూ రమణగారూ కారులో వెడుతున్నాం. 'ఫిషర్ మెన్స్ కోవ్'లో మామ కంపోజింగు- నాకు దారిలో సన్నివేశం చెప్పారు రమణగారు. ఆ సన్నివేశం కిలికించితార్జునీయం, కొంటెతనం కంటె చిలిపిగా వుండే ఆ సన్నివేశం ఆయనేం చెప్పారో చెప్పనుగానీ నేను కారులోనే 'పల్లవి' ఒకటి ఆయనకు చెప్పాను-

**అతను: రాధకృష్ణుడికి ఏమిస్తుందో ఇస్తావా మరి**
**ఆమె : సీతకు రాముడు ఏమవుతాడో అవుతావా మరి**
**అతను : ముందివ్వు మరి**
**ఆమె : ముందవ్వు మరి**

ఈ పల్లవి చెప్పగానే మళ్లీ ముద్దొచ్చాను నేను రమణగారికి- 'రాంబంటు' చిత్రంలో 'చందమామ కంచమెట్టి సన్నజాజి బువ్వపెట్టి' అనే పాటలో 'సిగలోకి పూలంటే అరటి పువ్వు తెస్తాడు అవకతవకడు ముదురు బెండడు' వంటి ప్రయోగాలు నేను చేసినప్పుడు బాపు ఎంతో మెచ్చుకున్నారు. ఆ మాటలు రమణీయమైనవి, రమణగారి రచనల ప్రభావం ఆ మాటల్లో వుండక ఏం చేస్తుంది!

మరో గొప్ప దార్శనికుడు దర్శకుడు శ్రీ మణిరత్నం- ఆయన కలగన్న దృశ్యానికి సంగీతంలో వ్యాఖ్యానం చెప్పగలడు. వాననీ గాలివాననీ ప్రళయాన్ని వాటిలో ప్రణయాన్ని రాగాలు తీయించగలడు. మాటలతో మౌనాన్ని మౌనంతో మాటల్నీ పలికించగలడు. 'గీతాంజలి' చిత్రంలో పాటలు రాసిన అనుభవంలో నేను గ్రహించిన సత్యాలివి.

**'జల్లంత కవ్వింత కావాలిలే**
**వళ్లంత తుళ్లింత రావాలిలే'** ఈ పాటకు ఇళయరాజా యిచ్చిన ట్యూనుకు పాటరాస్తే ఆకతాయి పాటగా తయారయింది. దానికి మణిరత్నంగారి ముఖ్య సహచరుడు శ్రీ పాణిగారు ఇంగ్లీషులో తర్జుమా చేసి వినిపించబోయారు. ఎంతో అందంగా టైపు చేయించి ఎన్నో కాపీలు తీయించినా ఆ కాగితాలన్నీ పాణిగారికిచ్చేసి తెలుగులో మీరు రాసిన పాట వినిపించండి అన్నారు. నేను వినిపించాను. ట్యూన్ పెట్టుకుని వింటూ ఈ మాటల్ని తనలో తను



అను కుంటూ మొత్తం పాటంతా 'మననం' చేసుకున్నారు- తరువాత నాతో కరచాలనం చేస్తూ 'బ్యూటిఫుల్' అన్నారు. పల్లవి మొదటి రెండు లైన్లూ పాడుకుంటూ తన గదిలోకి వెళ్లిపోయారు. తెలుగు రాదనిపించే తెలుగువాడు మణిరత్నం. అటు

తర్వాత ఏ పాటకీ అనువాదాలు ఆయన చూడలేదు. నన్ను చదవమని ట్యూన్ వింటూ ఓకే అని చెప్పడమే. ముఖ్యంగా 'ఓ ప్రియాప్రియా' పాటకీ 'ఓ పాపాలాలీ' అనే పాటకీ ఆయన ఎంతో అబ్బురపడి అది రాసేటప్పుడు నా మనసు ఏమేమి ఊహించి రాశానో లైటింగు ఎలా వుండాలనుకుని వుంటానో నాకే చెప్పి 'అవునా' అని అడిగేవారు. అలాగే 'ఆమనీ పాడవే హాయిగా' పాటలో కొన్ని పదాలకు మాత్రం... మరీచిక... వంటి వాటికి అర్థం అడిగి తెలుసుకున్నారు. ఈ పాట రాయడానికి నేపథ్యంలో 'మధుమతి' చిత్రంలో దిలీప్ కుమార్ (ముఖేష్) పాడిన 'సుహానా సఫర్ ఔర్ ఏ మౌసమ్ హసీ' (సలీల్ చౌధురి) నా మనస్సులో ప్రేరణగా ఉంది. అది ఆయన గ్రహించ గలిగారు. అందుకే ఆయనను 'దార్శనికుడు' అని నేను పేర్కొన్నాను.



'జగడ జగడ జగడం చేసేస్తాం రగడ
రగడ రగడం దున్నేస్తాం ఎగుడు
దిగుడు గగనం మేమేరా పిడుగులం'

ఈ పాట ట్యూన్ గాని బ్యాక్‌గ్రౌండ్స్ గానీ ప్రతిబింబించేటట్లుగా ఇళయరాజా చేత ఆయన చేయించడం నాకు మాటలు అలాగే అలవోకగా రావడంతో ఆ పాట కొద్ది నిమిషాలలో పూర్తి అయిపోయింది. అర్థం చెప్పబోతే.. 'వద్దు... నా పాట నాకు వచ్చింది' అన్న మణిరత్నం ఎంతటి ప్రతిభావంతుడు!

'గీతాంజలి' తర్వాత సూటిగా ఆయన తెలుగులో చిత్రం తీయలేదు. తమిళం, హిందీ భాషల్లోనే తీశారు. అయినా తెలుగులో తన అనువాద చిత్రాలకు కూడా నేనే రాయాలని ఆయన కోరారు. గీతాంజలి తర్వాత ఏదో ఒక చిత్రం మినహా బొంబాయి, ఇద్దరు, సఖి, అమృత చిత్రాలకు నేను పాటలు రాయడం జరిగింది. తమిళ గీతాలలో లేని భావాలతో స్వతంత్రించి నేను రాస్తే తన సందర్భానికి అన్వయించుకుని 'మీ పాటే మీరు రాయండి- అందుకే మీ చేత రాయించడం' అని స్వేచ్ఛ యిచ్చిన ఆ దర్శకుడు ఆదర్శ వ్యక్తిగా కనిపిస్తారు.

ఆయన యోగి. ఆయన చూపులు కలలు కంటాయి. దేహచింత అంతగా లేని కర్మయోగి. పనే ఆహారనిద్రలుగా చేసుకున్న కళాకారుడు. మనుషుల్లో మణి. దర్శకుల్లో రత్నం. వెరసి మణిరత్నం.

పాటసారిగా నా యాత్ర ఎన్నో మజిలీలు దాటింది. పాటలీపుత్రానికి చేరడానికి సాగుతున్న ఈ యాత్రలో మైలు రాళ్లుగా నిలిచిపోయిన పాటలెన్నో...

నిజానికి

'ఆకు మెదలినా పాటే
అలలు కదిలినా పాటే
కలలు చెదిరినా పాటే
కలత చెందినా పాటే
ఏ పాటనే పాడను... బ్రతుకే
పాటైన పసివాడను-!'

**- వేటూరి సుందరరామమూర్తి**

---

# బాణీ ముత్యాలు



సినారె

వెలుగున ఉన్నంత వరకే
నీ నీడ తోడుగా ఉంటుంది
చీకటిలో నీవు సాగితే
అది నీకు దూరమవుతుంది
ఈ పరమార్థం తెలిసినవాడే
బ్రతుకు సార్థకమవుతుంది

చిత్రం : చదువూ -సంస్కారం
పాట పల్లవి : దీపానికి కిరణం ఆభరణం



ఆత్రేయ

మనిషిలాగ జీవించేది నీ చేతుల్లోనే వుంది
మంచి చెడు ఏదైనా నీ చేతల్లోనే వుంది
కావాలని నిప్పు తాకితే
చేయి కాలక మానదు
అలా కాలినందుకు కర్మే అంటే
గాయమేమో మానదు

చిత్రం : తాసిల్దారు గారమ్మాయి
పాట : కనబడని చెయ్యి ఏదో



సిరివెన్నెల సీతారామశాస్త్రి

గాలి వాటు గమనానికి కాలిబాట దేనికి?
గొర్రెదాటు మందకి నీ జ్ఞాన బోధ దేనికి?
ఏ చరిత్ర నేర్చుకుంది పచ్చని పాఠం
ఏ క్షణాన మార్చుకుంది చిచ్చుల మార్గం
రామ బాణమార్పిందా రావణ కాష్టం
కృష్ణ గీత ఆపిందా నిత్య కురుక్షేత్రం

చిత్రం : గాయం
పాట పల్లవి : నిగ్గదీసి అడుగు ఈ సిగ్గులేని జనాన్ని



వేటూరి

నరుడి బ్రతుకు నటన
ఈశ్వరుడి తలపు ఘటన
ఆ రెంటి నట్ట నడుమ
నీకెందు కింత తపన

చిత్రం : సాగరసంగమం
పాటపల్లవి : తకిట తధిమి (2) తందాన

సేకరణ :
బి. బాలసుబ్రహ్మణ్యం, హైదరాబాద్



చంద్రబోస్

వున్నదున్నట్టు చెప్పాలన్నది అద్దాన్ని చూసి నేర్చుకో
పరులకు సాయం చెయ్యాలన్నది సూర్యుణ్ణి చూసి నేర్చుకో
సోమరితనమే వదలాలని గడియారాన్ని చూసి నేర్చుకో
ప్రేమనందరికి పంచాలని భగవంతుణ్ణి చూసి నేర్చుకో
ఎంత తొక్కితే అంత పైకి రావాలన్నది బంతిని చూసి నేర్చుకో

చిత్రం : చెన్నకేశవరెడ్డి
పాట పల్లవి : నవ్వేవాళ్లు నవ్వనీ



# బాపు విశ్వరూపం 21

ఓ సంస్థ లోగో రూపొందించడం అంత సామాన్యమైన విషయం కాదు. వారు తయారుచేసే ఉత్పాదనను సూచించాలి, యాజమాన్యం నమ్మకాలు, సెంటిమెంట్స్ ప్రతిబింబించాలి. క్లుప్తంగా ఉండాలి, పిక్టోరియల్‌గా, అందంగా ఉండాలి.

ఈ కళలో బాపు సిద్ధహస్తులన్న విషయం ఆంధ్రదేశమంతటా తెలుసు. బాపు గారి చేత లోగో వేయించుకుంటే జయం కలుగుతుందని సినీరంగంలోను, పత్రికారంగంలోను సెంటిమెంటు కూడా ఉందంటారు. బాపు గారు తీర్చిన కొన్ని లోగోల లోగిలిలోకి అడుగుపెడదాం -

INDUS HOSPITALS

తానా ఆంధ్ర మహాసభలు

శ్రీరామకృష్ణ మాతాపిత జీవనసంధ్య

ఇండస్ హాస్పటల్ వారి లోగో చూస్తే ఏమైనా గుర్తొస్తోందా? ఇండస్ వ్యాలీ (సింధులోయ) తవ్వకాలలో బయటపడిన మట్టిముద్ర కదూ అది. ఒక్కసారి చూస్తే చాలు, రెండోసారి ఆ మహిషముద్ర చూడగానే వెంటనే గుర్తొస్తుంది కంపెనీ పేరు 'ఇండస్' అని. పబ్లిసిస్టుగా కెరియర్ ప్రారంభించిన బాపు ఇటువంటి విషయాలు బాగా తెలుసు.

తానా వారికి వేసిన బొమ్మ చూడగానే 'స్టాట్యూ ఆఫ్ లిబర్టీ' గుర్తుకువచ్చి అమెరికా సంబంధం ఆటోమెటిక్‌గా మైండ్‌లో ఎస్టాబ్లిష్ అయిపోతుంది. పట్టి చూస్తే సభలకు వస్తున్న ఆహూతులకై చేపట్టిన పన్నీరుబుడ్డి కనబడి, తెలుగుతనం పరిమళాలు అద్దినట్టు అర్థం అవుతుంది.

శ్రీరామకృష్ణ మాతాపిత జీవనసంధ్య లోగోలో పొద్దు వాటారడంతో బాటు, చేతికర్ర వల్ల వృద్ధులు సూచింపబడ్డారు. జస్ట్ ఓ ముడి ఏర్పాటు చేసి వెనుకనున్నది స్త్రీ అని సింపుల్‌గా చెప్పేశారు.

సూచిపత్రమాస పత్రిక ప్రభవ

పత్రిక మన మాస పత్రిక

సకుటుంబ మాసపత్రిక

సిరివెన్నెల సంసారపక్షపత్రిక

ప్రభవించడం అంటే ఉద్భవించడం, కొత్తగా పుట్టుకురావడం. ప్రభవ అక్షరాలు ఒకదాని కింద వేర్వేరు సైజుల్లో ఏర్పర్చి ఆ అనుభూతి కలిగించారు. 'భ' తలకట్టు 'ప'కు, 'వ' తలకట్టు 'భ'కు ఎంత ఇంపుగా అమిరాయో చూడండి. అలాగే 'పత్రిక'లోగోలో కూడా అక్షరాలను ఒకదానికి మరొకటి చక్కగా ముడివేశారు బాపు.

'ఆస్తికభూమి'లోగోలో శివకేశవుల అభేదం పాటించబడింది. ఒకపక్క త్రిశూలపాణి, మరొకపక్క కోదండధారి. 'శ్రీ చాముండీ చిత్ర'లో చాముండేశ్వరి నేత్రయుగమే కాదు, ముక్కంటి భార్య అని కూడా సూచించారు.

ఆస్తిక భూమి ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీ చాముండీ చిత్ర

PRASAD PICTURES INTERNATIONAL

'గీతాంజలి'లో అంజలి ఘటించే అమ్మాయి, 'కృష్ణా ఫామ్స్'లో గోపాలకుడు, 'స్వాతి'లో తృష్ణ తీర్చడానికి దిగివచ్చిన అప్సర, 'యుక్తా'లో యూనియన్ జాక్, 'నవోదయ' లో కన్నులు వాల్చిన గృహిణి, 'నవతాలయం'లో భిన్నమతచిహ్నాలు - ఆగి, పరికించినప్పుడే బాపు ఘనత అవగతమయ్యేది. పి.పి.ఐ. లోగోలో చూడండి. ఇంటర్నేషనల్ (గ్లోబ్) అనీ సినిమాకు సంబంధించినది అనీ (ఫిలిం ముక్క) రంగులీనే లోకం (నెమలి పించం) అనీ అనేక సజెషన్స్ ఉన్నాయి.

Geethanjali

చిత్ర కల్పన

కృష్ణా ఫాక్సు

నవోదయ పబ్లిషర్స్

United Kingdom Telugu Arts

UKTA

హాసం

హాస్య-సంగీత పత్రిక

స్వాతి

సపరివార పత్రిక

Sri Raja Lakshmi Foundation

శ్రీ రాజ లక్ష్మీ ఫౌండేషన్

HOTEL

Green Park

'హాసం' లోగో కొస్తే ఆధునిక గృహిణి మందహాసం చిందిస్తూ సరస్వతీ అవతారమెత్తినట్టు చూపారు బాపు. వీణ బదులు గిటారు చేపట్టడమే కాదు, ఒక చేతిలో సిడి, మరొకచేత ఇంటర్నెట్ ఎడిషన్‌కు సంకేతంగా విద్యుత్ పాశాన్ని ధరించి హాస్య-సంగీతాల మేళవింపుకు ప్రతీకగా నిలిచింది. ఈ అపూర్వసృష్టితో మమ్ములను ధన్యులను చేశారు బాపు. ■

స్వర సుందరి



# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు

**డా॥ పి.బి.శ్రీనివాస్**

'కోసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

రాజ్‌కపూర్ చిత్రాలకే కాక, ఇతరుల చిత్రాలలో కూడా శంకర్ జైకిషన్లు లతా చేత అద్భుతగీతాలు పాడించారు. 'కాలీ ఘటా', 'నగీనా', 'బాదల్', 'పట్‌రానీ' ఇలా ఎన్నో ఉదాహరణలు ఈయవచ్చు. 'ఓ కాలీ ఘటా..ఛాయీరే' భలే లింగరింగ్ మెలొడీ. "నగీనా"లో 'తూనే..' అనే లతా సోలోలో లతా గొంతు పలికించిన తారస్థాయి అత్యున్నతం, అనన్యసాధ్యం. అంత హై పిచ్‌లో పాడడం చాలా కష్టసాధ్యం.

అలా అనగానే మళ్లీ మళ్లీ ఆర్.కే. బ్యానర్ గుర్తుకువస్తుంది. 'జిన్ దేశ్‌వేం గంగా బహ్‌తీహై'లో పద్మినిపై చిత్రీకరింపబడిన 'ఓ బసంతీ పవన్‌పాగల్ న జారే నా జా రోకో కోయీ' అనే పాట కూడా హై పిచ్ పాటే! లతా



'ఓ బసంతీ..' ('జిస్ దేశ్ మే గంగా బహ్‌తీ హై')అని తెరపైన ఆలపిస్తున్న పద్మిని. ఈ పాట ట్యూన్ 'ఆవారా'లోని ఒక దృశ్యంలో నేపథ్యంలో వినబడుతుంది.

కంఠస్వరంలో అన్ని స్థాయిలలోనూ ఏ మాత్రం తగ్గకుండా ఒకే లెవెల్ మెయిన్‌టెయిన్ చెయ్యగలగడం గుర్తించదగిన వైశిష్ట్యం.

'ఆహ్' సినిమా గొప్పవిజయాన్ని సాధించలేక పోయినా శం-జై, లతా, ముకేశ్‌ల సూపర్ హిట్ టీమ్ అనవచ్చు. 'ఆహ్'ను తెలుగులో 'ప్రేమలేఖలు'గా డబ్ చేసినప్పుడు దాంట్లో జిక్కీ, ఎ.ఎం.రాజా ల పాటలన్నీ రోరింగ్ హిట్సే! హిందీలో 'రాజా కీ ఆయేగి బారాత్' 'యే శామ్‌కీ



శం-జైలు లతాతో కలిసి సృష్టించిన అద్భుతాలు - 'ఆహ్' (తెలుగులో 'ప్రేమలేఖలు') లో 'యే శామ్‌కీ తన్‌హాయియా' దృశ్యంలో కథానాయిక నర్గీస్. సినిమా ఫెయిలయినా పాటలు హిట్.

తన్‌హాయియా, సున్‌తే థే నామ్ హమ్' వంటి లతా సోలోలూ 'రాత్ అంధేరీ దూర్ సవేరా', 'జానే న నజర్', 'ఆజా రే తుఝే మేరా దిల్ పుకారా' వంటి యుగళాలూ, ముకేశ్ నటిస్తూ పాడుకున్న 'ఛోటీసీ యే జిందగానీ' - ఇవన్నీ ఈ నాటికీ మన హృదయాంతరాళంలో మోగుతూనే వున్నాయి.

రాజ్‌కపూర్ ఇంకో సినిమా 'శ్రీ 420' సినిమాలో లతా మన్నాదేల 'ప్యార్ హువా, ఇక్‌రార్ హువా' మరొక గొప్ప హిట్ సాంగ్. తెరపై నర్గీస్, రాజ్‌ల కాంబినేషన్‌లతో బాటు రాజ్ కపూర్



అజరామరమైన ప్రేమగీతం-'ప్యార్ హువా ఇక్‌రార్ హువా'('శ్రీ 420'). తెరపై రాజ్, నర్గీస్ లతో బాటు రణధీర్ కపూర్, ఋషికపూర్ కూడా బాలలుగా కనబడతారు.

కుటుంబసభ్యులు, దరిమిలా పెద్ద ఆర్టిస్టులు, తమ బుజ్జిబుజ్జి నడకలతో వర్షంలో గొడుగుపట్టుకుని మురిపిస్తారు. గమనించండి.

## సంగీత దర్శకురాలిగా లతా

గాయకురాలిగా ప్రఖ్యాతి పొందినా లతా సంగీతదర్శకురాలు కూడా! తొలి ప్రయత్నం 'రామ్‌రామ్ పహునా' (1950). ఆ తర్వాత అడపాదడపా కొన్ని మరాఠీ చిత్రాలకు ఆమె సంగీత దర్శకత్వం వహించారు. వాటిలో ఆమెకు మంచి పేరు తెచ్చిపెట్టిన చిత్రాలు - మోహిత్యాంచీ మంజుల (1962), మరాఠా తితుకమేలహావా (1964), సథీమార్సే (1965), తంబ్డీమాతీ (1969). - క. ఫే.



తన సినిమాలలో పాటలకు అత్యంత ప్రాధాన్యమిచ్చే రాజ్‌కపూర్, పాట రికార్డింగ్‌లో పాల్గొంటూ...

అదే సినిమాలో 'రామయ్యా వస్తావయ్యా' బృందగీతం ఆడియన్స్ మనస్సులను ఉయ్యాల లూపివేసింది.

శం-జైల కన్న లతా జూనియర్లే అయినా ఆమె కీర్తివ్యాప్తికి అధికంగా తోడ్పడినవారు వారే అనేది అక్షరసత్యం. శంకర్, జైకిషన్లు విడిపోయాక కూడా ఇద్దరూ అదే పేరుపై సంగీతాన్ని అందించేవారు. శంకర్ శారద అనే కొత్త గాయికను చాలా ప్రోత్సహించారు. అయినా ఫిలింజగత్తులో లతా ప్రాధాన్యం ఎంతమాత్రమూ తగ్గలేదు. అందువల్లనే 'మేరానామ్ జోకర్' వైఫల్యం తర్వాత రాజ్‌కపూర్ 'బాబీకై శంకర్‌ను వదులుకుని లతా వైపు మొగ్గు చూపవలసివచ్చింది.

'బాబీ' నవయువతీయువకుల ప్రేమగాథ.



'సూరజ్' సినిమాలో 'తిత్‌లే ఉడీ' పాటను తెరపై అభినయిస్తున్నది వైజయంతీమాల వంటి పెద్ద హీరోయిన్ అయినా సంగీతదర్శకుడు శంకర్ ఆమెకు శారద అనే కొత్త గాయనిచే పాడించారు. తాను సంగీతం అందించిన 'జీవితచక్రం' అనే తెలుగు సినిమాలో కూడా శారద చే పాడించారు శంకర్.

వైజయంతిమాల, పద్మిని వంటి హీరోయిన్లకు సూటయినట్లుగా డింపుల్ వంటి టీనేజర్ కథానాయికకు లతా గొంతు నప్పుతుందా అన్నది ప్రశ్న. నప్పకపోతే శంకర్‌ను బలి యివ్వడం వృథా అయినట్లే! రాజ్‌కపూర్ రిస్కు తీసుకున్నట్లు అనిపించినా ఇది ఆయన దూరదృష్టికి, సమయస్ఫూర్తికి నిదర్శన. 'బాబీ'లో లతా పాడిన పాటలన్నీ సెన్సేషనల్ హిట్స్. డింపుల్ వంటి చిన్నపిల్లకు కూడా లతా గొంతు చక్కగా అమిరింది. లతా ద్వారా ఆర్.కే. క్యాంపులోకి అడుగుపెట్టిన లక్ష్మీ-ప్యారే జంట పంట పండింది. శం-జై లకంటె ఎక్కువ పాటలు వారు లతా చే పాడించారు.

తనని ప్రత్యేకంగా అభిమానించే కంపోజర్స్ పాటలకే లతా అధికమైన జీవం పోసి పాడతారని అనుకోవడం విమర్శకుల అపోహ. ఏ పాట పాడినా, ఎవరికి పాడినా శక్తివంచన లేకుండా ఆ పాటకి సంపూర్ణ న్యాయం చేయడమే ఆమె ధ్యేయం. తన పాటలో పొరబాటున ఎక్కడేనా ఏ మాత్రం లోటు వాటిల్లినా ఆమె పడే వేదన ఎంతటిదో తెలుసుకోవడానికి ఎ.వి.యం. స్టూడియోలో లతా ముకేశ్‌లు పాడిన ఒక



'బాబీ' లో డింపుల్ కపాడియా వంటి టీనేజర్‌కు కూడా లతా గళం చక్కగా అమిరింది.

డ్యూయెట్ తాలూకు టేక్ సెలక్షన్‌లో సంగీతదర్శకుడు చిత్రగుప్త ఎదుర్కొన్న సందిగ్ధావస్థని వివరిస్తే చాలు.

ఆ టేక్ సెలక్షన్ సమయాన నేను అక్కడే ఉండడం తటస్థించింది. అప్పటిదాకా ఆ పాటని చేసిన టేకులన్నీ వేయించుకుని, మళ్లీ మళ్లీ విని రెండు టేకులు బాగున్నాయని చిత్రగుప్త ఎన్నుకున్నారు. ఆ రెండింటిలోను ఏది బెటర్ అనే విషయంలో చిక్కు వచ్చింది. ఒక టేకులో లతా ముకేశ్ లిద్దరూ పాడిన వైనం ఆయనకి నచ్చింది. మరో టేకు విన్న తరవాత అందులో లతా పాడిన భాగం మరీ బాగుందనిపించింది ఆయనకి. కానీ ఆ టేకులో ముకేశ్ పాడిన భాగంలో, గుర్తు పట్టినా అంతగా తెలియనంత కొరత తోచిందని ఒక ఆర్కెస్ట్రా మెంబరు సూచించారు. అందుకాయన 'అది అంతగా తెలిసే కొరత కాదు. ఈ టేకులో లతా పోర్షన్ చాలా అద్భుతంగా వుంది. బాగా వచ్చిన ఈ టేకుని మనం సెలక్టు చేయకపోతే ఆమె చాలా ఫీలయ్యే అవకాశం వుంది" అని ఆ టేకే ఎంచుకున్నారు. అప్పుడే తెలుసుకున్నాను - లతాది ఎంత పదునైన మెదడో, ఎంతటి సూక్ష్మభేదాలనైనా పసికట్టగల సామర్థ్యమో, పెర్‌ఫెక్షన్ కోసం ఆమె ఎంత తపిస్తారో!

శం-జైల లాగానే లతాకు మంచిపాటలు సమకూర్చిన కంపోజర్ సి.రామచంద్ర. ఆయన లతా చేత పాడించిన పాటలు భావరాగలయతాళ

### సినిమా నిర్మాణంలో లతా

సినీసీమలో సంపాదించినది ఆ రంగంలోనే పెట్టుబడి పెట్టాలన్న చాలామంది కళాకారుల్లో ఉంటుంది. లతా కూడా దానికి మినహాయింపు కాదు. ఆమె మరాఠీ చిత్రాలు కొన్నిటిని నిర్మించారు. 1953వ సంవత్సరంలో వాడాల్, జాంజార్ అనే రెండు సినిమాలను ఆమె నిర్మించారు. ఆ రెండూ బాగానే ఆడాయి. కాంచన్(1955) ఫర్వాలేదనిపించింది. పెద్ద బజెట్ అయినా తెగించి హిందీలో 'లేకిన్'(1990) నిర్మించారు. ఆశించిన స్థాయిలో ఫలితాలు రాలేదు. ఇప్పట్లో ఇంకోటి తీసే ఆలోచన ఉన్నట్టు లేదు.

### ఏ మేరే వతన్‌కే లోగో...



పాటవిని కంట తడిపెట్టిన నెహ్రూ

రచన: - ప్రదీప్
సంగీతం:- సి.రామచంద్ర

ఏ మేరే వతన్‌కే లోగో తుమ్ ఖూబ్
లగావో నారా యే శుభ్ దిన్ హై హమ్ సబ్ కా
లహరే తిరంగా ప్యారా
పర్ మత్ భూలో సీమా పర్
వీరోంనే ప్రాణ్ గవాయీ కుఛ్ యాద్ ఉన్హే భీ కర్‌లో
కుఛ్ యాద్ ఉన్హే భీ కర్‌లో జో లౌట్ కే ఘర్ నా ఆయే
ఏ మేరే వతన్‌కే లోగో జర్ ఆంఖ్ మే భర్‌లో పానీ
జో షహీద్ హుయే హై ఉన్‌కీ
జర యాద్ కరో కుర్‌బానీ ॥ఏ॥
జబ్ ఘాయల్ హువా హిమాలయ్
ఖతరేమే పడీ ఆజాదీ జబ్ తక్ థీ సాస్ లడే వో ॥జబ్॥
ఫిర్ అప్‌నీ లాశ్ బిఛాయే సంగీన్ పే ధర్ కర్ మా కా
సో గయె అమర్ బలిదానీ
జో షహీద్ హుయే హై ఉన్‌కీ జర్ యాద్ కరో కుర్‌బానీ
జబ్ దేశ్ మే థీ దీవాలీ వో ఖేల్ రహే థే హోలీ
జబ్ హమ్ బైఠే థే ఘరోంమే ॥జబ్॥
వో ఝేల్ రహే థే గోలీ
థే ధన్య జవానో అప్‌నీ థీ ధన్య వో ఉన్‌కీ జవానీ
జో షహీద్ హుయే హై ఉన్‌కీ
జర యాద్ కరో కుర్‌బానీ ॥ఏ॥
కోయీ సిఖ్ కోయి జాఠ్ మరాఠా ॥కోయీ॥
కోయీ గుర్ ఖా కోయి మద్ రాసీ ॥కోయీ॥
సర్‌హద్ పర్ మర్‌నే వాలా ॥సర్॥
హర్‌వీర్ కా భారత్ వాసీ
జో ఖూన్ తేరా పర్ వత్ పర్ జో ఖూన్ థా హిందుస్థానీ
జో షహీద్ హుయే హై ఉన్‌కీ జర యాద్ కరో కుర్ బానీ
థీ ఖూన్ సే నత్ పత్ ఖాయా ఫిర్ భీ బందూక్ ఉఠాయే
దస్ దస్‌కో ఏక్ నే మారా ఫిర్ గిర్ గయే హోష్ గవాకే
జబ్ అంత్ సమయ్ ఆయా తో ॥జబ్॥
కహ్ గయే కీ అబ్ మర్ తే హై ॥జబ్॥
ఖుష్ రహనా దేశ్ కే ప్యారో ॥ఖుష్॥
అబ్ హమ్ తో సఫర్ కర్ తే హై ॥అబ్॥
క్యా లోగ్ థే వో దీవానీ క్యా లోగ్ థే వో అభిమానీ
జో షహీద్ హుయే హై ఉన్‌కీ జర యాద్ కరో కుర్ బానీ
తుమ్ భూల్ న జావో ఉన్ కో ఇస్ లియే కహీ ఏ కహానీ
జో షహీద్ హుయే హై ఉన్‌కీ జర యాద్ కరో కుర్ బానీ
జై హింద్ జై హింద్ కీ సేనా ॥2॥ జై హింద్ ॥3॥

'ఐ మేరే వతన్ కే లోగో' అనే గీతాన్ని పాడి ఆనాటి ప్రధాని నెహ్రూచేత కూడా కన్నీరు కార్పించిన గళం లతా దైతే, ఆ గేయానికి హృదయాన్ని కరిగించే విధాన మట్టుకటిన ఘనత సి.రామచంద్రది.

'అనార్కలి' లోని గీత ప్రాశస్త్యానికి నిస్సంశయంగా జీవనజీవప్రదం - లతా గానం, సి.ఆర్.ప్రతిభ. అయితే ఆశ్చర్యం ఏమిటంటే మొదట్లో సి.రామచంద్ర 'అనార్కలీ'కి సంగీతదర్శకత్వం వహించడం ఇష్టపడక పోయినా, లతా పట్టుపట్టడం వల్ల చివరికి అంగీకరించవలసి వచ్చిందట.

కానీ ఈ స్నేహభావం తరువాతి దినాలలో కనబడలేదు. వి.శాంతారామ్ "స్త్రీ" చిత్రంలో 'ఓ నిర్దయీ ప్రీతమ్' అనే గీతంలో లతా అతిభావయుక్తంగా పాడారు. లతా రామచంద్రల మధ్య కొన్ని భేదాభిప్రాయాలు పుట్టుకొచ్చేసరికి, లతాయే పాడవలసిన పాటలు కొన్ని సి.రామచంద్ర ఇతరులచే పాడించక తప్పలేదు. ఆయన పాటలు శంషాద్ బేగం మొదలుకుని ఆశావరకు ఎందరో పాడినా ఆయన హృదయంలో లతా గానానికి



స్వయంగా పాడగలిగి కూడా, మార్కెట్ డిమాండ్ దృష్ట్యా రఫీ, తలత్‌లతో లతా యుగళాలు పాడించిన అసమాన కంపోజర్, సి.(చితల్కర్) రామచంద్ర

సంపూర్ణస్థానం. అలా అని ఏ గీతానికీ ఆయన సగం మనస్సుతో కంపోజ్ చేయలేదు. "నవ్‌రంగ్"లోని 'ఆధా హై చంద్రమా', 'తూ ఛుపీ హై కహా' గీతాలలోని గాయని ఆశాభోంస్లే!

సి.రామచంద్ర బొంబాయి నివాసం పేరు 'సరిగమ్' (సరిగమ). వారింటికి నేను వెళ్లినప్పుడు వారి షిర్డీసాయి పూజామందిరంతో సహా ఇల్లంతా చూపించారు. 'దీనికి సరిగమల పేరు పెట్టారు సరే, పూనాలో కాబోసు, మీ



'అనార్కలి' లో బీనారాయ్, ప్రదీప్‌కుమార్

రెండో ఇంటికి పేరేం పెడతారు? 'పదనిస' అనా?" అన్నాను నవ్వుతూ. 'నా సంగీతయాత్ర సరిగమల వరకే సాగింది కానీ సంపూర్ణయాత్రగా సంభవించలేదు.' అనే భావం స్ఫురించేట్లా నవ్వి ఊరుకున్నారు. లతాచే ఇంకా కొన్ని పాటలు పాడించి వుంటే ఎలా ఉండేదో!

- పి.బి.యస్.

స్వరరత్నాల మూటలు. రామచంద్ర ఒక విచిత్రవ్యక్తి ఆయనది అమోఘమైన స్వరరచనా శక్తి. ఆయన కేవలం సంగీతదర్శకుడే కాదు, చితల్‌కర్ అనే పేరున పాడే మంచి గాయకుడు కూడా. అనేక స్టంటు సినిమాలకు అన్నాసాహెబ్ అనే పేరుతో సంగీతం ఇచ్చాడు. అయినా ఆయన సి.రామచంద్రగానే ప్రసిద్ధుడు.

ఆయన లతా కాంబినేషన్లో వెలువరించిన పాటలన్నీ స్మృతిపథంలో రీంకారం సలిపే స్థాయి గలవి. హార్దికతా, ఆత్మీయతా పరాకాష్ఠ నందుకున్న గీతం - జాన్ నిసార్ అఖ్తర్ రాసిన 'ఆంఖోంమే సమ్‌జావో ఇస్ దిల్‌మే రహ్ కర్‌నా' ("యాస్మిన్") అని సాగే భావమాధుర్యశిల్పం. రంజన్ నాయకుడిగా నటించిన 'శిన్‌శినాకీ బబ్‌లాబూ' అనే సినిమాలోని 'తుమ్ క్యా జానో తుమ్హారీ యాద్ మే హమ్ కిత్‌నా రోయే' అపూర్వస్వరభావ సంగమం.

"అనార్కలీ" చిత్ర ఘనవిజయానికి ప్రత్యేక కారణం వీరిద్దరి సమిష్టికృషి. 'ఆజా అబ్‌తో ఆజా', 'జాగే దర్ద్ ఇశ్క్ జాగ్' (హేమంత్‌కుమార్‌తో) 'ముఝ్‌సే మత్ పూఛ్' వంటి పాటలన్నీ హిట్లయినా లతా సోలో 'యే జిందగీ ఉసీకీ హై, జో కిసీకా హోగయా'' మకుటాయమానం. 'మొహబ్బత్ ఐసీ ధడ్‌కన్ హై' వంటి సంగీతరచన, తగిన గానప్రదర్శన లేకపోతే నీరసం అయిపోయివుండేది.

'సర్‌గమ్', 'సంగ్రామ్', 'పర్‌ఛాయీ', 'ఝూంఝుర్', 'నాస్తిక్' 'పహ్‌లీ నజర్' 'తీరందాజ్' 'దేవ్‌తా', 'బారిశ్', 'శార్‌దా' - ఇలా ఎన్నో విజయవంతమైన చిత్రాల ద్వారా సుమధుర సురుచిర సంగీతం అందించింది లతా-రామచంద్ర కాంబినేషన్. 'నౌశేర్ వా ఆదిల్' అనే సినిమాలో 'భూల్ జాయే సారే గమ్' లతా రఫీల యుగళగీతం పాట పల్లవి లాగే అత్యున్నతస్థాయిలో సాగింది.

ఎస్.ఎమ్.ఎస్.నాయుడు గారి 'ఆజాద్'

## లతాను తొలిదినాల్లో ప్రోత్సహించిన హుస్న్‌లాల్ - భగత్‌రామ్

సోదరద్వయం సంగీతం అందించడం హిందీసీమలో హుస్న్‌లాల్, భగత్‌రామ్‌లతో ప్రారంభమయింది. 1944లో ఈ జంట 'చాంద్' సినిమాతో తమ సంగీతయాత్ర మొదలుపెట్టినా ఇద్దరిలో పెద్దవాడైన భగత్‌రామ్ బాతిష్‌కు అంతకుముందే సినీసీమతో పరిచయం ఉంది. మాధవ్‌లాల్ మాస్టర్ అనే ఆయనతో కలిసి మాధవ్‌లాల్-భగత్‌రామ్ పేరుతో సంగీతం అందించాడు.

'చాంద్'సినిమాలో బేగం పారా, ప్రేమ్ అదీబ్, సితారా, స్వప్రా ప్రముఖులు నటించగా రోషనారా బేగమ్, గులాం ముస్తఫా దుఱ్ఱానీ వంటి మేటిగాయకులు పాడారు. జీనత్ బేగమ్ పాడిన 'క్యా యహీ జవానీ హై..' పాట చాలా హిట్ అయింది. జీనత్ ఈ సోదరద్వయం పెద్దన్న గారైన పండిట్ అమర్‌నాథ్ సంగీతదర్శకత్వంలో 'పాపి' (1943)లో 'పట్ రఖో గిర్‌ధారీ, మోరీ పట్ రఖో గిరిధారీ..'పాట పాడి ఎంతో ఖ్యాతి గడించిన గాయని.

ప్రఖ్యాత మ్యూజిక్ డైరక్టరు ఖయ్యాం వారి గురించి చెబుతూ, "వారు నా గురువులు. నేను పంజాబ్ నుండి పొట్ట చేత్తో పట్టుకుని బొంబాయి చేరినప్పుడు వాళ్లు నాకు తిండి పెట్టడమే కాక బతుకు తెరువు చూపించారు కూడా. బాంబే సినిమాలకు పంజాబీతనాన్ని తెచ్చారు వారు. 'బడీ బెహన్', 'ప్యార్ కీ జీత్' సినిమాలు వారి ప్రతిభను చాటి చెబుతాయి. ఎమోషనల్ పాటలు వీరి ట్రేడ్‌మార్కు అయిపోయాయి." అన్నారు.

హుస్న్‌లాల్ - భగత్‌రామ్ లతా మంగేష్కర్, మహమ్మద్ రఫీలకు ట్రెయినింగ్ ఇచ్చి పాడించి తామూ లబ్ధి పొందారు. 'ఏక్ దిల్ కే టుకడే హజార్ హుయే, కోయీ యహా గిరా, కోయీ వహా గిరా' ('ప్యార్ కీ జీత్'), 'మొహబ్బత్ కే ధోకే మే, కోయీ న ఆయే, కోయీ న ఆయే, వో ఏక్ దిన్ హసాయే తో సౌ దిన్ రులాయే' (జల్ తరంగ్), 'దునియా హై బర్‌బద్ దిల్ కీ' (మీనా బజార్) వంటి పాటల్లో రఫీ పలికించిన విషాదం



మరువరానిది. లతాతో సుమారు వందపాటలు పాడించి ఆమె కెరియర్‌కి ఎంతో దోహదపడ్డారు.

కాని 1955 ప్రాంతాలకు వచ్చేసరికి వారి ప్రాభవం తగ్గిపోయింది. శంకర్‌జైకిషన్ వంటి యువసంగీతదర్శకులు శ్రోతలకు కొత్త రుచులను అలవాటు చేశారు. ఆ ఝుంఝూమారుతంలో హుస్న్‌లాల్ సోదరులు వెనకబడ్డారు. పెద్దబ్యానర్లు చేజారి బి-గ్రేడ్ సినిమాలు 'ట్రాలీ డ్రైవర్', 'టార్జాన్ అండ్ ద సర్కస్' వంటి సినిమాలే వారికి దక్కాయి. వారి చివరిచిత్రం షమ్మీ నటించిన 'షహీద్ భగత్‌సింగ్' (1963). లౌక్యం ప్రదర్శించి, నిర్మాతలను పొగిడి, కెరియర్ వృద్ధి చేసుకునే తెలివితేటలు వారికి లేకపోవడం శ్రోతల దురదృష్టం. లేకపోతే 'హో మేరీ తరఫ్ యూ చలే ఆ రహే హై' (కిశోర్ - కఫీలా(1952), 'కిస్మత్ బిగ్‌డీ దునియా బద్‌లీ' (ముకేశ్-అఫ్‌సానా(1951) వంటి పాటలెన్నో వినగలిగేవారం.

- కమ్యూనికేటర్ ఫీచర్స్

చిత్రంలో మీనాకుమారి, దిలీప్‌కుమార్లపై లతా, రామచంద్రలు పాడిన 'కిత్‌నా హసీ హై మౌసమ్' చిత్రీకరించబడి ఆల్‌టైమ్ హిట్‌గా విజృంభించింది. అసలు లతా-తలత్‌లు పాడవలసిన ఆ పాట, అర్జంటుగా చిత్రీకరింపబడవలసిన సందర్భాన తలత్ కాల్‌షీట్ ఇవ్వలేకపోవడం వలన రామచంద్ర తానే స్వయంగా తలత్ బాణీలో చాల మృదుమధురంగా పాడి రక్తి కట్టించారు.

లతతో చితల్‌కర్ పేరుతో రామచంద్ర చాలా డ్యూయెట్లు పాడారు. నిజానికి అన్నీ ఆయనే పాడగలరు కానీ సంగీతరచనపై ఎక్కువగా దృష్టి కేంద్రీకరించవలసిన పరిస్థితి. ఫిలిం మార్కెటులో చాలామంది సంగీత దర్శకులు నెంబరు వన్ స్థాయికి ఎదగాలని పోటీ పడుతున్న రోజులు. అందువలన కొన్ని పాటలు లతతో పాడడానికి ఇతర పురుష కంఠస్వరాలని కూడా ఎన్నుకుని, తనకంటె బాగా పాడే రీతిగా ప్రోత్సహించి పాడించారు. ఆ విధంగా రఫీ, తలత్‌లు రామచంద్రకు చాలా పాటలు పాడారు. 'అల్‌బేలా'లో 'మెహఫిల్ మే మేరీ కౌన్ యే దీవానా ఆగయా' అని లతాతో రఫీ పాడిన యుగళగీతం, తలత్ లతాతో పాడిన 'గయా అంధేరా హువా ఉజాలా' 'సుబహ్ కా తారా' చిత్రంలోని యుగళగీతం లాంటి హిట్ సాంగ్సు ఎన్నో రసికశ్రోతలకి దక్కాయి.

(ఇంకా ఉంది)

# జయ్ సంతోషిమాతా వివాదంలో కవికే జయం

'ఐ మేరే వతన్ కే లోగో..'
'చల్ చల్ రే నౌజవాన్..'
'దూర్ హటో వో దునియా వాలో..'
'దే దీ హమే ఆజాదీ..'

వంటి స్ఫూర్తిదాయకమైన పాటలు రాసిన దివంగతకవి ప్రదీప్ స్మృతికి మన్నన కలిగించే సంగతి గత సెప్టెంబరు 11న జరిగింది. 'జయ్ సంతోషిమాతా' టీవీ సీరియల్ థీమ్‌సాంగ్ పై ఏడాదిగా సాగుతున్న వివాదానికి ఆ రోజున తెరపడింది. సీరియల్ నిర్మాతలు దిగివచ్చి పాట రాసిన ప్రదీప్ కాపీరైటును గుర్తించడమే కాక ఫిలిం రైటర్స్ అసోసియేషన్ వారికి 50 వేల రూపాయలు చెల్లించారు. పట్టుదలతో కడదాకా పోరాడిన ప్రదీప్ కుటుంబానికి ఇది ఘన నైతిక విజయం. ఈ సంఘటన పూర్వాపరాలు -

1975 లో సత్‌రామ్ రోహ్రా అనే నిర్మాత 'జయ్ సంతోషి మా' సినిమాను నిర్మిస్తూ పాటలు రాయవలసినదిగా ప్రదీప్‌ను కోరాడు. నీవంటి చిన్న నిర్మాత నా ఫీజు ఇచ్చుకోలేడంటూ ప్రదీప్ ఆ ఆఫర్‌ను తిరస్కరించాడు. సంగీతదర్శకుడు గా నియమితుడయిన సి.అర్జున్ కలగజేసుకుని, "ప్రస్తుతానికి పదివేలు తీసుకుని రాయండి. సినిమా సక్సెసయితే నిర్మాత తక్కినది ఇస్తాడు." అని ప్రాధేయపడ్డాడు. ఆయన మాట కాదనలేక ప్రదీప్ పాటలు రాసిచ్చాడు.

'షోలే'తో పాటు రిలీజయిన 'జై సంతోషిమా' సినిమా బాక్సాఫీసు బద్దలు కొట్టింది. టైటిల్ సాంగ్ సంగతి చెప్పనే అక్కరలేదు. ఆ పాట పాడనిదే ఏ మతసంబంధమైన కార్యక్రమం జరగనంత ఇదిగా పాప్యులర్ అయింది.ఒళ్లో కనకవర్షం కురిసినా, ప్రదీప్‌కు తక్కిన డబ్బు ఇద్దామన్న ఆలోచన నిర్మాతకు రాలేదు. నోరు విడిచి అడగడానికి కవిగారికి మొహమాటం అడ్డు వచ్చింది.

సంగతి ఇక్కడితో ఆగితే బాగుండును. నిర్మాతగారు ఆ పాట హక్కులను మాజీనటుడు, ప్రసిద్ధ టీవీ సీరియల్ నిర్మాత, దర్శకుడు ధీరజ్‌కుమార్ క్రియేటివ్ ఐకు అమ్మేశాడు. నిర్మాతగా రూబీ కొచార్, దర్శకుడుగా ధీరజ్‌కుమార్ పేర్లతో సీరియల్ ప్రారంభమయింది. ప్రదీప్ సినిమాకై రాసిన విషయం ఎక్కడా ప్రస్తావించకుండా థీమ్‌సాంగ్ 'జై సంతోషిమాతా' వాడుకోసాగారు. డిసెంబరు, 2001 లో ప్రదీప్ కుటుంబసభ్యులు ఓ సారి టీవీ చూస్తూండగా ఈ పాట విని ఉలిక్కిపడ్డారు. అప్పటికే ప్రదీప్ స్వర్గస్తులయి మూడేళ్లయింది. పాట వాడుకోడానికి ఆయన భార్య భద్ర (81 సం.లు) అనుమతి తీసుకోవాలి కదా!



భార్యతో ప్రదీప్

ప్రదీప్‌కు ఇద్దరు కూతుళ్లు. సర్‌గమ్, మిత్తల్. తండ్రి గౌరవాన్ని రక్షించే బాధ్యత మిత్తల్ చేబట్టింది. ధీరజ్‌కుమార్‌కు ఉత్తరం రాసింది, మా నాన్నగారి లిరిక్స్ వాడేందుకు ఏదైనా ఒప్పందం తీసుకోవాలి కదా, ఆయన పేరు వేయాలి కదా అని. సమాధానం లేదు. దాంతో ఒళ్లుమండి ఫిలిం రైటర్స్ అసోసియేషన్‌కు, ఇండియన్ మోషన్ పిక్చర్స్ ప్రొడ్యూసర్స్ అసోసియేషన్‌కు, దరిమిలా ఇండియన్ పెర్‌ఫామింగ్ రైట్స్ సొసైటీకి పిటిషన్లు పంపింది.

ఫిలిం రైటర్స్ అసోసియేషన్ వారు మీటింగు ఏర్పాటు చేసి ధీరజ్‌కుమార్ని రమ్మన్నారు. ధీరజ్ లెక్కచేయలేదు. తన బదులు ఎవర్నో ప్రతినిధిని పంపేవాడు. ఇలా మూడుసార్లు జరిగాక అసోసియేషన్ వారు 'సినిమాకై రాసిన పాటను అనుమతి లేకుండా బయట వాడడానికి వీలులేదు' అని తీర్మానించారు. అప్పుడు ధీరజ్ దర్శనమిచ్చాడు. తాను 'జై సంతోషిమాతా' సినిమా నిర్మాతనుండి ట్రాక్ మొత్తం 48 వేలకు కొన్నానని తెలిపాడు. రైటర్‌కుండే ఇంటలెక్చువల్ కాపీరైట్ సంగతి ధీరజ్ విస్మరించినట్టుంది.

అప్పుడు నిర్మాతల సంఘాలు చొరవచూపి ధీరజ్‌కు నచ్చచెప్ప బోయాయి. ధీరజ్ లొంగకపోగా మిత్తల్‌పై పరువునష్టం దావా వేశాడు. దాంతో ప్రదీప్ కుటుంబం కోర్టు కెక్కవలసి వచ్చింది. ఈ లోపున సీరియల్ నిరాఘాటంగా సాగింది. టైటిల్స్‌లో ప్రదీప్ క్రియేటివ్ ఐకై రాసినట్టు కనబడుతోంది కానీ వేరేవారికై రాసిన పాటను తాము వాడుకుంటున్నట్టు ఎక్కడా తెలుపలేదు. ఈ దారుణం ఆపమంటే హైకోర్టు స్టే ఇవ్వలేదు. 'డబ్బుకోసం కాదు, మా పోరాటం, గౌరవం కోసం. చనిపోయినంత మాత్రాన మనిషి సృజనాత్మక కళాసృష్టిని ఎవరు బడితే వారు చిత్తమొచ్చినట్టు వాడుకోవచ్చా?" అన్న మిత్తల్ ప్రశ్నకు కోర్టు వద్ద సమాధానం లేదు.

సుమారు ఏడాదిపాటు కేసు నడిచాక ప్రతివాదులైన జీ టెలిఫిలింస్, క్రియేటివ్ ఐ, సంత్‌రామ్ రోహ్రా దిగివచ్చారు. ప్రదీప్ కుటుంబంతో రాజీకొచ్చి సమ్మతిపత్రాన్ని కోర్టుకు దాఖలు చేశారు. దాని ప్రకారం ప్రదీప్ కాపీరైట్ హక్కును గుర్తించడమే కాక, ఫిలిం రైటర్స్ అసోసియేషన్‌వారికి 50 వేల రూపాయలు విరాళమిస్తానన్నారు. తండ్రి గౌరవప్రతిష్టలకై పోరాడిన మిత్తల్ చేతులమీదుగానే ఆ చెక్కు అసోసియేషన్‌కు అందజేశారు.

- కమ్యూనికేటర్ ఫీచర్స్

## కొంటెకొశ్చన్లు - తుంటరి జవాబులు




**జి.రమేష్ -రుక్మాపూర్**

ప్ర: పాజిటివ్ అవుట్‌లుక్ అంటే!?

జ: కన్నీళ్ళు పెట్టుకుంటున్న పెళ్ళాంతో 'అవి ఆనందభాష్పాలు కదూ!?' అంటూ జోకెయ్యడం.

**వై.శశిరేఖ సాయిబాబా - ఏలూరు.**

ప్ర: కొత్త చెప్పులు కరవకుండా ఉండాలంటే!?

జ: కొన్న వెంటనే డెంటిస్ట్ దగ్గరికి తీసుకెళ్ళి పళ్లు పీకించెయ్యాలి

**ఆదిరాజు & చక్రపాణి - రుద్రారం.**

ప్ర: విచిత్ర గాయకుడనగా...

జ: వేలం పాటకు కూడా ఆర్కెస్ట్రా ఉండాలని కోరుకునేవాడు.

## ఈ రూటేవేరు




చార్వాకుడు = నాలుగు గంటలకే లేచి నడిచేవాడు

**- భమిడిపాటి వెంకటేశ్వరరావు, చందానగర్**

Sky సరస్వతి = ఆకాశవాణి

Branch Food = శాఖాహారం

Fruit Garlend = ఫలహారం

**- పి.యం.ఆచారి, మౌలాలీ.**



## చిలిపి లిపి

Play 2 = ప్లేటు

धो మ = దోమ

2 मारो = టుమారో

**- వై.కీర్తిసాగర్, ఏలూరు.**




## పేరు - రిపేరు

అక్కడ అమ్మాయి ఇక్కడ అబ్బాయి - ఈడూజోడూ - ప్రేమించిచూడు

అనగనగా ఒకరోజు - ఒక రాజు ఒక రాణి - ఔను వాళ్లిద్దరూ ఇష్టపడ్డారు

**- కె.యస్.రామారావు, విజయనగరం.**

అమ్మనాన్న ఓ తమిళమ్మాయి - ఇదీ మా అశోక్‌గాడి లవ్‌స్టోరీ

రాఘవేంద్ర - బాబా - దేవుళ్ళు

**- వై.ధీరజ్‌కుమార్, నందిగామ.**



## డబుల్ రోల్




ఆ **పర్పుల్** కలర్ **పరుపులు** బావున్నాయి కదూ!?

ఎన్నికలు సమీపించే **లోపే** మన పార్టీ బ**లోపే**తం కావాలి.

**- బి.వరహాలరావు, చందానగర్.**

**గారె**లు తినే పోటీలో నెగ్గింది అయ్య**గారె**

**- వై.క్రాంతిసాగర్, ఏలూరు.**

కుక్క **తోకతో** కరుస్తుందా!?

**- వై.శశిరేఖ సాయిబాబా, ఏలూరు.**

మధ్యతరగతి వాళ్ళు **తమతమ** పనులవ్వక స**తమతమ**వుతూనే వుంటారు.

**- బి.వి.ఆర్., రుద్రారం.**

## పేరడీ పేరేడ్




ప: భలేమంచి కూర, పసందైన కూర
మసాలాతో నిండే కోడి కూర... ఆ... అయ్
మసాలాతో నిండే కోడి కూర

చ: ఇంటిలోని అందరి మనసు
వంటగదికిలాగే కూర
వంటలోని ఘుమ, ఘుమ లన్నీ
వీధి నిండ నింపే కూర
చూడగానే నోరూరిస్తూ
వేడి, వేడిగా ఉండే కూర ॥ భలే॥

చ: అల్లమింత, వెల్లుల్లింత
ముద్దనూరి కూరిన కూర
లవంగాలు, దాల్చిన చెక్క
గుండ కొట్టి కలిపిన కూర
గసగసాల పేస్టును చేర్చి
ఘాటు, ఘాటుగా వండిన కూర ॥భలే॥

**-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం**

**('జరిగినకథ' చిత్రంలో "భలేమంచిరోజు" పాటకు పేరడీగా)**

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| హారాల సంతోష్ | } | **హాసం** |
| జోగి కుసుమ లత | | **జోకుల** |
| సంబరాల గీత తపస్విని | | **సంగీత** |
| పప్పు త్రిగుణాకర్ | | **పత్రిక** |

**- తెలికచర్ల రామకృష్ణ, విజయనగరం.**

హరికీర్తనల రోహిత్ = హలో
బైరెడ్డి భైరవమూర్తి = బైబై

**- వరయోగి రామ్మోహనరావు, సికింద్రాబాద్.**

## చిలిపి కవిత




రోజూ తప్పదు చతుర్ముఖ పారాయణం
అప్పడప్పడు మద్యంలో ధూమ పానం
ఓడినప్పడల్లా ఆలితో అసత్య సంభాషణం
అప్పడు నెలకొంటుంది ఇంట్లో రణ వాతావరణం
అది మరచుటకు మళ్ళీ మద్యపాన సేవనం
అ కిక్కులో ఎర్రదీపాల ఏరియాలకు పయనం
చివరకు మిగిలేది ఓ చిన్న కౌపీనం
దాంతో ఇంకేముంది
బ్రతుకు హీనాతి హీనం - దీనాతి దీనం

**- తెలికిచెర్ల రామకృష్ణ, విజయనగరం.**

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

**తమిళం**
చిత్రం : అవళ్ ఒరుతొడర్ కదై
రచన : కణ్ణదాసన్
సంగీతం : ఎం.ఎస్.విశ్వనాథన్
గానం : ఎస్.జానకి

**తెలుగు**
చిత్రం : అంతులేని కథ
రచన : ఆచార్య ఆత్రేయ
సంగీతం : ఎం.ఎస్.విశ్వనాథన్
గానం : ఎస్.జానకి

**'అవళ్ ఒరు తొడర్ కదై' తమిళ చిత్రం కోసం ఎస్.జానకి పాడిన 'కణ్ణిలే ఎన్న ఉణ్తు కణ్‌గళ్‌తాన్ అఱియుమ్' అనే పాట - ఆ చిత్రంలోని మరికొన్ని పాటలలాగానే విశేషాదరణ గడించింది. కథానాయిక మనోభావాలను వెల్లడించే ఈ పాట సన్నివేశం 'అంతులేని కథ' చిత్రంలోనూ ఉంది. తెలుగు చిత్రంలోని పాటనూ జానకి పాడారు.**

**ముందుగా కణ్ణదాసన్ రాసిన ఆ తమిళ గీతం:**

కణ్ణిలే ఎన్న ఉణ్డు
కణ్‌గళ్‌తాన్ అఱియుమ్
కల్లిలే ఈరమ్ ఉణ్డు
కణ్‌గళా అఱియుమ్
ఎన్ మనమ్ ఎన్న వెన్ఱు
ఎన్నై యన్ఱి యారుక్కు త్తెరియుమ్ ॥కణ్ణిలే॥

నెరుప్పెన్ఱు శొన్నాల్ నీరిలుమ్ అణైయుమ్
నీరెన్ఱు శొన్నాల్ నెరుప్పిలుమ్ వేగుమ్
నాన్ కొణ్డ నెరుప్పు అణైగిన్ఱ నెరుప్పు
యార్ అణైప్పారో ఇఱైవనిన్ పొఱుప్పు
ఎన్ మనమ్ ఎన్న వెన్ఱు
ఎన్నై యన్ఱి యారుక్కు త్తెరియుమ్ ॥కణ్ణిలే॥

శేలైక్కుళ్ ఆడుమ్ మంగైయిన్ మేని
మేనిక్కుళ్ ఆడుమ్ మనమెనుమ్ జ్ఞాని
జ్ఞానియిన్ మనముమ్ ఆశైయిల్ తేనీ
నాన్ ఒరు రాణీ పెణ్గళిల్ జ్ఞాని
ఎన్ మనమ్ ఎన్న వెన్ఱు
ఎన్ నై యన్ఱి యారుక్కుత్ తెరియుమ్ ॥కణ్ణిలే॥

కోడైయిల్ ఓర్ నాళ్ మళై వరక్కూడుమ్
కోవిల్ శిలైక్కుమ్ ఉయిర్ వరక్కూడుమ్
కాలంగళాలే కారియమ్ పిఱక్కుమ్
కారియమ్ పిఱన్దాల్ కారణమ్ విళంగుమ్
ఎన్ మనమ్ ఎన్న వెన్ఱు
ఎన్ నై యన్ఱి యారుక్కుత్ తెరియుమ్ ॥కణ్ణిలే॥

**తమిళ గీతానికి భావానువాదం :**

కన్నులలో ఏముందో
కళ్లకే తెలుస్తుంది
రాతిలో తడి ఉంటుంది (అని)
కళ్లకు తెలుసా
నా మనసు ఏమిటో
నాకు తప్ప ఎవరికి తెలుస్తుంది

నిప్పు అంటే నీటిలోనూ ఆరుతుంది
నీరు అంటే నిప్పులోనూ వేగుతుంది (కాగుతుంది)
నాలోని నిప్పు ఆరగల నిప్పు
ఎవరు ఆర్పుతారో దేవుడిదే బాధ్యత
నా మనసు ఏమిటో
నాకు తప్ప ఎవరికి తెలుస్తుంది

చీర లోపల ఆడేను మగువ మేను
మేనులో ఆడేను మనసనే జ్ఞాని
జ్ఞాని మనసు కూడా ఆశలో తేనెటీగే
నేను ఒక రాణిని స్త్రీలలో జ్ఞానిని
నా మనసు ఏమిటో
నాకు తప్ప ఎవరికి తెలుస్తుంది

వేసవిలో ఒకనాడు వాన రావచ్చు
కాలాల ద్వారా కార్యం పుడుతుంది
కార్యం పుడితే కారణం తెలుస్తుంది
నా మనసు ఏమిటో
నాకు తప్ప ఎవరికి తెలుస్తుంది



కథానాయిక - ఆమె కుటుంబసభ్యుల దృష్టిలో బండరాయి. ఆ రాతికి మనసు ఉండదని వాళ్ల అభిప్రాయం. అయితే పైకి రాయిలాగా కనిపించే తనలోనూ మనసుందనీ ఆ మనసు ఏమిటో తనకు తప్ప మరెవరికీ తెలియదనీ ఆమె చెబుతున్నది. తనలోనిది నిప్పయితే ఆరగలదనీ నీరయితే కాగగలదని చెబుతూ తనలోని అనలం ఆరగలదేననీ అంటుంది. అయితే ఆ నిప్పును ఆర్పగలవారెవరో దేవుడే నిర్ణయించాలంటుంది. కథానాయిక నిర్లిప్తతనంతా కణ్ణదాసన్ అక్షరబద్ధం చేసినట్టు కనిపిస్తుంది.

'అంతులేని కథ' కోసం
ఆచార్య ఆత్రేయ రాసిన పాట:

కళ్లలో ఉన్నదేదో కన్నులకే తెలుసు
రాళ్లలో ఉన్న నీరు కళ్లకెలా తెలుసు
నాలో ఉన్న మనసూ నాకుగాక ఇంకెవరికి తెలుసు

నీటిలో ఆరే నిప్పును కానూ
నిప్పున కాగే నీరైన కానూ
ఏదీ కానీ నాలో రగిలే
ఈ అనలాన్నీ ఆర్పేదెవరో ॥కళ్ళ॥

తానే మంటై వెలుగిచ్చు దీపం
చెప్పదు తనలో చెలరేగు తాపం
నే వెళ్లు దారి ఓ ముళ్లదారి
రాలేరు యెవరూ నాతో చేరి ॥నాలో॥

వేసవిలోనూ వానలు రావా
కోవెల శిలకు జీవం రాదా
జరిగేనాడే జరుగును అన్నీ
జరిగిననాడే తెలియును కొన్నీ ॥నాలో॥

















కథానాయికి సొగసైన చీరలు కడుతుంది. చీరలోపలి మేనులో మనసు ఒకటుంది. ఆ మనసు జ్ఞానంతో పరిపక్వమైంది. అయితే ఆ జ్ఞానికీ ఆశలున్నాయి. జీవన మకరందం కోసం ఆశించే తేనెటీగ అట ఆ జ్ఞాని మనసు. తాను రాణి అయినా స్త్రీలలో జ్ఞాని (వేదాంతి) అట. తక్కిన కుటుంబ సభ్యుల దృష్టిలో తాను రాణి అయినా తనకు మాత్రం తాను వేదాంత ధోరణిగల జ్ఞాని అట.

వేసవిలో వాన రావచ్చుననీ ఆలయంలోని శిలకూ జీవం రావచ్చుననీ ఆశిస్తుంది ఆమె. కాలగమనంలో పనులు జరుగుతుంటాయనీ ఫలితం వచ్చాక కారణమేమిటో తెలుస్తుందనీ చెబుతుంది. ఎప్పుడో ఒకప్పుడు తనకంటూ ఒక జీవితం ఏర్పడగలదనీ అప్పుడు తానూ సుఖపడగలదనీ ఆ పిచ్చితల్లి ఆశ.

వేసవిలోనూ వాన రావచ్చునని కణ్ణదాసన్ 'రాము' చిత్రంలోని 'నిలవే ఎన్నిడం నెరుంగాదే' పాటలో రాసిన 'కోడైయిల్ ఒరునాళ్ మళై వరలామ్' అనే పంక్తిని ఈ పాటలోని 'కోడైయిల్ ఓర్ నాళ్ మళై వరక్కూడుమ్' అనే పంక్తి గుర్తు చేస్తుంది. వ్యాకరణ రీత్యా 'ఓర్‌నాళ్' అనడం సబబు కాదు. 'ఒరునాళ్' అనాలి.

తమిళగీతంలో లేని సొగసులు ఉండడం వల్లా తమిళ గీతంలో కొంత అస్పష్టంగా ఉన్న భావాలు మరింత స్పష్టంగా ఉండడం వల్లా- 'అంతులేని కథ' కోసం ఆచార్య ఆత్రేయ రాసిన పాట వాసిలో మెరుగ్గా కనిపిస్తుంది.

తమిళ గీతంలో నాయికకు తనలో అనలం గురించి తెలుసు. అయితే తెలుగు పాటలోని నాయికకు తాను నీటిలో ఆరే నిప్పు కాదనీ నిప్పులో కాగే నీరు కాదనీ తెలుసు. తనలో రగిలే అనలాన్ని ఆర్పేదెవరో అని ప్రశ్నిస్తుంది. ఆత్రేయ ప్రతిభ అంతా ఆ తర్వాతి చరణంలో కనిపిస్తుంది. 'తానే మంటై వెలుగిచ్చు దీపం - చెప్పదు తనలో చెలరేగు తాపం' అనడం నాయిక స్థితిని చక్కగా వివరిస్తుంది. తాను కాలిపోతూ వెలుగునిస్తున్నది. తన వెలుగులో బతుకుతున్న వారికి తన తాపంతో నిమిత్తం లేదు. తన దారి ముళ్లదారి. ఆ దారిలో తనతో చేరి ఎవరూ రాలేదు. తమిళ గీతంలో లేని ఈ అభిప్రాయం- కథానాయికకు సంబంధించినంత వరకు భవిష్య సూచకమని చెప్పాలి. చివరిదాకా - అమెది తోడులేని ఒంటరి బతుకుగా సాగుతుందనే సూచన ఈ పంక్తుల్లో వ్యంగ్యంగా కనిపిస్తుంది.

'జరగవలసినప్పుడే జరుగుతాయి - ఆ జరిగినప్పుడు అన్నీ కాకపోయినా కొన్ని అయినా తెలుస్తాయి' అనడం ద్వారా ఆత్రేయ సాధించిన స్పష్టత తమిళగీతంలో లేదు.

పల్లవిలో పోలికలు కనిపించినా తమిళ గీతం బాణీలోనే తెలుగు పాట కూడా సాగినా ఆ పాటలో తమ వాణిని ప్రత్యేకంగా వినిపించడంలో ఆత్రేయ కృతకృత్యులయ్యారు.

- పి.ఎస్.గోపాలకృష్ణ

# బొమ్మల కొలువు


WEL COME
దసరా మామూళ్ళ వివరాలు -
దసరా మామూలు ఇస్తాను...ఇంటికి రమ్మనమని చెప్పింది... ఇందుకేనా మేడమ్....
దసరా మామూలు అడుగుదామని... మిమ్మల్ని కిడ్నాప్ చేసానంతే...సార్!
ముందు...నాకు మామూలు ఇచ్చేసి...నీ పని తాపీగా చేసుకోవోయ్....
దసరా వేషగాడనుకుని...తలుపు తీసాను...మావా...
సార్. దసరా మామూలు! మేడమ్...దసరా మామూలు...
కాస్త ఓర్చుకోవయ్యా... నా సాధన పూర్తికాగానే దసరా మామూలు ఇస్తానన్నానుగా....
నిన్ను పట్టుకోవడానికి కాదు లేవయ్యా... మగడా— మామూళ్ళ కోసం వచ్చాను! ఆగరా.....

# బొమ్మల కొలువు



అమ్మా... తల్లీ...! నాది దసరా వేషం! దసరా మామూలు కోసం వచ్చానంటే వినవేం...?!
రక్షించండి... కాపాడండి...




ఏడ్చినట్టే ఉంది... మనింటికి వచ్చేసారు... నేను మీ పెళ్ళాన్ని - ఇక ఆపండి...!
దసరామామూలు ఇవ్వండి.. మేడమ్




నా దసరా కవితలు విన్నారుగా -- ఎలా ఉన్నాయి.. సార్....!!
దసరా కవితలు
ఎడిటర్




అది దసరా వేషం కాదు... వడ్డీ ఎక్కువ వస్తుంది కదాని మొత్తం డబ్బంతా... 'గోవిందా' అర్బన్ బ్యాంక్‌లో డిపాజిట్ చేసాడట.. పాపం!




నమస్తే.. సార్! దసరామామూలు ప్లీజ్!




సార్.. మీ జూ నుండి - పులి తప్పించుకుని రోడ్లపై తిరుగుతోంది.. వెంటనే వచ్చి పట్టుకోండి....




దసరా మామూలు కోసం
MANAGER




మీ దసరా వేషం అదిరిందండీ.. ఆ నక్లెస్లు.. ఇంటి బీరువా తాళాలు.. ఆ వచ్చిన మామూళ్ళ డబ్బులతో నా బంగారు నగల ప్రక్కన డబ్బాలో పడేయండి !!
నేనింకా వేషం వెయ్యనే లేదే!

# 'సం' గీతా రహస్యాలు

పాటల్లో మాటలు లేకుండా, హమ్మింగు ల్లాంటివి కూడా వుంటాయి. 'అహా అహా' లాంటివీ, "హా-" అనీ 'ఓహోహో ఓహో' వంటివీ వుంటాయి. కొన్ని హమ్మింగ్‌లు పెదవులు మూయబడి, వినిపిస్తాయి, నాసికా స్వరంతో ఇవి కాకుండా, పాటలో ఏదైనా ఊతం కావలసి వస్తే 'లల్లల్లల్లాలు'' చోటు చేసుకుంటాయి, సాహిత్యానికి బదులు. "లల్లల్లాం లల్లల్లాం లక్కీ ఛాన్సులే'' అని కొసరాజుగారు "లల్లల్లా" అంటూ పాట రాశారు. సాహిత్యం తట్టక కాదు- ఊపు కోసం" అని చెప్పారాయన.

'భక్తపోతన'(1942)లో 'మా వదిన సుకుమారీ వదినా' అని పాట వుంది. (నాళం వనజా గుప్త) అందులోని ఒక చరణంలో "లల్లల్లల్లా" అని వస్తుంది. 'పాతాళభైరవి' (1951) లోని "వగలోయ్ వగలు" పాటలో



"లాలలూ, లాలలూ, లాలలు లాలలు లలలు" అని 'ల' తో సాగుతుంది పాట చివర్లో. "కలవరమాయె మదిలో" పాట 'లలలలా' తోనే ఆరంభమవుతుంది.

"లలల" లతో వచ్చే పాటలు ఇంకా కొన్ని కనిపంచవచ్చు. ఎవరికైనా పాట పాడమని అడిగినప్పుడు వాళ్లు పాడుతూ మధ్యలో సాహిత్యం గుర్తు రాకపోతే - "లలలా" అంటూ ట్యూన్ పాడి, పాట లాగించేస్తారు. సంగీతంలోకి ఈ "ల" ఎలా ప్రవేశించిందో తెలీదు. ఇంకేదో అక్షరం "క" గాని, "జ" గాని రావచ్చు గదా! రాలేదు. 'త''న'లు ఎలాగూ వస్తాయి. శాస్త్రీయ సంగీతం పాడేవారు "తదరినా" అంటారు. అలా 'త''న'లతో ఎందుకు పాడతారు అంటే సంగీతానికి మూలపురుషులూ, ఆరాధ్య దేవతలూ అయిన తుంబురనారదుల పేర్లను తలచుకోడం. అలాగే, ఇవాళ సినిమా సంగీత దర్శకులు, రచయితలకి ట్యూన్లు అందించే టప్పుడు - "తననాలు " ఇస్తారు. అంచేత, సంగీతానికి, 'త' 'న'లకీ సంబంధం వుంది. సప్త స్వరాలలో 'ల' లేదు - మరి 'ల'కి, సంగీతానికీ




సంబంధం లేనే లేదా?- అని అడిగితే, వుంది! సంబంధం కనిపిస్తుంది. ఎలా కనిపిస్తుందీ అంటే- పాటలు పాడే వారి పేర్లలో కనిపిస్తుంది. "ల'' పేర్లో వున్న వాళ్లంతా గాయకులు ఉండకపోవచ్చు. కాని పరిశీలిస్తే 'ల'లు కనిపిస్తాయి. విశ్వవిఖ్యాత గాయని 'లతా మంగేష్కర్' పేరులో ముందే వుంది "ల". మన ప్రముఖ గాయకులు ఘంటసాల, సుశీల, లీల లలో 'ల' ప్రస్ఫుటం. బాలసుబ్రహ్మణ్యం, బాలమురళీకృష్ణ, బాల సరస్వతి(రావు) 'ల'క్షరం గలవాళ్లు. ఏపి కోమల, యస్.పి.శైలజ, స్వర్ణలత, వక్కలంక సరళ, బి.గోపాలం, జె.వి.రాఘవులు- 'ల'లు గలవాళ్లు. ఒక రకంగా చూస్తే యస్.జానకి లోనూ 'ల'కారం కనిపిస్తుంది. ఇంటిపేరు శిష్టలా. అలాగే, యాల్లారీశ్వరీ. ప్లేబాక్ గీతాలు పాడకపోయినా, మన నట గాయకులు యస్.వరలక్ష్మి, జి.వరలక్ష్మమ్మల్లో 'ల' లేదా?.

వర్ధమాన గాయకుల్లో విజయలక్ష్మి లహరి, కౌసల్య, మల్లికార్జున్ వంటివారు కనిపిస్తారు. హిందీలోని తలత్ మహ్మద్‌లో 'ల' వుంది. పంకజ్ మల్లిక్, సైగల్ వంటి గాయకుల్లో సరే సరి! ఆశా భోంస్‌లే, సుమన్ కల్యాణ్‌పూర్, కమల్‌బారోట్, సులక్షణా పండిట్ పేర్లలో లకారమే అలంకారం!

ఇలా వుండగా మన సంగీత దర్శకులు కొందరిలోనూ ఈ 'ల' ప్రత్యక్షమవుతుంది. చిత్తగిస్తే- పెండ్యాల, ఓగిరాల, గాలి పెంచలనరసింహం, అద్దేపల్లి (రామారావు), సాలూరి రాజేశ్వరరావు,



పెండ్యాల    సాలూరి రాజేశ్వరరావు

హనుమంతరావులూ, సుసర్ల దక్షిణామూర్తి వంటివారూ సాక్షాత్కరిస్తారు. లా వున్నంత మాత్రాన గాయకులు కారు, లా లేకపోతే కాకుండా పోరు, కాని 'ల' తో ఎక్కడో సినిమా సంగీతం జట్టు కట్టింది. అది రహస్యం కాదు, ఎందుకు కట్టిందో మాత్రం రహస్యం!

- ఆర్కే

# సరిగపదమని

**4**

కూర్పు : ఎన్. అరవింద

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ● | 3 | 4 | | 5 |
| | ● | | ● | 6 | ● | | ● | |
| 7 | | ● | 8 | | | ● | 9 | |
| | ● | 10 | ● | | ● | 11 | ● | |
| ● | 12 | | | ● | 13 | | | ● |
| 14 | ● | | ● | 15 | ● | | ● | 16 |
| 17 | | ● | 18 | | | ● | 19 | |
| | ● | 20 | ● | | ● | 21 | ● | |
| | ● | 22 | | ● | 23 | | | |

పంపినవారి పేరు : ______

వయసు : ______ వృత్తి : ______

చిరునామా : ______

______ ఫోన్ : ______

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక
ప్రతిసారి
ఓ సినీ ప్రముఖునిచే...



**ఆధారాలు:**

**అడ్డం:**

1. గోకులకృష్ణుని అందాలు 'ఈ' వేళలోనే చూడాలట (4)
3. రావోయి ............ మా వింత గాధ వినుమా (4)
7. 'ఈ .......... తీయనిది'.... 'చిట్టి చెల్లెలు' నుంచి 'జానీ' దాకా ఇదేమాట (2)
8. వేటూరిని గుర్తు చేసే సీనియర్ రచయిత (3)
9. గంగోత్రిలో 'నీ ఉరుకులె రాగంగా' పాట ఇలా మొదలవుతుంది (2)
12. 'విరిసినది వసంతగానం' పాట రచయిత, 11 నిలువు సినిమాలో దర్శకుడు యొక్క ఇంటిపేరు (3)
13. '.......... రాని బాధ కన్నా సౌఖ్యమే లేదూ' అన్నాడు దేవదాసు (3)
17. '.........వదనే ...... వదనే స్వరనీలాంబరినీవా' ఇద్దరులో పాట (2)
18. '.......... గట్టుందీ' 14 నిలువులోని రచయిత రాసిన పాట (3)
19. 'చూడు పిన్నమా పాడు పిల్లడు' పాటకు అభినయించిన హాస్యనటుడు (2)
22. 'సుసర్ల దక్షిణామూర్తి సంగీత దర్శకత్వంలో పాడిన హిందీ గాయని (2)
23. ఈ నట దర్శకుడు సంగీత దర్శకుడు కూడా (4)

**నిలువు:**

1. ఇలాంటి డ్రస్సులు వేస్తే దడపుట్టని భారతీయుడు ఉంటాడా? (4)
2. ............ కజ్జాలు తెచ్చుకునే అమ్మాయి (2)
4. '...........కి రాబోకు రాబోకు రాజా' అంది సైరంధ్రి కీచకునితో (2)
5. 'నవ్వుతూ బ్రతకాలిరా' అంటూ పాడిన మాయదారి వానిపేరు (5)
6. శ్రీశ్రీ తరువాత తెలుగు పాటకు జాతీయ అవార్డుని తెచ్చిపెట్టిన గీత రచయిత పేరు (3)
11. 'శ్రీ తుంబురనారద' పాట గల సినిమా తొలి సగం (3)
14. నడిరేయి ఏ ఝాములో, ఓహో గులాబి బాలా వంటి పాటలను రాసిన కరుణా పయోనిధి (4)
15. 'పలుకే బంగారమాయెరా..... రామా' బాల మురళీ పాడిన ఆరుద్రగీతం (3)
16. ఎన్టీయార్ విజిలేస్తే ఇలా వుంటుందిట.... (మలిసగం మాత్రమే) (4)
20. 'పాండవ వనవాసం'లో 'దేవాదీనబాంధవా' పాటను అవలీలగా పాడిన గాయని (2)
21. పై పాట ఇలా మొదలవుతుంది (2)

పజిల్, కూపన్
15-10-2003
లోగా చేరాలి

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి(ఆల్ కరెక్ట్)




31 పాటలు గల
డబుల్ ప్యాక్ ఆడియో సి.డి.

రెండవ బహుమతి (ఒక తప్పుతో)




16 పాటలు గల
ఆడియో సి.డి.

మూడవ బహుమతి

(రెండు తప్పులతో)




36 పాటలు గల
డబుల్‌ప్యాక్ ఆడియోక్యాసెట్

కన్సొలేషన్ బహుమతి

(మూడు తప్పులతో)



20 పాటలు గల
ఆడియో క్యాసెట్

# సరిగపదమని ఫలితాలు 2

## డ్రాలో గెలుపొందిన వారు

ఆల్ కరెక్ట్ : పి.కృష్ణారావు, అమలాపురం
ఒక తప్పుతో : చివుకుల చిరంజీవి, ఒంగోలు
రెండు తప్పులతో : కె.తిరుమల దేవి, హైదరాబాద్
మూడు తప్పులతో : ఇజ్జాడ సిద్ధార్థ, విజయనగరం

ఈ పోటీ ఫలితాలను డ్రా తీయడానికి - అడగగానే వెంటనే ఒప్పుకొని ఎంతో ఆనందంతో సహకరించిన సంగీత దర్శకుడు కోటి గారికి, విజేతలతో పాటు పజిల్ కూపన్లను పంపిన ప్రతి ఒక్కరికీ 'హాసం' కృతజ్ఞతలు.







విజేతలైన P. కృష్ణారావు, చివుకుల చిరంజీవి, శ్రీమతి K. తిరుమలా దేవి, చిరంజీవి ఇజ్జాడ సిద్ధార్థ లకు అభినందనలతో

ఇట్లు
కోటి
(MUSIC DIRECTOR)



'సరిగమపదని' పోటీలో నేను విజేతగా ఎంపిక అయినట్టు వర్తమానం అందగానే ఆశ్చర్యం, ఆనందం కలిగింది. అన్నీ కరెక్టేననే నమ్మకంతోనే పంపాను. కానీ డ్రా తీసినపుడు నా పేరు ఎన్నికవడం అదృష్టం కూడా కలిసొస్తేనే కదా జరిగేది!

నా అభిమాన సంగీత దర్శకుడు కోటి గారి చేతుల మీదుగా తీయబడ్డ డ్రాలో విజేతగా ఎంపికయినందుకు మరోసారి నా ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నాను.

**- పి.కృష్ణారావు, అమలాపురం.**



'సరిగపదమని' 2లో నాకు బహుమతి వచ్చిందని 'హాసం' ఫోన్ ద్వారా తెలియపరచటము నా భాగ్యంగా భావిస్తున్నాను. అందులోను గురువుగారు కీ॥శే॥సాలూరి రాజేశ్వరరావుగారి కుమారుడైన శ్రీ కోటి గారి దివ్య హస్తాలతో తీసిన డ్రాలో బహుమతి లభించడం నాకు సర్వానందాన్ని, హాసానందాన్ని ఇచ్చింది.

**- చివుకుల చిరంజీవి, సీనియర్ లెక్చరర్, సి.యస్.ఆర్. శర్మ కాలేజ్, ఒంగోలు.**



'హాసం' వారు ప్రకటించిన ఈ (సినీ) సంగీత బహుమతిని నా అదృష్టంగా భావిస్తున్నాను. 'రాజాగారు' స్వయంగా ఫోనులో మాట్లాడడం - పాఠకుల పట్ల వారికి గల వ్యక్తిగత శ్రద్ధను తెలియజేస్తోంది. నాకు కావలసిన ఎన్నో పాటలను, వాటికి సంబంధించిన విషయాలను 'హాసం' ద్వారా తెలుసుకోగలిగాను. సంగీత ప్రపంచంలో వున్న నాబోటి వారికి 'హాసం' పత్రికలోని పెక్కు అంశములు తెలుసుకోవడం తప్పనిసరి. చాలా కాలంగా ఎదురుచూస్తున్న తెలుగువారందరికి 'హాసం' సంపాదకవర్గం చేస్తున్న ఈ అరుదైన కృషి - సంగీత, సాహిత్య పన్నీటి జల్లు.

**- కె.తిరుమలదేవి, గాయని, న్యూ నల్లకుంట, హైదరాబాద్.**

నాకు బహుమతి వచ్చిందని ఎడిటర్ గారు ఫోన్ చేసి చెప్పినపుడు మా ఇంటిల్లిపాది చాలా ఆనందించాము. కోటిగారి చేతుల మీదుగా నా పేరు డ్రాలో రావటం నా అదృష్టముగా భావిస్తున్నాను. కోటి గారు మా ప్రాంతీయులగుట కూడా నా అదృష్టం.



సోదరుడు వివేకానందతో సిద్ధార్థ

**- ఇజ్జాడ సిద్ధార్థ (6వ తరగతి-11 సంవత్సరాలు), విజయనగరం.**

## జవాబులు

**అడ్డం:** 1. వినాయక 3. వడగాలి 5. లగాన్ 7. నువ్వే 8. వన 9. కోవా 10. చీర 11. దినకరా 13. పిక 14. సాటి 16. పుల్లా 17. మావి 19. త్రివిక్రమ్ 21. భూమిక 23. శ్రీ 24. భామిని

**నిలువు:** 1. విన్నానులే 2. కలవర 3. వన్ 4. గాజువాక పిల్లా 6. గాన 9. కోన 10. చీకటి 11. దియ్యి 12. రాక 14. సావిత్రి 15. ప్రీతమ్ 16. పుణ్యభూమి 18. షక 20. విషం 22. మిని

## అన్నీ కరెక్టుగా రాసినవారు

ఎస్.వి.రామారావు-హైదరాబాద్, ఎస్.సీతామహాలక్ష్మి- మెహదీపట్నం, ఎస్.సునీతానంద్-ఖైరతాబాద్, సి.విజయసారథి- కర్నూలు, ఎ.బాల్‌నాధ్-నిజామాబాద్, యు.యు.ఉరుకుందు-ఎమ్మిగనూరు, కె.శంకరనారాయణ-బాగ్‌అంబర్‌పేట, పి.పాపారావు-విశాఖపట్నం, పి.విజయలక్ష్మి-విశాఖపట్నం, ఇప్పగుంట వెంకట శ్రీనివాసరావు-మౌలాలీ(హైదరాబాద్), ఎం.అనురాధ-మెహదీపట్నం, వి.జె.వల్లీ-కాకినాడ, జె.ఎస్.ఆర్.కె.ప్రసాద్- హైదరాబాద్, మటపల్లి గంగరాజు, సీతమ్మపేట(వైజాగ్), సి.వి.ఎస్. ఆర్.కె.ప్రసాద్-జహీరాబాద్, కె.ఎస్.ఆర్.కె.ప్రసాద్- హైదరాబాద్, జి.దేవరాయలు- బేగంపేట, ఎం.వి.ఎస్. కృష్ణవేణి-కొత్తవలన(విజయనగరం), పి.పద్మనాభన్-హైదరాబాద్, ఎం.నీహారిక- కర్నూలు, జి.లక్ష్మణకుమార్-కంచరపాలెం (వైజాగ్), సోమయాజుల సాయిప్రసాద్- కోరాపుట్ (ఒరిస్సా), ఎం.ఎస్.పరిమళాదేవి- ఉండవల్లి సెంటర్ (గుంటూరు), అవసరాల మణి-విజయనగరం, బి.అరుణ- నవులూరు(గుంటూరు), ఆత్కూరి వెంకట సూర్యనారాయణరావు, హైదరాబాద్, గుండాల రాజ్యలక్ష్మి-విజయనగరం, యం.రామకృష్ణానంద్- నూజివీడు, పి.నాగరాజేశ్వరశర్మ- కొత్తపల్లి(కరీంనగర్), కె.సునీత-యలమంచిలి(వైజాగ్), వి.వి.సుందర్‌రాజ్-హైదరాబాద్, బి.రమేష్- పాతవూరు(అనంతపురం), పి.హేమలత-రాజమండ్రి, తాడి రంగారావు- రాజమండ్రి, నందిపాటి వెంకటేశ్వరరావు-లేమల్లెపాడు(గుంటూరు), కె.బి.కైలాస్‌నాధ్- అనంతపురం, ఎం.కళ్యాణ్- విశాఖపట్నం, గంగారపు వెంకట్రావు-సత్తెనపల్లి, కె.ఎస్. రామారావ్, విజయనగరం, కె.వాణి-విజయనగరం, కె.శ్రీనివాసమూర్తి-నెల్లూరు, గరిమెళ్ల భాగ్యశ్రీ-ఖమ్మం, బొమ్మరాజు లీలావతి-పర్చూరు, ఎన్.వి.ఆర్.ఎస్. సుబ్బారావు- రాజమండ్రి, కె.హిమబిందు-విశాఖపట్నం, కె.వి.కె.నాగమణి-విశాఖపట్నం, జె.పోలురాజు- కడపరాజుపల్లి(ప్రకాశం), కోటిపల్లి చక్రధర్-విశాఖపట్నం, జె.వి.శర్మ-ముంబాయి, ఎన్.వాణికుమారి- హైదరాబాద్, ఎ.మంజరి- హైదరాబాద్, డా॥ఎ.సువర్చల-కడప, అనుపోజు శివకుమార్-కొమరవాని పేట (శ్రీకాకుళం), బి.వి.రమణమూర్తి-హైదరాబాద్, చెలికాని సూర్యారావు-చీపురుపల్లి, బి.ఎస్.అశోక్‌కుమార్-రాజమండ్రి, మట్టిపల్లి సుబ్బలక్ష్మి-హైదరాబాద్, ఆర్.వాణి-బెంగుళూరు, డి.వెంకట్రావు- సాలూర్ (విజయనగరం), దారివేముల హనుమంతరావు- తెనాలి, మువ్వల శ్రీనివాసరావు-చీరాల, జి.వరలక్ష్మి-కర్నూలు, కె.శ్రీలత-సత్తెనపల్లి, ఎల్.వి.ఏ.నాగేశ్వరరావు- కూర్మన్నపాలెం (వైజాగ్), సి.నళినీకుమారి-సికింద్రాబాద్, అడుసుమల్లి రామచంద్రరావు-రేపల్లె, బి.రవిశంకర్-సైదాబాద్, వి.శేషురావు-హైదరాబాద్, ఎల్.వెంకటేశ్వర్లు- తిరుపతి, జి.ఎస్.ఎస్.సాయి-హైదరాబాద్, వేదుల లలిత-విశాఖపట్నం, ఎం.రాజ్‌కుమార్- హైదరాబాద్, బి.ఎస్.ఆర్.మూర్తి-రాజమండ్రి, ఎం.సుశీల-నర్సన్నపేట, మద్ది త్యాగరాజు- నర్సన్నపేట, కె.ఎన్నార్‌నమ్మి- నెగ్గిపూడి(ప.గో.జిల్లా), న్యాయపతి విజేత-కాకినాడ, పి.వి.రామశర్మ- విశాఖపట్నం, జె.రాజ్యలక్ష్మి-శ్రీహరికోట(నెల్లూరు), డి.ఎస్.ఆర్.ప్రసాద్- సికింద్రాబాద్, కె.వి.సత్యవతి-హైదరాబాద్, రాయప్రోలు లక్ష్మీదేవి-ఒంగోలు, ఎం.మాధుర్ రంగారావు-నల్గొండ, జి.జయరాజ్-కడప, చందలూరి ఆంజనేయ శాస్త్రి-కాకినాడ, పెనుమాక ప్రసాదరావు- రామవరప్పాడు (కృష్ణాజిల్లా), భమిడిపాటి వెంకటేశ్వరరావు- హైదరాబాద్, పక్కి చక్రవర్తి-గరివిడి(విజయనగరం), జి.వి.రమణ-సంగారెడ్డి, ఎ.వరాలు- పిఠాపురం, బి.వి.ఎస్.ఎస్.కృష్ణకుమార్-విశాఖపట్నం, యం.సౌరభ-తిరుపతి, బి.ఎన్.రమ్యశ్రీ-హైదరాబాద్, ఆర్.వి.పద్మావతి-హైదరాబాద్, జి.వెంకటేశ్వరరెడ్డి- హైదరాబాద్, కె.రవీంద్ర-నల్లజర్ల(ప॥గో॥జిల్లా), యు.ఫణీంద్రకుమార్-కరీంనగర్, నాగమణి.ఎం-హైదరాబాద్, టి.నాగలక్ష్మీలత-నెల్లూరు, వారణాసి సత్యప్రభ-హైద్రాబాద్, మండలీక అన్నేశ్వర శర్మ-హైదరాబాద్, కె.గీతాసరోజిని-చీరాల, ఎన్.ఎం.శర్మ- హైదరాబాద్, బి.లక్ష్మీతయారు- హైదరాబాద్, కె.బాలమురళీ- చిలకలూరిపేట, ఎం.రఘునాధరావు- హైదరాబాద్, డి.రామకృష్ణ- హైదరాబాద్, వై.వి.ఎస్.సత్యనారాయణ-కాకినాడ, ఓరుగంటి శ్రీకాంత్- గుంటూరు, డి.కృష్ణచైతన్య-హైదరాబాద్, బి.బాల-హైదరాబాద్, బి.ప్రభారాణి- పర్లాకిమిడి(ఒరిస్సా), పి.స్వాతిలక్ష్మి- చీపురుపల్లి (విజయనగరం), పి.వైజయంతి-విశాఖపట్నం, ఆర్.ఎం.కె.గాంధీ- రాజమండ్రి, ఎం.మణిబాబు-హైదరాబాద్, ఎన్.రమాదేవి-వరంగల్, కె.పార్వతి-రాజమండ్రి, జి.భోగేశ్వరరావు- విశాఖపట్నం, పి.వి.సుందర్‌కుమార్-బెరహంపూర్(ఒరిస్సా), గంటి బుల్లిబాబు- వి.వి.అగ్రహారం(తూ॥గో॥జిల్లా), మిరియాల మంగతయారు- కామరాజుపేట(తూ॥గో॥జిల్లా), జి.జయశ్రీ-విశాఖపట్నం, పానాటి విజయలక్ష్మి-కొంగరెడ్డిపల్లి(చిత్తూరు), ఎస్.సుధాపద్మ-హైదరాబాద్, కె.వి.రమణమూర్తి-బరంపురం (ఒరిస్సా), తాడిమళ్ల వెంకట శేషగిరిరావు-పుట్ల చెరువు(కృష్ణాజిల్లా), వి.వీరేంద్ర చౌదరి-హైదరాబాద్, కె.వి.వి.ఎస్.ఎస్.సుబ్రమణ్యం-హైదరాబాద్, కె.బీనాదేవి-విజయవాడ, కె.శార్వాణి, గుంటూరు, టి.యస్.కళాధర్- గుంతకల్లు, బచ్చు విజయ్ కుమార్-కొత్త వెంకోజీపాలెం (వైజాగ్), ఎం.రామమోహనాచార్యులు- వినన్నపేట, కె.రమాదేవి- ప్రొద్దుటూరు, రాఘవేంద్రశ్రీనివాస్-మచిలీపట్నం, కె.వి.సంజీవరావు- జగ్గయ్యపేట, కె.స్వప్న-జగ్గయ్యపేట, పి.శ్రీనివాసరెడ్డి- నెల్లూరు, జి.విజయలక్ష్మి-విశాఖపట్నం,కుప్పా విష్ణు నీరజ-విజయవాడ, ఎన్.జగన్మోహనరావు-కరీంనగర్, భాగవతుల సుజాత-విజయవాడ, మల్లిడి దుర్గా ప్రసాద దినేష్‌రెడ్డి-కుతుకులూరు, మల్లిడి విజయభాస్కరరెడ్డి- కుతుకులూరు, జి.రవివర్మ- ఉక్కునగరం (వైజాగ్), మంచిరాజు సూర్య నారాయణమూర్తి-హైదరాబాద్, ఎ.వి.ఆర్. రాజేశ్వరరావు-సికింద్రాబాద్, మల్లెల లక్ష్మి-హైదరాబాద్, జి.భానుమూర్తి- కొవ్వూరు, వి.ఎస్.బి. సోమయాజులు- అనకాపల్లి, శ్రీపాద శివాణి-మల్కాజ్‌గిరి, పి.మధు- విశాఖపట్నం, కుంటా శివనాగేశ్వరరావు- మాచర్ల, ఆర్.శేషాప్రభావతి- గుంటూరు, ఇ.రాధిక-హైదరాబాద్, కె.రాజేశ్వరి-విశాఖపట్నం, జె.ఎస్.శేఖర్- బైరాగిపట్టెడ(తిరుపతి), పి.కృష్ణారావు-అమలాపురం, కొండూరి వీర నాగేశ్వరరావు-చిలకలూరిపేట, కిశోర్ కుమార్-గోదావరిఖని, సురభి రామప్రసాద్-వరంగల్, ఎస్.విమలామూర్తి -జనగామ (వరంగల్), జె.బి.వీరయ్య-డోన్ (కర్నూలు), వి.సోమశేఖర్-చెన్నై, సి.అలివేలు- విజయవాడ, జి.ఎల్.ఎన్.స్వామి- విజయనగరం, పి.లక్ష్మీకుమారి-ఖమ్మం, ఎం.నర్సయ్య-ఖమ్మం, బి.రజనీ సాయి కృష్ణ-హైదరాబాద్, టి.కె.వేణుగోపాల్-హైదరాబాద్, డా॥వి.వెంకటరమణయ్య- కడప, ఎస్.వి.నాగభూషణం-హైదరాబాద్, వి.వి.ఎన్.ఎస్.మూర్తి-హైదరాబాద్, కె.కమల-హైదరాబాద్, బైర్రాజు చంద్రకళ-హైదరాబాద్, తులసిబాలు-రాయదుర్గం, బెల్లంకొండ రాంబాబు-పమిడిపాడు (గుంటూరు), జంధ్యాల రమ-అక్కయ్యపాలెం (వైజాగ్), వి.నళిని- హైదరాబాద్, ఆర్.వి.వి.కృష్ణ-హైదరాబాద్, యం.హరిశ్చంద్రారెడ్డి- రాజమండ్రి, డి.ఎస్.శంకర్-వక్కలంక, కొత్తపల్లి జేజిబాబు-మచిలీపట్నం, డి.ధీరజ్ ప్రశాంత్- విశాఖపట్నం, సి.వి.ఆర్.మాణిక్యేశ్వరి-ఏలూరు ఎన్.ఎస్.కృష్ణమూర్తి- సికింద్రాబాద్.

## ఒకతప్పుతో రాసినవారు

ఆర్.ఉదయ శ్రీ-హైదరాబాద్, ఎ.ఎస్.బి.ఆచార్య-హైదరాబాద్, ఎ.నిర్మలా రాఘవన్-హైదరాబాద్, వై.రోశిరెడ్డి-సత్తెనపల్లి (గుంటూరు జిల్లా), సి.హెచ్. కళ్యాణ్ చక్రవర్తి- బెరహంపూర్(ఒరిస్సా), మహ్మమద్.లతీఫ్- హైదరాబాద్, ఆకుండి విజయకుమార్- రాయగడ(ఒరిస్సా), యం.తిరుమలా దేవి- హైదరాబాద్, మరువాడ కామేశ్వరరావు- మంచిర్యాల, జి.ఎన్.భాస్కరరావు- హన్మంకొండ, యన్.వేణుగోపాల్-కాకినాడ, ఎన్.ఎస్.ఎన్.చార్యులు- హైదరాబాద్, దివ్య ధాన్యలక్ష్మి-విశాఖపట్నం, యమ్.లక్ష్మి- విజయనగరం, ఎన్.దివ్య-హైదరాబాద్, మంత్రి లక్ష్మినారాయణ- సిరిసిల్ల (కరీంనగర్‌జిల్లా), ఈదర మమత-గుంటూరు, పి.పద్మ-భీమడోలు జంక్షన్ (ప॥గో॥జిల్లా), ఎ.టి.కాశీనాథ్-హైదరాబాద్, బాసరాజు యాదగిరి-రామన్నపేట(నల్లగొండ జిల్లా), కె.కృష్ణశాస్త్రి-మండపేట(తూ॥గో॥జిల్లా), కె.నరసింహమూర్తి- నిజామాబాద్, ఎమ్.ఎస్. బాలకృష్ణశర్మ- విజయవాడ, టి.యల్.ప్రసాద్- విశాఖపట్నం, పి.జె.డి.రాజు- అచ్చంపేట్ (మహబూబ్‌నగర్‌జిల్లా), ఆర్.శైలజ-రాపూర్(నెల్లూరుజిల్లా), వై.రాజానాయుడు- పెద్దచెన్నయ్యగారి పల్లె(చిత్తూరు జిల్లా), దేవరం సతీష్‌కుమార్-జగీత్యాల(కరీంనగర్), వై.పద్మ- తుని (తూ॥గో॥ జిల్లా), సి.నరసింహమూర్తి- విజయవాడ, గోగులమూడి శేషగిరిరావు-సంతమాగులూరు(ప్రకాశంజిల్లా), బి.సుశీల-హైదరాబాద్, కె.దుర్గా రాణి- శ్రీనగర్ కాలనీ(గుంటూరుజిల్లా), బోరసుజాత-అవలింగి (శ్రీకాకుళంజిల్లా), బి.మధుసుదనరావు-నిజామాబాద్, ఎమ్.మురళీకృష్ణ- నిజామాబాద్, బి.గాయత్రి- కాకినాడ, జె.చరణ్ కేదార్ -తాడిపల్లిగూడెం, ఎమ్.సునందలక్ష్మి-ఇబ్రహింపట్నం(కృష్ణా జిల్లా), వరయోగి రామ్‌మోహన్- సికింద్రాబాద్, కె.ఎన్.సుధాకర్- హైదరాబాద్, పి.రుక్మిణీదేవి-కర్నూలు, ఆర్.రామమోహన్- కడప, డా॥చెన్నయ్యలాలం- నెల్లూరు, ఎ.ఆదినారాయణ- పోతవరం(గుంటూరు), ఎస్.వి.చంద్రశేఖర్-నగరి (చిత్తూరు), వి.వి.కళ్యాణి-నెల్లూరు, తాతిరాజు జగన్-బెరహంపూర్(ఒరిస్సా), డా॥రహమతుల్లా-పర్లాకిమిడి(ఒరిస్సా), ఉన్నవ.లక్ష్మీనారాయణరావు- రాజమండ్రి, టి.రవికిరణ్-చెన్నై, వై.శశిరేఖ సాయిబాబా-ఏలూరు, ఎ.రాఘవేంద్రకుమార్-కర్నూలు, పి.ఎన్.వి.సావిత్రి-హైదరాబాద్, పి.సునీల్‌కుమార్- కొట్టూరు(ప॥గో॥జిల్లా), జి.రాజేశ్వరరావు-హైదరాబాద్, మీనా దేవి.వి-చిలంకూరు(కడప), గేదెల.రామారావు-ఏలూరు, టి.శశికళ- శ్రీకాకుళం, వి.వి.ఎస్.సత్యసాయి-ఎదుమైలారం(మెదక్), ఎం.మస్తాన్‌రెడ్డి- అక్కయ్యపాలెం(వైజాగ్), పి.బాల త్రిపుర సుందరి-రాజమండ్రి, వి.సింధూర- హైదరాబాద్, వి.ఆనంద్-హైదరాబాద్, జె.అన్నపూర్ణ-సికింద్రాబాద్, డి.వి.చలం-కాకినాడ, కె.సత్యప్రకాష్-రాజమండ్రి, కె.రాజశేఖర్- కందుకూరు (ప్రకాశం), సి.హెచ్.వెంకటరాజయ్య-సంగారెడ్డి, కడగాన రాము- విజయవాడ, ఎబిఎస్.రంగనాథ్-రాజమండ్రి, ఎం.అప్పారావు- అనకాపల్లి, జి.గాయత్రి-కంచరపాలెం(వైజాగ్), ఆరిపాక సూరిబాబు-విశాఖపట్నం, ఎస్.విజయలక్ష్మి- హైదరాబాద్, ఎన్.శేషగిరిరావు-కోదాడ, ఎల్.వి. ఎస్.ఎస్.శర్మ-హైదరాబాద్, వి.వి.సత్యప్రసాద్-హైదరాబాద్, తెలికిచెర్ల రామకృష్ణ-విజయనగరం, ఎల్.జగ్గరావు- శ్రీకాకుళం, ఎ.రవిప్రసాద్- శింగరాయకొండ (ప్రకాశంజిల్లా), ఎ.టి.శ్రీనివాసన్- అనంతపూర్, కదార్ల నారాయణ-జగిత్యాల, ఇలపావులూరి శేషతల్పశాయి- కొమ్మలపాడు (ప్రకాశం జిల్లా), బి.ఇ.శ్రీనివాసమూర్తి- అనంతపూర్, పాణ్యం శ్రీనివాసరావు -హైదరాబాద్, వి.పి.చందన్‌రావు- నిజామాబాద్, షబానాబాను-కాకినాడ, పి.అపర్ణాభారతి-హైదరాబాద్, కీర్తి నాగబాబు- ఏలూరు(ప॥గో॥జిల్లా).

## రెండు తప్పులతో రాసినవారు

పి.ప్రశాంత్-సికింద్రబాద్, దులపల్లి వెంకటరమణ-గొల్లవిల్లి(తూ॥గో॥జిల్లా) వై.విజయలక్ష్మి-తిరుపతి, బలుపరి విజయ్-సూగూరు (మహబూబ్‌నగర్ జిల్లా), కె.కార్తిక-హైదరాబాద్, కె.లావణ్య-నంద్యాల (ఆర్.యస్.), డి.శ్రీనివాస మోహన్-నెల్లూరు, మహబూబ్ సుభాని-పాలేరు(ఖమ్మంజిల్లా), మద్దిపాటి సూర్య-హైదరాబాద్, ఎమ్.సుహాసిని- హైదరాబాద్, ముప్పిరాల శశాంక-హైదరాబాద్, వి.కృష్ణవేణి- వుయ్యూరు (కృష్ణాజిల్లా), పి.మనోహర్-యర్రగుంట్ల(కర్నూలుజిల్లా), రావినూతల సులభ -హైదరాబాద్, వై.భానుప్రసాద్-కర్నూలు, చిట్టావిశ్వేశ్వరశాస్త్రి-హైదరాబాద్, జి.పాండురంగశర్మ- హైదరాబాద్, టి.ఎస్.ఆర్. శివప్రసాద్-హైదరాబాద్, షేక్‌కరిముల్లా-విజయవాడ, ఎ.వి.ఎస్.ఎస్.శర్మ- ఒంగోలు, ఆర్.గురుమూర్తి- భువనేశ్వర్(ఒరిస్సా), వై.శోభన్‌బాబు- అనంతపురం, యు.వి. సుబ్రహ్మణ్యం-తిరుపతి, జడ్.పెటెర్-హైదరాబాద్, సుంకరి నాగమణి-విశాఖపట్నం, యం.నాగేంద్రం-నాగర్‌కర్నూలు(మహబూబ్‌నగర్‌జిల్లా), ఎన్.సి.హెచ్.శంకర్‌లాల్-విజయనగరం, మలపాకశివకుమార్- హైదరాబాద్, తనికెళ్ళ రామకృష్ణ- విజయవాడ, రాధామాధవ్. మునిపల్లె- సికింద్రబాద్, తాతా సౌందర్య కౌముది- విశాఖపట్నం, ఎ.ఉషకుమారి-హైదరాబాద్, జి.నారాయణస్వామి-బెంగుళూరు, ఎన్.సంబాశివరెడ్డి- చిత్తూరు, మర్రి వసంతలక్ష్మి-కర్నూలు, కె.వి.రమణారెడ్డి- హైదరాబాద్, యు.విజయ శేఖరరెడ్డి-హైదరాబాద్.

## మూడు తప్పులతో రాసినవారు

కె.మురళీకృష్ణ-సత్తెనపల్లి(గుంటూరు), వి.సాయికుమార్- పర్లాకిమిడ్(ఒరిస్సా), కందసుభద్ర-విశాఖపట్నం, పి.రాజ్యలక్ష్మి-హైదరాబాద్, ఎం.కృష్ణ-కాకినాడ, ఓలేటిసీతాదేవి-విజయవాడ, కె.మారుతేశ్వరరావు-పరిగి (అనంతపురంజిల్లా), జి.ఎస్.రావు-పెందుర్తి(విశాఖజిల్లా), పమర్తి రవీంద్రబాబు-ధర్మవరం(ప్రకాశంజిల్లా), పగిళ్లసైదిరెడ్డి-ఘట్‌కెసర్(రంగారెడ్డిజిల్లా), యన్.శంకరాచారి-హైదరాబాద్, గురజాలఅన్నపూర్ణ-విశాఖపట్నం.

### వివరణ

'సరిగపదమని-1' జవాబులలో నిలువు 11.కురులు కి బదులుగా పురుడు అని 16-30 సెప్టెంబరు 2003 సంచికలో ప్రింటయింది. ఈ ముద్రా రాక్షసంకి పాఠకులు పంపిన కూపన్లకి సంబంధం ఏమాత్రం లేదు.

\- ఎడిటర్




సంగీత దర్శకుడు గాయకుడైతే అతని వద్ద పాడే వాళ్ళకి గీతం పూర్తి రసస్పర్శతో త్వరగా పట్టుబడుతుంది. గాయకుడు సంగీత దర్శకుడయితే అతను సృష్టించే గీతాలలోని కొన్ని పట్లు అతని గాత్ర ధర్మానికి దగ్గరగా ఉంటాయి. ఏ పాటనైనా సుతిమెత్తగా, మృదువుగా పాడే గాయకుడు ఎ.ఎం.రాజా సంగీత దర్శకుడిగా స్వరరచనలు చేసిన చిత్రం వీనస్ పిక్చర్స్ వారి




ఈ చిత్రం లోని పాటలు పైన పేర్కొన్న ద్వితీయ భాగానికి అద్వితీయ సాక్ష్యాలుగా నిలబడతాయి. ప్రముఖ నాటక కర్త సి.వి. శ్రీధర్ 1959లో 'కళ్యాణపరిసు' అనే చిత్రాన్ని తీశాడు. ఆ చిత్రంలో జెమినీ గణేశన్, అక్కినేని నాగేశ్వరరావు, తంగవేలు, బి.సరోజాదేవి, విజయకుమారి, ఎం.సరోజ నటించారు. అదే చిత్రం అదే శ్రీధర్ దర్శకత్వంలో 'పెళ్ళికానుక'గా 1960లో వచ్చింది. తెలుగులో అక్కినేని నాగేశ్వరరావు, జగ్గయ్య, రేలంగి, బి.సరోజాదేవి, కృష్ణకుమారి, గిరిజ మొదలగువారు ప్రధాన పాత్రలను పోషించారు. 'కళ్యాణపరిసు' చిత్రానికి సంగీతాన్నిచ్చిన ఎ.ఎం.రాజాయే తెలుగు చిత్రం 'పెళ్ళికానుక'కు కూడా సంగీత దర్శకత్వం వహించారు. ఈ చిత్రంలోని ఎనిమిది పాటలన్నీ శ్రోతల అభిమానాన్ని చూరగొన్నాయి. వాటిలో బహుళ జానాదరణ పొందిన పాటలివి.

అ : వాడుక మరచెదవేల నను వేడుక చేసెదవేల
నిను చూడని దినము నాకొక యుగము
నీకు తెలుసును నిజము
నీకు తెలుసును నిజము
ఆ : వాడుక మరువను నేను నిను వేడుక చేయగలేను
నిను చూడని క్షణము నా కొక దినము
నీకు తెలుసును నిజము
నీకు తెలుసును నిజము
అ : సంజెరంగుల చల్లని గాలుల
మధుర రాగము మంజుల గానము ॥సంజె॥
తేనె విందుల తీయని కలలూ
మరచిపోయిన వేళ
ఇక మనకీ మనుగడ ఏల
నీ అందము చూపి డెందము ఊపి
ఆశ రేపెదవేలా ఆశ రేపెదవేలా
ఆ : ఓ ఓ ఓ... సంజెరంగులు సాగినా
చల్లగాలులు ఆగినా ॥సంజె॥
కలసి మెలసిన కన్నులలోనా ॥కలసి॥
మనసు చూడగలేవా
మరులు తోడగ లేవా ॥వాడుక॥
అ : కన్నులా ఇవి కలల వెన్నెలా
చిన్నె వన్నెల చిలిపి తెన్నులా ॥కన్నులా॥
మనసు తెలిసీ మర్మమేలా
ఆ : ఇంత తొందర ఏలా
ఇటు పంతాలాడుట మేలా
నాకందరికన్నా ఆశలు ఉన్నా
హద్దు కదనగలనా హద్దు కాదనగలనా
ఇ : వాడని నవ్వులతోడ
నడయాడెడు పువ్వుల జాడ
అనురాగము విరిసి లోకము మరచి
ఏకమౌదము కలసి ఏకమౌదము కలసి



ఈ పాటను ఆత్రేయ రాయగా ఎ.ఎం.రాజా, సుశీల పాడేరు. అక్కినేని, బి.సరోజాదేవి అభినయించిన ఈ పాటలో వారివురూ సైకిళ్ళపై బయలుదేరడం, పల్లవి పాడిన తర్వాత ఇద్దరూ స్పీడుగా సైకిల్స్ తొక్కుతూ వెళుతుండగా ఓ చోట ఒక దాని నొకటి అడ్డుకోవడంతో ఇద్దరూ ఇసుక తిన్నెలపై పడిపోవడం తిరిగి లేచి చరణానికి ముందు వచ్చే ఆలాపనను అందుకునేవరకు వచ్చే... ఇంటర్ ల్యూడ్ - సంగీత దర్శకుడిగా ఎ.ఎం.రాజాకున్న దార్శనికతను తెలియజేస్తుంది. చిత్రాన్ని ఒకసారి చూసినవారెవరికైనా సరే ఈ పాట కొన్ని సంవత్సరాల తర్వాత విన్నాసరే, ఈ సన్నివేశం, తదనుగుణమైన చిత్రీకరణ గుర్తొస్తాయి. హిందుస్తానీ రాగం పహాడీ ఛాయలలో స్వరపరచబడిన ఈ పాటలో సాహిత్య పరంగా చూసుకుంటే 'నా కందరి కన్నా ఆశలు ఉన్నా హద్దు కాదనగలనా' అని తెలియజేసే కథానాయిక మనస్తత్వమే ఈ చిత్రం కథకు ఆయువుపట్టు.

ఆ : కన్నులతో పలుకరించు వలపులూ
ఎన్నటికీ మరువరాని తలపులూ ॥కన్నుల॥
రెండూ ఏకమై ప్రేమే లోకమై
నా మది పాడే పరాధీనమై
అ : అలాగా!? ఆమె: ॥కన్నులతో॥
ఆ: చల్లని వేళా మల్లెల నీడా
చక్కని దొంగా దాగెనటా ॥చల్లని॥
దారులు కాచి సమయము చూచి
దాచిన ప్రేమా దోచెనటా
మరలా వచ్చెనో మనసే ఇచ్చెనో ॥మరలా॥
అతనే నీవైతే ఆమే నేనటా
అ : నిజంగా!? ఆమె: ॥కన్నులతో॥
ఆ : నల్లని మేఘం మెల్లగ రాగా
నాట్యము నెమలీ చేసినది ॥నల్లని॥
వలచిన వాడూ సరసకు రాగా
ఎంతో సిగ్గూ వేసినది
తనివీ తీరా తనలో తానే ॥తనివి॥
మనసే మురిసింది పరవశ మొందగా
అ : ఐసీ!? ఆమె: ॥కన్నులతో॥



ఆరుద్ర రాసిన ఈ పాటను సుశీల, ఎ.ఎం. రాజా పాడగా బి.సరోజాదేవి, అక్కినేని అభినయించారు. శంకరాభరణం స్కేల్‌లో మాండ్ రాగం టచ్‌తో సాగిన ఈ పాట మొదట్లో ఒక ఊపుతో వచ్చే పియానో వాద్యపు వాయింపు - నిజంగా ఎంతో ఇంపుగా, ఈనాటికీ విన సొంపుగా ఉంటుంది. స్పష్టత, శ్రావ్యత ఈ రెండు యుగళ గీతాల్లోనూ గమనించదగ్గ ముఖ్యాంశాలుగా పేర్కొనాలి.

పులకించని మది పులకించు
వినిపించని కథ వినిపించు
అనిపించని ఆశలనించు
మనసునే మరపించు
గానం మనసునే మరపించు ॥పుల॥
రాగమందనురాగమొలికి
రక్తి నొసగును గానం ॥రాగ॥
రేపు రేపను తీపి కలలకు
రూపమిచ్చును గానం
చెదరి పోయే భావములను
చేర్చి గూర్చును గానం
జీవమొసగును గానం
మది చింతబాపును గానం ॥పుల॥
వాడిపోయిన పైరులైనా
నీరుగని నర్తంచును ॥వాడి॥
కూలిపోయిన తీగలైనా
కొమ్మ నలమి ప్రాకును
కన్నె మనసు ఎన్నుకున్న
తోడు దొరికిన మరిము
దోరవలపే కురియు
మది దోచు కొమ్మని పిలుచు
పులకించని మది పులకించు
వినిపించని కథ వినిపించు
అనిపించని ఆశలనించు
మనసునే మరపించు
ప్రేమ.... మనసునే మరపించు



ఈ పాటను జిక్కి పాడగా కృష్ణకుమారి అభినయించారు. తెరపై అక్కినేని కూడా కనిపిస్తారు. కవిత్వాంశ కలిగిన ఈ గీతాన్ని ఆత్రేయ రాసేరు. మొదటి చరణం గానానికి, రెండో చరణం ప్రేమకు అన్వయించుకుంటే కుదిరిపోయేలా మొత్తం పాటను స్కీమ్ చేసిన విధానం, అలాగే 'ఇంచు' అనే పదాన్ని వాడుకున్న పద్ధతి ఇవన్నీ ప్రశంసాపాత్రమైనవి. ఈ పాటలో సితార్ ఉపమోగించుకున్న తీరుని ఇవాళ పునశ్చరణ చేసుకుంటే ఇక్కడ వచ్చే ట్యూన్‌కి ఆ వాద్యం తప్ప మరొకటి నప్పదన్నంత గొప్పగా అమిరిందనిపిస్తుంది. ఆరోహణలో మోహన రాగస్వరాలైన 'సరిగ పదస'-ని, అవరోహణలో కళ్యాణి రాగ స్వరాలైన 'సనిదపమగరిస'-ని, కలిగిన 'మోహనా కళ్యాణి' రాగాన్ని ఈ పాటకు ఉపయోగించున్నారు. ఇందులో 'మ' అనే స్వరాన్ని అతి తక్కువగాను మిగిలిన కళ్యాణి రాగస్వరాలను అనుస్వరాలుగాను వాడుకోవటం వల్ల స్వరరచనలో కొత్తందాలు, కొత్తదనాలు సంతరించుకున్నాయి. జిక్కి సూపర్‌హిట్స్‌లో ఒకటిగా నిలిచిపోయిన ఈ పాట- ఒక స్వరకర్తగానే కాకుండా భర్తగా కూడా ఎ.ఎం.రాజా ఆమెకు మిగిల్చిన ఒక తీపిగుర్తు.

ఆడే పాడే పసివాడా
ఆడేనోయీ నీ తోడా
ఆనందం పొంగేనోయి దీపావళి
ఇంటింట వెలుగు
దీపాల మెరుగు
ఎనలేని వేడుకరా
ఎనలేని వేడుకరా
చిరునవ్వు వెన్నెల్లు చిలికేటి వాడా
అరుదైన చిరుముద్దు అరువీయరారా ॥చిరు॥
నా మదిలో నీకు నెలవే కలదూ ॥నామది॥
బదులే నాకూ నీవీయవలదు
నీపై మేము నిలిపిన ఆశలు
నిజమైన చాలునురా నిజమైన చాలునురా
చిన్నారి జయమంచు మోగే పటాసు
చిటపటమని పూలు చిమ్మే మతాబు ॥చిన్నారి॥
నీ రూపమే ఇంటి దీపము బాబు ॥నీ రూపమే॥
మాలో పెరిగె మమతవు నీవు
మంచనిపించి మము మరిపించిన
మరివేరె కోరమురా మరివేరె కోరమురా ॥ఆడే॥



ఈ పాటను పి.సుశీల గానం చేయగా బి.సరోజాదేవి ప్రధాన పాత్రధారిణిగా అభినయించారు. ఆమెతోపాటు అక్కినేని నాగేశ్వరరావు, కృష్ణకుమారి, మాస్టర్ బాబు తదితరులు సన్నివేశానుగుణంగా కనిపిస్తారు. ఈ పాటను చెఱువు ఆంజనేయశాస్త్రి రాశారు. రాసినవి అతి తక్కువే పాటలే అయినా గుర్తిండిపోయే పాటల్ని రాసిన వారిలో చెఱువు ఆంజనేయశాస్త్రి ఒకరు. సముద్రాల రాఘవాచార్యుల వారి కుటుంబంతో ఈయనకు సన్నిహిత సంబంధాలుండేవి. అదే సమయంలో ఫిలిం సర్కిల్స్‌లో కొలను బ్రహ్మానందరావుగారికి జర్నలిస్ట్‌గా మంచి పేరుండేది. ఈ ముగ్గురి ఇంటి పేర్ల (కొలను, చెఱువు, సముద్రం)లో ఉన్న సారూప్యత వల్ల బంధుత్వం వుండేదనుకొని ముగ్గుర్నీ కలుపుకుంటూ ఛలోక్తులు పడేవి ఆ రోజుల్లో. 'పెళ్లికానుక' చిత్రానికి ముందు కొన్ని చిత్రాలలోను, తర్వాత కొన్ని చిత్రాలలోనూ దీపావళికి సంబంధించిన పాటలు మొత్తం ఓ పదిలోపే వచ్చినా ఈ 'ఆడేపాడే పసివాడా' పాటే ఎక్కువ కాలం సజీవంగా ఉన్నదని చెప్పాలి. చెరువు ఆంజనేయశాస్త్రి ఈ పాటను కార్తిక్ అనే పేరుతో రాశారు.

ఆడేపాడే పసివాడా
అమ్మలేని నిన్ను చూడా
కన్నీటి కథ ఆయె దీపావళి ॥ఆడే॥
ఊరెల్ల వెలుగు ఆనందం మనకు
కనరాని దూరమురా కనరాని దూరమురా
నెనరెల్ల అనలాన నీరైన నాడు
నెమ్మది మనకింక కనరాదు ॥నెన॥
ఇలవేల్పు వలె ఇంట వెలసిన దేవి ॥ఇల॥
మమతే మరచి మరుగైనదేమి
కన్నులలోని కాంక్షలు అన్నీ
కలలాయె నేటికిరా కలలాయె నేటికిరా
అనురాగమన తానె
అనిపించు దేవి
ఎనలేని భావాల పెనవేసి ॥అనురాగ॥
పాశము తెగతెంచి మోసము చేసి ॥పాశము॥
బ్రతుకే మనకు బరువైపోయె
నిన్నటి కథలే నేటికి వ్యథలలై
నిను నన్ను వేధించెరా
నిను నన్ను వేధించెరా



సంతోషంగా వచ్చే 'ఆడే పాడే పసివాడా' పాట ట్యూన్‌ని కాస్త స్లో చేసి విషాదం మేళవించి 'ఆడే పాడే పసివాడా అమ్మలేని నిను చూడా' అంటూ ఏ.ఎం. రాజా పాడగా అక్కినేని అభినయించారు. మస్టర్ బాబు కూడా కనిపిస్తాడీ పాటలో. ఈ విషాద గీతాన్ని ఆచార్య ఆత్రేయ రాశారు. మొదటి చరణంలో వున్న 'నెనరెల్ల అనలాన నీరైన నాడు నెమ్మది మనకింక కనరాదు' వాక్యంలోని పదాలు - సినీ సాహిత్యంలో అరుదుగా వినిపిస్తూ ఉంటాయి. ముఖ్యంగా 'నెమ్మది' అనే పదాన్ని 'శాంతం' అనే అర్థంతో ఆత్రేయ వాడడానికి కారణం ఆయన పెరిగిన సూళ్లూరిపేటలోని మాండలికమే కారణం అని ఒక విశ్లేషణ కూడా ప్రచారంలో వుంది.

అను పల్లవిలో వచ్చే 'ఆనందం మనకు కనరాని దూరమురా' అనే వాక్యాన్ని ట్యూన్ పరంగా విడగొట్టి 'ఊరెల్ల వెలుగు'తో 'ఆనందం మనకు'ని జత చేయటం వల్ల అర్థాన్ని వివరించాల్సి వస్తే 'అది మనకు కనరాని దూరమురా' అని అనుకోవలసి రావటం ఓ విధంగా బాధపడాల్సిన విషయమే. ఇదిలా ఉండగా ఆత్రేయ సాహిత్యంపై వచ్చిన సినీ గీతాల సంకలనంలో ఈ పాటకి సంబంధించిన రెండో చరణంలో 'అనురాగమున తానె' అని ఉంది. నిజానికి 'అనురాగమనతానె' అన్నదే కరెక్టు.

ఈ రెండు పాటలకి ఎక్కువగా రాగశ్రీ రాగాన్ని, అక్కడక్కడా జయ జయ వంతి రాగాన్ని ఉపయోగించారు. రెండో పాటలో 'ఇలవేల్పు వలె ఇంట వెలసిన దేవి' దగ్గర 'పాశము తెగ తెంచి మోసము చేసి' దగ్గర వినిపించే ఇంటర్‌లూడ్‌కి భాగేశ్వరి రాగాన్ని వాడుకున్నారు. విషాదాన్ని మరింతగా ప్రతిఫలింపజేయడానికి ఆ రాగం అక్కడ బాగా ఉపయోగపడింది. మొదటి పాటకి పల్లవి ఒకసారైనా రిపీట్ అవుతుంది కానీ రెండో పాటలో పల్లవి ఎక్కడా రిపీట్ కాకపోవడం గమనార్హం.

**1. తీరెనుగా నేటితో - నీ**
**తీయని గాధా**
**మిగిలిపోయే నీ మదిలో**
**మాయని బాధా** ॥తీరెనుగా॥
**రాగముల పంట జూడ కోరిన వేళా**
**త్యాగములే మీరరాని శోధనలాయె** ॥రాగము॥
**బలి ఆయె నీదు ప్రేమ పాశానికీ**
**కరిగిపోయావె కర్పూరమై** ॥తీరెనుగా॥





**2. తీరెనుగా నేటితో - నీ**
**తీయని గాధా**
**మిగిలిపోయే నీ మదిలో**
**మాయని బాధా**
**ప్రేమమయీ నాట్యమాడ మేడలు కట్టీ**
**ఘన విషాద నాటకమ్మూ కన్నుల జూసి** ॥ప్రేమ॥
**నీ ప్రేమ ధారబోసి దైవానికీ**
**కదలీపోయావే ఏకాకివై**
**నీ ప్రేమ ధారబోసి దైవానికీ**
**కదలీపోయావే ఏకాకివై**




ఈ స్వర ఖండికలు రెండూ ఒకే వరసపై ఆధారపడినా, రెండు వేర్వేరు సన్నివేశాలలో వస్తాయి. మొదటి స్వరఖండికను బి.సరోజాదేవిపైనా, రెండవ స్వరఖండికను అక్కినేని నాగేశ్వరరావుపైనా చిత్రీకరించారు. రెండు స్వర ఖండికలూ మిశ్ర శివరంజని రాగంపై ఆధారపడి స్వరపరిచినవి. సీనియర్ సముద్రాల అందించిన బరువైన సాహిత్యం కన్నా స్వరకల్పనలోని గాఢతయే ఈ స్వర ఖండికల్ని జనహృదయాలకు దగ్గర చేసిందని చెప్పాలి. 'అనగ అనగ రాగమతిశయిల్లుచునుండు' అన్నట్టు ఈ స్వరఖండికలకు జతపడ్డ వరసను - పాడుకొంటున్న కొద్దీ స్వరకర్త కున్న డెప్త్‌ను మనసుతో చూడగలిగే శక్తి వస్తుంది.

పొన్నలూరి వారి 'శోభ' చిత్రానికి తొలిసారిగా సంగీత దర్శకత్వం వహించిన ఎ.ఎం.రాజా తరువాత కొన్ని తమిళ చిత్రాలకు, ఒక మలయాళ చిత్రానికి సంగీతాన్ని ఇచ్చారు. 'పెళ్లికానుక' చిత్రానికి మాతృక అయిన 'కళ్యాణ పరిసు' చిత్ర సంగీత దర్శకుడిగా తమిళనాట ఉత్తమ సంగీత దర్శకుడిగా ఆ సంవత్సరానికి ఆయన ఎంపికయ్యారు కూడా. తాను సంగీత దర్శకత్వం వహించిన చిత్రాలన్నీ మ్యూజికల్ హిట్టే అయినా కూడా సంగీ దర్శకుడిగా ఎ.ఎం.రాజా నిలదొక్కుకోకపోవటం పరిశ్రమకు దూరంగా ఉండే సంగీతాభిమానులకు ఇప్పటికీ ఓ శేష ప్రశ్నే...! ■


చదువులావు
సత్యమూర్తి BV
మనం ఒక సినిమా తీద్దారి
మనకెంతైతైపా...
హైద్రాబాడ్‌లో మన చదువులావున్నాడులు కదా? ఆడిశా సెప్పితీయుద్దారి
ఈళ్లంతా మన ఊరోళ్ళు అబ్బాయ్యా. మనం మాంఛి పిచ్చరు తీయాల. హిట్ కొట్టాల. ఇదిగో డబ్బు
హిట్ కొట్టాలి. అంతేకదా? నాకొదిలేయుండి. నేను చూసుకుంటాను
2 నెల్లయ్యాక_
రెడీగాఉందేమో చూద్దామని వచ్చాం
అంతా రెడీయే. హిట్ కొట్టడమే తరువాయి

## ఇది జరిగిన కథ

బెరెలీ నగరవాసి శ్రీ బాదామీలాల్ సక్సేనా కుమారుడు నాలుగేళ్ళ బాలుడు సునీల్‌దత్‌కు పూర్వజన్మ జ్ఞానం కలిగింది. ఆ కుర్రాడిని మొన్న బడిలో వేయబోతే అతను ఒప్పుకోలేదు. "నేను సేఠ్ కృష్ణాను - నేను (క్రిందటి జన్మలో) కట్టించిన పాఠశాల బుడాన్‌లో వుంది. అక్కడే చదువుకుంటాను-" అన్నాడట - తల్లిదండ్రులు ఆశ్చర్యపోయి అతనిని బుడాన్ (వుత్తరప్రదేశ్) పట్టణము తీసుకెళ్లారు. నిజంగానే అక్కడ సేఠ్ కృష్ణా పాఠశాల వుంది. సేఠ్ కృష్ణా అక్కడ ఆయిల్‌మిల్ అధిపతి. 1951లో మరణించాడు. తరువాత బాలుడు సునీల్‌దత్‌ను కృష్ణా ఆయిల్‌మిల్స్‌కు తీసుకెళ్ళారు. అక్కడి పాతనౌకరు షాఫత్‌ను గుర్తుపట్టాడు. పేరుపెట్టి పిలిచాడు. మిల్లులో ఏమూలో పడివున్న పాతబోర్డు, దానిమీద తన పేరున్న వైనం చూపించాడు. తరువాత అతన్ని కీ॥శే॥సేఠ్ కృష్ణా భార్య శకుంతలాదేవి దగ్గరకు తీసుకువెళ్ళారు. కొద్ది క్షణాల సేపు "భార్యాభర్తలు" ఇద్దరూ కన్నార్పకుండా ఒకరినొకరు చూసుకున్నారు. ఇద్దరూ జలజలా కన్నీరు కార్చారు. సునీల్‌దత్, ఆమె భర్తలాగే భుజంతట్టి చెక్కులు నిమిరి ఓదార్చి వచ్చేశాడు... ఇంకా ఇలాటివి మరికొన్ని దాఖలాలు చూశాక తల్లిదండ్రులు బిడ్డని తీసుకొని స్వగ్రామం వెళ్ళిపోయారు.

ఆంధ్రప్రభ -దినపత్రిక - జనవరి 4

ఇది అక్షరాలా జరిగిన సంఘటన. ఇట్టిదే రెండేళ్ళ క్రితం లాహోర్‌లో సంభవించింది. ఇలాటివి అరుదు కాని; అసంభవాలు కావు.

ఆత్మజ్యోతి ఆరనిజ్యోతి. దీనికి జనన మరణాలు లేవు. ఒక దేహం ధరిస్తుంది - విడుస్తుంది. మరోదేహం ధరిస్తుంది. పుట్టిన ప్రతిజీవి చనిపోవడం ఎంత సత్యమో చనిపోయిన ప్రతిజీవి తిరిగి పుట్టడం కూడా అంత సత్యం. అయితే అలా పునర్జన్మలు ఎత్తేవారిలో పూర్వజన్మజ్ఞానం ఎక్కడో కోటికొక్కరికే వుంటుంది.

అటువంటి జ్ఞానం కలిగిన ఒక వ్యక్తి కథే బాబూ మూవీస్ వారి "మూగమనసులు".

రచన : ఆచార్య ఆత్రేయ  పాడినవారు : ఘంటసాల, సుశీల

ఈనాటి ఈబంధమేనాటిదో, ఏనాడు పెనవేసి ముడివేసెనో ॥యీనాటి॥
రాధ : మబ్బులు కమ్మిన ఆకాశం,
మనువులు కలిసిన మనకోసం ॥మబ్బులు॥
గోపి : చలువల పందిరి వేసింది,
తొలి వలపుల చినుకులు చిలికింది ॥యీనాటి॥
గోపి : నీ జతలో చల్లదనం - నీ ఒడిలో వెచ్చదనం ॥నీ జతలో॥
రాధ : నీ చేతలలో చిలిపితనం - చిత్తంలో వలపుధనం
నీ చేతలలో... చిలిపితనం - చిత్తంలో వలపుధనం
గోపి : అనుభవించి క్షణం క్షణం పరవశించనా
రాధ : పరవశించి దినం దినం కలవరించనా ॥యీనాటి॥
రాధ : ఎవరు పిలిచారనో ఏమి చూడాలనో,
ఎవరు పిలిచారనో ఏమి చూడాలనో,
ఉప్పొంగి ఉరికింది గోదావరీ
గోపి : చెలికాని సరసలో సరిక్రొత్త వధువులో,
చెలికాని సరసలో సరిక్రొత్త వధువులో, తొలినాటి
భావాలూ తెలుసుకోవాలనీ ఉప్పొంగి ఉరికింది గోదావరీ॥యీనాటి॥

రచన : దాశరథి  పాడినవారు : పి.సుశీల

గోదారి గట్టుంది - గట్టుమీద శెట్టుంది -
శెట్టుకొమ్మన పిట్టుంది -
పిట్ట మనసులో ఏముంది? ఓ ॥గోదారి॥
ఒగరు ఒగరుగా పొగరుంది,
పొగరుకుతగ్గ బిగువుంది ॥ఒగరు॥
తియ్యతియ్యగా సొగసుంది
సొగసునుమించే మంచుంది . ॥తియ్య॥ ॥గోదారి॥
యెన్నెల వుంది, యెండవుంది -
పువ్వా వుంది - ముల్లుంది
యెన్నెల వుంది, యెండవుంది -
పువ్వా వుంది - ముల్లుంది
యేది యెవ్వరికి యివ్వాలో యిడమరిసే ఆ ఆది వుంది ॥గోదారి॥
పిట్ట మనసు పిసరంతైనా పెపంచమంతా దాగుంది ॥పిట్ట॥
అంతుదొరకని నిండు గుండెలో -
ఎంత తోడితే అంతుంది ॥అంతు॥ ॥గోదారి॥

రచన : ఆచార్య ఆత్రేయ  పాడినవారు : ఘంటసాల, సుశీల

గోపి : నా పాట నీ నోట పలకాల శిలకా
నీ బుగ్గలో సిగ్గులొలకాల శిలకా
రాధ : నా పాట నీ నోట పలకాల చిలకా
గోపి : పలకాల శిలకా
రాధ : పలకాల చిలకా
గోపి : ఎహె! 'చి' కాదు - 'శి శి'.... పలకాల శిలకా
రాధ : పలకాల చిలకా
గోపి : ఆ‌(..... నీ బుగ్గలో సిగ్గులొలకాల శిలకా....
రాధ : నీ బుగ్గలో సిగ్గులొలకాల శిలకా.... ॥నా పాట॥
గోపి : పాట నువు పాడాల - పడవ నే నడపాల ॥2॥
రాధ : నీటిలో నేను నీ - నీడనే సూడాల ॥2॥
గోపి : నా నీడ సూశి నువు - కిలకిలా నవ్వాల ॥2॥
రాధ : పరవళ్ళ నురుగుల్ల గోదారి ఉరకాల ॥2॥ ॥నా పాట॥
గోపి : కన్నుల్లు కలవాల - యెన్నెల్లు కాయాల ॥2॥
రాధ : యెన్నెలకే మనమంటే - కన్ను కుట్టాల ॥2॥
గోపి : నీ పైట నా పడవ తెరసాప కావాల
ఆ... ఆ... ఆ...
రాధ : ఓ... ఓ... ఓ...
ఇద్దరు : ఓ... ఓ... ఓ...
గోపి : నీ పైట నా పడవ తెరసాప కావాల
రాధ : నీ సూపె సుక్కానిగా దారి సూపాల ॥నా పాట॥
రాధ : మనసున్న మణుసులే మనకు దేవుళ్ళు
మనసు కలిసిన నాడే మనకు తిరనాళ్ళు
మనసున్న మణుసులే మనకు దేవుళ్ళు
మనసు కలిసిన నాడే మనకు తిరనాళ్ళు
సూరె సెంద్రుల తోటి సుక్కల తోటి
సూరె సెంద్రుల తోటి సుక్కల తోటి
ఆటాడుకుందాము ఆడనే వుందాము
ఆటాడుకుందాము ఆడనే వుందాము
నా పాట నీ నోట పలకాల శిలకా
నీ బుగ్గలో సిగ్గులొలకాల శిలకా
నీ బుగ్గలో సిగ్గులొలకాల శి ల కా

రచన : కొసరాజు నేపథ్యం : ఘంటసాల, సుశీల, బృందం.

గోపి : గౌరమ్మా, నీ మొగుడెవరమ్మా?
ఎవరమ్మా, వాడెవరమ్మా? ॥గౌరమ్మా॥
గౌరి : శెప్పాలంటే సిగ్గుకదయ్యా
గోపి : ఆఁ.
గౌరి : ఆనవాళ్ళు నే సెబుతానయ్యా
మగకోరస్ : సెప్పు - సెప్పూ
గౌరి : సిగలో నెలవంక మెడలో నాగరాజు
ఆ రేడు నావాడు సరిరారు వేరెవరు
మామయ్యా, నా మొగుడెవరయ్యా? వేరెవరయ్యా?
ఆడకోరస్ : మామయ్యా నా మొగు డెవరయ్యా?
గోపి : ఇల్లూ వాకిలి లేనివాడు - లే... నీ... వా... డు....
మ. కో : లేనివాడు
గోపి : బిచ్చమెత్తుకుని తిరిగేవాడు - మాదాకోళం
మ.కో. : ఇల్లు వాకిలి లేనివాడు - బిచ్చమెత్తుకుని తిరిగేవాడు
గోపి : ఎగుడూ దిగుడు కన్నులవాడు జంగందేవర నీవాడా ॥గౌరమ్మా॥
గౌరి : ఆకాశమే ఇల్లు - లోకమే వాకిలీ
ఆ.కో : అవును
గౌరి : బిచ్చమడిగేది భక్తి, బదులు ఇచ్చేది ముక్తి
ఆ.కో: బిచ్చమడిగేది భక్తి, బదులు ఇచ్చేది ముక్తి
గౌరి : బేసికన్నులే లేకుంటేను, బెంబేలెత్తును ముల్లోకాలు
మామయ్యా నా మొగుడెవరయ్యా? ఎవరయ్యా? వేరెవరయ్యా?
ఆ : కో: మామయ్యా నా మొగుడెవరయ్యా?
గోపి : మొగుడు మొగుడని మురిశావే - కులికావే, పొగిడావే - పిల్లోయ్:
నెత్తిన ఎవరినొ ఎత్తుకుని, నిత్తెం దానినె కొలుసునట
అదియే ఆతని ఆలియట, కోతలు ఎందుకు కోస్తావే?
మొ.కో. : కోతలు ఎందుకు కో..స్తా..వే..?
గోపి : గౌరమ్మా, నీ మొగుడెవరమ్మా? ఎవరమ్మా వాడెవరమ్మా?
గౌరి : ఎవరో పిలిస్తే వచ్చింది, ఎవరి కోసమో పోతోంది,
మయాన్న మజిలీయేసింది
ఆ.కో: మయాన్న మజిలీయేసింది
గౌరి : సగం దేహమై నేనుంటే, అది పెళ్ళామంటే సెల్లదులే
పళ్ళు పదారు రాలునులే
ఆ.కో: పళ్ళు పదారు రాలునులే
గౌరి : మామయ్యో, నా మొగుడెవరయ్యా? ఎవరయ్యా? వేరెవరయ్యా?
ఆ.కో : మామయ్యా, నా మొగుడెవరయ్యా?

రచన : ఆచార్య ఆత్రేయ నేపథ్యం : ఘంటసాల, సుశీల

ఈనాటి ఈ బంధ మేనాటిదో, ఏనాడు పెనవేసి ముడివేసెనో॥యీనాటి॥
రాధ : చుక్కలు పొదిగిన ఆకాశం, మక్కువ లొలికే మనకోసం
గోపి : మంచు తెరలలో మల్లెలతో, పందిరిమంచం వేసింది॥యీనాటి॥
గోపి : నీ కనుపాపల ఊయలలో నే పసిపాపలా పవళిస్తా
రాధ : అనురాగము అను రాగమునే, ఆలపించి నిను లాలిస్తా
గోపి : నీలో నాలో నేనేలే
రాధ : మనలో మమతే చిరంజీవిలే
గోపి, రాధ : ప్రేమకు రూపం మనమేలే ॥యీనాటి॥
గోపి : నీ సిగ విరజాజినై - నీ యెద నెలరాజునై
రాధ : నీ నగవుల రాసినై - నీ మగసిరి దాసినై
గోపి : నీవూ నేనూ నిజమై బుజువై
రాధ : ఎన్ని యుగాలుగ వున్నామో
గోపి , రాధ : ఎన్ని జన్మలు కన్నామో ॥యీనాటి॥

రచన : ఆచార్య ఆత్రేయ పాడినవారు : ఘంటసాల

ముద్దబంతి పూవులో - మూగకళ్ళ వూసులో
ఎనక జనమ బాసలూ ఎందరికీ తెలుసులే ॥ముద్ద॥
పూలదండలో దారం దాగుందని తెలుసును
పాలగుండెలో ఏది దాగుందో తెలుసునా
నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి.
ఏ కన్నీటెనకాల ఏముందో తెలుసునా ॥ముద్ద॥
మనసు మూగదేకాని బాసుండది దానికి
చెవులుండే మనసుకే ఇనిపిస్తుందా ఇదీ
ఎదమీద ఎదపెట్టి సొదలన్నీ యినుకో
ఇనుకోనీ బతుకును ఇంపుగా దిద్దుకో ॥ముద్ద॥
ముక్కోటి దేవతలు మురిసి సూస్తుంటారు
ముందు జనమ బంధాలు ముడియేసి పెడతారు
కన్నోళ్ళ కన్నీళ్ళు కడుపుతీసి దీవెనలు
మూగమనసు బాసలు... ఈ మూగమనసు బాసలు
మీ యిద్దరికి సేసలు ॥ముద్ద॥

రచన : ఆచార్య ఆత్రేయ నేపథ్యం : జమునారాణి

కుహుఁ-ముక్కు మీద కోపం, నీ ముకానికె అందం - నా
బుంగమూతి సందం, నీ ముందరి కాళ్ళ బందం ॥ముక్కు॥
అడప దడప ఇద్దరూ, అలిగితేనే అందం,,
అలక తీరి కలిసేదే అందమైన బందం ॥ముక్కు॥
సిన్నదాని బుగ్గలకు సిగ్గొస్తే అందం
ఆ బుగ్గ మీద సిటికేసి దగ్గరొస్తే బంధం ॥ముక్కు॥
ఈడొచ్చిన పిల్లకు జోడుంటే అందం,
ఈడు జోడు కుదిరినాక మూడు ముళ్ళె అందం ॥ముక్కు॥
తల్లీ గోదారికీ ఎల్లువొస్తే అందం,
ఎల్లువంటి బుల్లోడికి పిల్ల గౌరి బందం ॥ముక్కు॥

రచన : ఆచార్య ఆత్రేయ పాడినవారు : పి.సుశీల

మానూ మాకునుకాను - రాయీరప్పను కానే కాను
మామూలు మణిసిని నేను - నీ మణిసిని నేను
నాకూ ఒక మనసున్నాదీ, నలుగురిలా ఆశున్నాదీ
కలలు కనే కళ్ళున్నాయి, అవి కలతపడితె నీళ్ళున్నాయి ॥మానూ॥
పెమిదను తెచ్చీ వొత్తినియేసీ, సమురును పోసీ బెమసూపేవా
ఇంతా శేసి యెలిగించేందుకు, ఎనకముందు లాడేవా ॥మానూ॥
మణిసితోటి యేలాకోళం, ఆడుకుంటే బాగుంటాది
మనసుతోటి ఆడకు మాఁవా, ఇరిగిపోతే అతకదుమల్లా ॥మానూ॥

రచన : ఆచార్య ఆత్రేయ పాడినవారు : ఘంటసాల

పాడుతా తీయగా సల్లగా, పసిపాపలా నిదరపో తల్లిగా,
బంగారు తల్లిగా ॥పాడుతా॥
కునుకుపడితే మనసుకాస్త కుదుటపడతది
కుదుటపడ్డ మనసు తీపి కలలు కంటది
కలలె మనకు మిగిలిపోవు కలిమి సివరకూ, ఆ
కలిమి కూడ దోచుకునే దొరలు ఎందుకు ॥పాడుతా॥
గుండె మంట లారిపే సన్నీళ్ళు కన్నీళ్ళు
వుండమన్న వుండవమ్మ శాన్నాళ్ళు
పోయినోళ్ళు అందరూ మంచోళ్ళు
వున్నోళ్ళు పోయినోళ్ళ తీపి గురుతులు ॥పాడుతా॥
మణిసిపోతె మాత్రమేమి మనసు వుంటదీ
మనసుతోటి మనసెపుడో కలసిపోతదీ
సావు పుటక లేనిదమ్మ నేస్తమన్నదీ
జనమ జనమ కది మరీ గట్టి పడతదీ ॥పాడుతా॥

# కథా సంగ్రహం

**ము**ద్దబంతి పూవులో - మూగకళ్ల వూసులో
ఎనక జనమ బాసలూ - ఎందరికీ తెలుసులే... కాని...
తెలుసుకోవాలనే తహతహ మాత్రం అందరికీ వుంటుందిగా -అందుకే చెపుతున్న దీ కథ...

అయితే ఇదో గొప్పవాడి కథయి వుంటుందనుకుంటారు గదూ - ఊహూఁ- గోదావరి మీద పడవ నడిపే గోపన్న కథ - గోపీ (అక్కినేని నాగేశ్వరరావు) గోదావరి ఒడ్డునే పుట్టి గోదావరి ఒడిలోనే పెరుగుతున్నవాడు- అతడికి నా అనేవాళ్లు ఎవ్వరూ లేరు - నావ మాత్రమే వుందొకటి - తన నావమీద రోజూ అమ్మాయి గారిని గోదావరి దాటించేవాడు. ఆ అమ్మాయి కలవారి బిడ్డ. వెలుగోటివారి ఆడపడుచు. వెలుగోటివారంటే గోదావరి సీమలోని గొప్ప భూస్వాముల కోవలోనివారు... వారి అమ్మాయి రాధ(సావిత్రి)... అంటే అమ్మాయిగారన్నమాట... అమ్మాయి గారంటే గోపీకెందుకో ఎక్కడలేనేని యిది!... అందుకనే రోజూ ఆప్యాయంగా తన ముంగిట్లో పూసిన ముద్దబంతి పువ్వు తెచ్చి ఆమెకిస్తూ వుంటాడు... పువ్వు యివ్వటమే కాదు, ప్రాణమివ్వమన్నా యిస్తాడు గోపీ ఆమె కోసం... గోదావరిలో దూకమన్నా దూకుతాడు. అమ్మాయిగారు నవ్వితే సన్నగా ఈణె మీటినట్టు - పాలపిట్ట పలికినట్టు - కోయిల కూన కూఁ కూఁ అని కూసినట్టుంటుంది గోపీకి - అమ్మాయిగారిని చూస్తుంటే - బుద్దెరిగి పదేళ్లే అయినా ఎన్నేళ్లగానో ఎరిగి వున్నట్టు అనిపిస్తుంది గోపీకి... వారిద్దరి ఈనాటి ఈ బంధ మేనాటిదో - ఏనాడు పెనవేసి ముడివేసినదో... అయితే గోపీకి మరొక ముందరకాళ్ల బంధం వుంది... గౌరి(జమున)... విరబూచిన అడవి పువ్వులా నవ్వుతూ - లేడిపిల్లలా గెంతుతూ - అడ్డూ ఆపూలేని జలపాతంలా పురకలు వేస్తూ - పాటలు పాడుతూ తిరుగుతూంటుంది గౌరి... అంతేకాదు...

తనని పెళ్లిచేసుకోమని గోపిని వేధిస్తూ కూడా వుంటుంది. గౌరినేమో రాధ మేనమామ రాజేంద్ర(నాగభూషణం) ఎలాగైనా వల్లో వేసుకోవాలని వెంటాడుతుంటాడు.

గోపీ రాధల మూగకళ్లలోని వూసులూ - మూగమనసుల్లోని మమతలు ఎవరూ గుర్తించలేదు. రాధని జమీందారు బిడ్డయిన జాస్తివారబ్బాయి (పద్మనాభం)కిచ్చి పెళ్లి చేస్తారు. కాని పాపం మూణ్ణెల్లయినా తిరక్కుండానే ముద్దబంతిలాంటి అమ్మాయిగారు వైధవ్యంతో వాడిపోయి తిరిగి వస్తుంది... ఆమె దుర్గతికి గోపి విలవిల్లాడి పోతాడు... వూళ్లో వాళ్లంతా గోపీ రాధల చనువుకు అతి నీచమయిన సంబంధాన్ని అంటకట్టి ఆడి పోసుకుంటారు. అపవాదు వేస్తారు. తననీ అమ్మాయి గారినీ బాగా ఎరిగున్న గౌరి కూడా నిందను నిజమని నమ్మి ప్రచారం చేయడంతో గోపీ క్షోభ పడిపోతాడు. అమ్మాయి గారికి వచ్చిన కళంకం మాసిపోవడానికి ఒకటే మార్గం తోస్తుంది.

గోపీ చచ్చిపోవడానికి నిశ్చయించుకుంటాడు - ఆ సంగతి తెలిసి - రాధ అతన్ని కాపాడడానికి వెడుతుంది. దాంతో రాజేంద్ర - రాధ గోపీతో లేచిపోయిందని - గోపీని కాల్చిపారేస్తానని తుపాకి తీసుకు బయలుదేరుతాడు. అమాయకురాలైన గౌరి ఆ రాజేంద్రకి తన శీలాన్ని బలియిచ్చి గోపీని కాపాడమని వేడుకుంటుంది. నావలో వున్న గోపీ, రాధలను రాజేంద్ర, జనం నాలుగు వైపుల్నుంచి చుట్టేయబోతారు. ఈ అబద్ధాల మధ్య బ్రతకడం కంటే సత్యమైన నిత్యమైన చల్లని గోదావరి తల్లి ఒడిలో ఒరగడమే మేలు అనిపిస్తుంది రాధకు. సుడిగుండాల్నయినా లెక్క చేయకుండా నావను సూటిగా పోనీయమంటుంది రాధ... గోపీ రాధలు గోదావరి గర్భంలో మునిగిపోతారు....

కాని కథ యిక్కడితో అయిపోలేదు - అసలు మొదలు పెట్టవలసిన చోట మొదలు పెట్టలేదీకథను. అంటే యింతవరకు చెప్పినదాంట్లో మొదలూ లేదు - చివరాలేదు... మొదట్నుంచి చివరిదాకా చూడటానికి మీరు మూడుగంటలూ చూడాల్సిందే "మూగమనసులు".






సి.సుందరం ఆదుర్తి సుబ్బారావు ముళ్లపూడి వెంకటరమణ ఆత్రేయ





కె.వి.మహదేవన్ కొసరాజు దాశరథి





ఘంటసాల సుశీల జమునారాణి

## నటీనటులు

నాగేశ్వరరావు, సావిత్రి, జమున, గుమ్మడి, నాగభూషణం, సూర్యకాంతం, పద్మనాభం, అల్లురామలింగయ్య, మల్లాది, బెనర్జి, నాగేశ్వరరావు, లక్ష్మీకాంతమ్మ, అన్నపూర్ణ, మాధవస్వామి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ-మాటలు | : ఆచార్య ఆత్రేయ, ముళ్లపూడి వెంకటరమణ |
| పాటలు | : ఆత్రేయ, కొసరాజు, దాశరథి |
| సంగీతం | : కె.వి.మహదేవన్ |
| నృత్య దర్శకుడు | : హీరాలాల్, పి.యస్.గోపాలకృష్ణన్ |
| కళ | : జి.వి.సుబ్బారావు |
| ఛాయాగ్రహణ దర్శకుడు | : పి.ఎల్.రాయ్ |
| ఆపరేటివ్ | : కె.ఎస్.రామకృష్ణ |
| శబ్దగ్రహణ దర్శకుడు | : వి.శివరాం, కె.హరనాథ్, సి.కృష్ణరాజు (సారధి) |
| సెకండ్ యూనిట్ దర్శకుడు | : కె.విశ్వనాథ్ బి.యస్.సి. |
| సెకండ్ యూనిట్ కెమెరామెన్ | : ఎమ్.కె.రాజు |
| మేకప్ | : కె.నాగేశ్వరరావు, పీతాంబరం, చౌదరి |
| దుస్తులు | : పి.రామకృష్ణ |
| స్టిల్స్ | : సత్యం (జైహింద్ స్టూడియోస్) |
| అసోసియేట్ డైరెక్టర్ & ఎడిటర్ | : టి.కృష్ణ బి.ఎ. |
| అసిస్టెంట్స్ | : కె.గోపాలరావు, ఆదుర్తి హరనాథ్ |
| ప్రొడక్షన్ | : వి.సి.గణేశన్ ఆర్ముగం ఆర్. మహదేవన్ |
| గ్రామఫోను రికార్డులు | : హెచ్.ఎం.వి. & కొలంబియా |
| స్టూడియో | : శ్రీ సారథి (హైదరాబాద్), వాహిని (మద్రాసు) |
| డిస్ట్రిబ్యూటర్లు | : శ్రీ ఫిలిమ్స్ |
| నిర్మాత | : సి.సుందరం |
| స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : ఆదుర్తి సుబ్బారావు |







తెలుగు సినీసాహితీ క్షేత్రంలో
శ్రీ వేటూరి సుందరరామమూర్తి
చేయని వ్యవసాయం లేదు.
తీయని ఫలసాయం లేదు.
తెలుగు సినిమా పాటకు సాహితీ
గౌరవాన్ని తెచ్చినవారు శ్రీ వేటూరి.
ఆయన పాటలీపుత్రుడు.
వేటూరి పొందిన జాతీయ అవార్డు,
నంది అవార్డులు, దేశవిదేశాలలో
సన్మానాలు గురించి ఎందరికో
తెలుసు గానీ ఎన్ని పాటలు రాసారో
ఆయనకే తెలియదు.
1972లో చిత్రసీమలో కాలుమోపిన
నాటినుండి ఈనాటి వరకూ వేటూరి
ఏ యే చిత్రాలకు ఎన్నెన్ని పాటలు రాశారో
వివరాలు సేకరించి, ఆ పాటల సాహిత్యాన్ని
క్రోడీకరించి ఒక గీతకోశం తయారుచేయాలని,
సాహితీమూల్యాలతో అలరారే ఆయన
గీతసాహిత్యాన్ని అయిదు సంపుటాలుగా
ముద్రించి సాహితీ అభిమానుల ముద్దు తీర్చాలని
**'వేటూరి సాహితీ సమితి'** సంకల్పించింది.
ఇదొక సాహితీయజ్ఞం.
శ్రీయుతులు యస్.పి.బాలసుబ్రహ్మణ్యం,
కీరవాణి, మణిశర్మ, కోటి వంటి హేమాహేమీలు
ఈ యజ్ఞంలో పాలు పంచుకుంటున్నారు.
వేటూరి పాటలు 32 వసంతాలుగా విలసిల్లుతున్న
మధురగీతాలు. వందలాది చిత్రాలకు వేలసంఖ్యలో
వేటూరి పాటలు రాశారు. ఇంటింటి పాటలుగా
తెలుగింటనే కాక తమిళ, కేరళ, కర్ణాటక రాష్ట్రాలలో
కూడా ఇంటిపేరుని నిలబెట్టిన ఆ పాటల సేకరణకు
అంకురార్పణ జరుగుతోంది. మీరు చేయవలసినదల్లా
'ఇంకు'రార్పణ మాత్రమే!
ఆయన తొలిపాట నుంచి యిప్పటి పాటవరకు
మీవద్దనున్న పాటల పల్లవి, సినిమా పేరు జాబితా
రాసి పంపితే చాలు. ఒకవేళ ఆ పాట వివరాలు
మా వద్ద లేకపోతే పూర్తి సమాచారానికై మిమ్ములను
కోరడం జరుగుతుంది. అప్పుడు పాట పల్లవి,
చరణాలు పూర్తిగా రాసి గాయనీగాయకులు,
సంగీతదర్శకుడు, నిర్మాణసంస్థ తదితర వివరాలతో
సహా పంపవలసి వుంటుంది. ఆ విధంగా సహకరించిన
వారిని తగు రీతిగా సత్కరించడం జరుగుతుంది.
ఈ సమాచార సేకరణలో 'హాసం' తన వంతు
సహకారం అందజేస్తోంది. మీ వద్దనున్న ప్రాథమిక
సమాచారం (పల్లవి, సినిమా పేరు)
అక్టోబరు 31, 2003 లోగా ఈ క్రింద నున్న
'హాసం' అడ్రసుకు పంపండి - కవరుపై
'వేటూరి గీతకోశం' అని స్పష్టంగా పేర్కొనండి.

## వేటూరి గీతకోశం

కేరాఫ్ 'హాసం', 502, శ్రీ బాలాజీ నిలయం,
13-1-212, మోతీ నగర్, హైదరాబాద్ 500018